# చతుర

జనవరి 1984

సంపుటి : 6 సంచిక : 12

## ఈ నెల సమగ్ర నవల

ఊరంతటికీ ఇష్టుడై, అజాతశత్రువుగా అందరి అభిమానం చూరగొన్న డాక్టర్ విచిత్రంగా మృత్యువు పాలయ్యాడు. అతని భార్య దీర్ఘకాల అనారోగ్యానికి గురయింది. చెల్లెలు బావిలోపడి మరణించింది. ఊరిలో భీతావహ పరిస్థితి నెలకొంది. వీటన్నింటికీ దయ్యాలు, చేతబడులే కారణం అని అందరూ నమ్ముతూంటే చివరికి ఆ ఊరి మంత్రగాడే భయంకర పరిస్థితుల్లో...




...అయిపోయాడు. ఊరు మొత్తం భీతావహ వాతావరణంలో అట్టుడికిపోసాగింది. క్షుద్రశక్తులు, చేతబడులు, దయ్యాల బారినుండి గ్రామాన్ని కాపాడాలనుకునేవారికి దిక్కుతోచని విధంగా సంఘటనలు చకచకా సాగిపోయి, చివరికి తేలిందేమిటి?

## కె.వి.మోహన్

సమర్థవంతంగా చిత్రించిన సమకాలీన గ్రామరాజకీయాల వాస్తవ విశ్లేషణ ఈ నెల చతుర సమగ్ర నవల 'బలి'.

ముఖచిత్రం : కె. వి. శ్రీహరి

రెండవ కవరు :
మూడవ కవరు : } శ్రీనగేష్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# చతుర ప్రపంచం



## చంద్రలోక యాత్ర

కొండమీది కోతిని, చుక్కల్ని నీ పాదాల ముందు నిలుపుతాను; చంద్రుడిని నీ సిగలో పూవుగా అమరుస్తానంటూ తెగ ఆవేశపడిపోయే ఆధునిక ప్రేమికులు ఇకనుంచి ప్రేయసులకు చంద్రమండల యాత్ర చేయిస్తానని మాట ఇవ్వవచ్చు. ఎటొచ్చీ పర్సు కాస్త బరువు తూగేలా చూసుకోవాలంతే

చంద్రుడిమీదికి ప్రయాణం ఇప్పటి విదేశీ ప్రయాణంలా సర్వసాధారణమై పోగల రోజులు రానున్నాయని అంతరిక్ష ప్రయాణ ఏజెంట్ జార్జ్ హాట్టెమ్ గట్టిగా చెబుతున్నాడు. ఇతను న్యూయార్క్‌లోని వెరైటీ ట్రావెల్ సర్వీస్‌కు అధ్యక్షుడు. అమెరికా నేషనల్ ఏరోనాటిక్ అండ్ స్పేస్ ఎడ్మినిస్ట్రేషన్ (నాసా) అధికారికంగా అంగీకరించిన ఏకైక స్పేస్ ట్రావెల్ ఏజెంట్ జార్జ్.

1967లో ఇతను చంద్రగ్రహ ప్రయాణపు బుక్కింగులకు అనుమతి ఇవ్వవలసిందిగా నాసాను కోరగా అప్పటి నాసా ప్రధాన నిర్వహణాధికారి అందుకు అనుమతి ఇచ్చారు. జార్జ్ హాట్టెమ్ మొదటి ప్రకటనానుసారం పదిడాలర్ల ఫీజుతో ఓ అరవైమంది ముందుకి వచ్చారు. మరో పదిహేనేళ్ళలో సామాన్య ప్రజలుకూడా అంతరిక్షయాత్ర చేయ వీలవుతుందని జార్జ్ జోస్యం చెబుతున్నాడు. 1984 లోపల ఏస్ట్రొనాట్స్‌లా శిక్షణ పొందకుండానే ఆరోగ్యవంతుడైన మామూలు మనిషి రోదసీ నౌకలో ప్రయాణించే అవకాశం వుందంటున్నాడు.

నాసా అధికారులు స్పేస్ ట్రావెల్ ఏజెంట్‌కు అనుమతి ఇవ్వడానికి కారణం వుంది. అంతరిక్ష ప్రయాణ కార్యక్రమాలు

చాలా వ్యయంతో కూడుకొన్నవి. పైగా ప్రజల సంక్షేమానికి బదులు రోదసీ ప్రయోగాలకి ఎక్కువ డబ్బు వృధా చేస్తున్నారన్న అభియోగం వుంది. ఈ అపోహలు పోయి, నాసా కార్యక్రమాలకు కాస్త ప్రచారం లభించడం కోసం జార్జ్ హర్బెమ్‌ను ఏజెంట్‌గా అంగీకరించారు.

ఈ యాత్రకి ఆరోగ్యంగా వున్న పద్దెనిమిది, డెబ్బై ఏళ్ళ మధ్యవారు అర్హులు. 2000 సంవత్సరం నాటికి వ్యాపార సంస్థలు వ్యాపారస్థాయిలో అంతరిక్ష ప్రయాణాలను నిర్వహిస్తాయని ఇతని అంచనా. చంద్రలోక యాత్ర చేయాలని వున్నవారు జార్జ్ హర్బెమ్‌ను సంప్రదించవచ్చు. పైగా ప్రప్రథమ అంతరిక్ష యాత్రకు సిద్ధపడే సామాన్యుడిని ఉచితంగా తీసుకువెళతారట కూడా. మీ అదృష్టం పరీక్షించుకోండి. ఫ్రీగా చంద్రుడిని చుట్టిరావచ్చు.

## మనసు తత్వం

మనసు చాలా అగాధమైనది; అది ఓ పట్టాన అంతుచిక్కదని పూర్వం అనేవాళ్ళు. ఇప్పుడేమో మన తిండి అలవాట్ల నుంచి వాడే టూత్ పేస్ట్ వరకూ అన్నీ మన మనసు తాలూకు రహస్యాలను బయటపెడతాయని ప్రకటించేస్తున్నారు.

అమెరికా సైకాలజిస్ట్ హెర్బర్ట్ హాఫ్‌మన్ ఎవరైనా టూత్‌పేస్ట్‌ను వాడే తీరునుబట్టి ఆ మనిషి మనస్తత్వం ఎలాటిదో గ్రహించవచ్చునంటున్నాడు. టూత్ పేస్ట్ ట్యూబ్‌ను అడుగునుంచి క్రమంగా పైకి నొక్కుతూ వాడేవారయితే జీవితాన్ని ఒక పథకం ప్రకారం, నియమానుసారం గడుపుతారట. వీరికి క్రమశిక్షణలోనూ, ప్లానింగ్‌లోనూ నమ్మకం



వుంటుందట! అలాగాక ట్యూబును మధ్యలోనే అక్కడక్కడా నొక్కి ఇష్టం వచ్చినట్లు పేస్ట్‌ను తీసి వాడి పారేసేవారు తలుచుకున్నా క్షణాన్నే అన్నీ జరగాలని కోరుకుంటారట. వీరు సంభాషణా సమయంలో ఎక్కువగా జోకులేస్తూ ఇతరులతో సులభంగా కలిసిపోగలరు. జీవితంలో ఎదురయ్యే మార్పులకి తేలిగ్గా అలవాటుపడిపోతారు.

టూత్ పేస్ట్ ట్యూబ్‌ను అడుగునుంచి వాడటమేగాక ఓ క్రమంలో చుట్టబడుతూ వచ్చేవారు ప్రతిదీ లోపం లేకుండా జరగాలనుకుంటారు. ఇతరుల్లో ఎక్కువ లోపాలను ఎత్తి చూపిస్తుంటారు. అదేసమయంలో వారికి సహాయపడుతుంటారు కూడా.

టూత్ పేస్ట్ మూత పెట్టకుండా అలాగే వదిలి వెళ్ళేవారు చాలా ధైర్యవంతులు, స్వతహాగా సాహసులు. వీరికి వల్లకొచ్చి ముంతదాచడం ఇష్టం వుండదు. ఏ

విషయాన్నయినా సూటిగా చెప్పేస్తారు. సిగ్గుపడియాలు వుండవు. ఏమి ఎదురైనా పర్వాలేదు అనుకుంటూ ఉద్యోగం చేస్తారు.

మానసిక విశ్లేషణ ఇంత సులభమై పోయిందీ రోజుల్లో.

## బాల వృద్ధురాలు

'ఇరవైలో అరవై వయసు' రావడంలో పెద్ద ఆశ్చర్యం లేదు. కాని ఐదేళ్ళకే ఏనభై ఏళ్ళ వృద్ధాప్యం రావడం మాత్రం వింతే! అలాంటి వింత బాల వృద్ధురాలు



బెన్నివాండ్ ప్రస్తుతం అమెరికాలో కాలిఫోర్నియాలోని శాండిగో శిశుసంక్షేమ కేంద్రంలో వుంది. ఈమెను రకరకాల వైద్యనిపుణులు పరీక్షిస్తున్నారు.

ఐదేళ్ళ ఈ చిన్నారిలో 80 ఏళ్ళ వృద్ధులకి వుండే లక్షణాలన్నీ కనిపిస్తున్నాయి. నరాల బలహీనత రావడం, జుత్తు రాలిపోవడం ముఖం మీది చర్మం ముసలివారికి మల్లే ముడుతలు పడిపోవడం జరిగింది.

నిజానికి బెన్ని అందరు పిల్లల్లానే ఏవిధమైన లోపం లేకుండానే పుట్టింది. మొదటి పుట్టినరోజును పాలబుగ్గలతో, బోసి నవ్వులతో సరదాగా జరుపుకుని ఆరోగ్యంగానే పెరిగింది. కాని ఆవెంటనే వృద్ధాప్యపు ఛాయలు కనిపించడం మొదలుపెట్టాయి. ముఖంమీద, శరీరం మీద చర్మం ముడుతలు పడటం ప్రారంభించింది. కంటిచూపు క్షీణించింది. రక్తపోటు పెరిగింది. ముసలితనంలో వచ్చే పరధ్యానం అలవడింది. గ్యాస్ట్రిక్ అల్సర్, విపరీతమైన కీళ్ళ నొప్పులు మొదలయ్యాయి. తీవ్రమైన నరాల బలహీనత ఏర్పడింది. కొంతకాలానికి వృద్ధాప్యానికి సంబంధించిన అన్నిరకాల లక్షణాలు ప్రముఖంగా కనిపించసాగాయి.

డాక్టర్లు ముందు బెన్ని చర్మం ముడుతలు పడకుండా మందులిచ్చారు. దానివలన కొంత ఫలితం కనిపించినా వస్తున్న వృద్ధాప్యాన్ని మాత్రం ఆపలేకపోయారు. బెన్ని ఎన్నోఏళ్లు బతకదని డాక్టర్లు ధృవీకరించారు. ఎందుకంటే ప్రస్తుతం ఆమెకి వృద్ధాప్యంలో వచ్చే జబ్బులన్నీ వచ్చాయి.

ఆమె శరీరం చాలా బలహీనమైపోయింది. ప్రస్తుతం డాక్టర్లు కారణాల కోసం బెన్ని కుటుంబ చరిత్రనంతా తిరగేస్తున్నారు. ఇలాంటి వ్యాధి ఆ కుటుంబంలోని పూర్వీకులకేమయినా వచ్చిందేమోనని పరిశీలిస్తున్నారు.

మరణానంతరం వైద్య పరిశోధనల

నిమిత్తం జెన్ని శరీరాన్ని ఇచ్చివేయ డానికి జెన్ని తల్లిదండ్రులు అంగీక రించారు. పోస్ట్‌మార్టమ్ అనంతరమే ఈ అకాల వృద్ధాప్యానికి కారణాలేమిటో డాక్టర్లు చెప్పగలరు. అప్పటివరకూ ఇదొక వైద్య వింతగా మిగిలిపోతుంది.

## ప్రాణం ఖరీదు

పువ్వులూ, పాపలూ ఒకలాంటివారే. పసిపిల్లలు నేలమీది చుక్కల్లాంటివారు. ఈ వెన్నెల జాలువారే నవ్వుముఖాల పసిప్రాణం ఖరీదు కేవలం 125 రూపాయలని తేల్చి చెప్పిందీమధ్య ప్రపంచ ఆరోగ్య సంస్థ. ఈ లెక్క అభివృద్ధి చెందుతున్న, చెందని దేశాలకు మాత్రమే వర్తిస్తుంది.

ప్రపంచ ఆరోగ్యసంస్థ సమర్పించిన ప్రత్యేక నివేదిక ప్రకారం 120 లక్షల మంది పిల్లలు మొదటి పుట్టినరోజు జరుపు కోకుండానే మరణిస్తున్నారు. అంటే పుట్టినవారిలో పది శాతం సంవత్సరం లోపలే చనిపోతున్నారన్నమాట. మరో నాలుగు శాతం మంది పిల్లలు ఐదేళ్ళు రాకముందే చనిపోతున్నారు. అత్యంత సాధారణమైన, తేలిగ్గా నివారించగలిగిన డయేరియా(విరేచనాలు) 60 లక్షలమంది పిల్లల ప్రాణాలుతీస్తే, మరో 50 లక్షల మంది మీసల్స్ (అమ్మవారు), ధనుర్వాతం, కోరింతదగ్గు, పోలియో, డిఫ్తీరియా, టి.బి. వలన మరణిస్తున్నారు. మరికొన్ని వేలమంది న్యుమోనియా, మలేరియా వంటి వ్యాధుల వలన చని పోతున్నారు.

ఇవన్నీ కూడా నివారించ వీలయిన వ్యాధులే. ఈ వ్యాధులకు గురయి చని పోతున్న పిల్లలను కాపాడటానికి ఒక్కొక్కరికి కేవలం 125 రూపాయలు మాత్రమే అదనంగా ఖర్చవుతుంది. ప్రపంచంలోని 25 అత్యంత పేద దేశాలు ఒక్కొమనిషి ఆరోగ్యం కోసం 26 రూపాయలు మాత్రమే ఖర్చు చేయగలుగు తున్నాయి. కొంచెం అభివృద్ధి చెందిన 85 దేశాలు మనిషి ఒక్కంటికి 170 రూపాయలు ఖర్చుచేస్తున్నాయి. అయితే ఈ ఖర్చుచేసే నిధుల్లో మూడు వంతులు అల్ప సంఖ్యాక ప్రజల సౌకర్యాలకు వినియోగించబడుతోంది. మిగిలినవారు సరైన సౌకర్యాలు అందక రోగాలతో



కృశించిపోతూ మరణిస్తున్నారు. లేదా జీవచ్ఛవాల్లా బతుకుతున్నారు. ఈ పరిస్థితి మారేది ఎన్నడో? పసిపిల్లల ముఖాలు కళకళలాడేది ఎప్పుడో??

## ప్రవేశపెడుతున్నాం
## టియారా హెర్బల్ సబ్బు
## మీ వంటిని కోమలంగా నున్నగాచేసే
## ప్రకృతి సహజమైన నూనెలతో.

టియూరా హెర్బల్ సబ్బు, ప్రకృతిలో లభించే మూడు వనమూలికల సమ్మేళనం. ప్రకృతి సహజమైన నూనెలతో మీ వంటిని కోమలంగా రూపొందిస్తూ, దాంతోబాటే శుభ్రపరచి, తాజాదనాన్నిస్తుంది. టియూరా హెర్బల్ సబ్బుతో స్నానంలోని ఆ అనుభవాన్ని పొందండి. ఆ కోమలత్వపు సౌందర్యంతో అలాగే ఉండండి— కేవలం ప్రకృతే యివ్వగల ఆ తీరులో.




**మీ వంటికివచ్చే ప్రకృతి సహజమైన కోమలత్వం.**

# టాల్కం పౌడర్

మన దినవారీ కార్యక్రమాలలో మనకు తెలీని విషయాలు చాలా వుంటాయి. ప్రకటనల మాయలో పడిపోయి కంటికింపుగా వుండే వస్తువులు కొనేస్తాం తప్ప వాటితయారీ గురించిన పరిజ్ఞానం మనకు ఏమాత్రం వుండదు. ఉదాహరణకి మనం రోజూ రాసుకొనే టాల్కం పౌడర్‌నే తీసుకోండి. తెల్లగా, కొంచెం మెరుస్తూ సువాసనలు వెదజల్లే మెత్తటి టాల్కం పౌడర్ నిజానికి అభ్రకం అంటే ఆశ్చర్యం వేస్తుంది కదూ?

అభ్రకం అంటే నున్నగా, మెరుస్తూ మెత్తగా పొరలు పొరలుగా వుండే ఒక ఖనిజం. టాల్కమ్ అంటే అభ్రకమనే అర్థం. మానవుడు ఇప్పటివరకు కనుగొన్న ఖనిజాలలోకెల్లా మృదువైన ఖనిజం అభ్రకమే. మెతగా పొడి చేయబడిన అభ్రకాన్ని మెగ్నీషియం పౌడర్ (చూర్ణం)లో కలిపి ఆ మిశ్రమానికి మరికొన్ని రసాయనాలు కలిపితే మనం వాడే టాల్కం పౌడర్ తయారవుతుంది.

మనం సౌందర్య సాధనాల్లో ఉపయోగించే పౌడర్ రూపంలో దొరకదు అభ్రకం. ఇది మెరుస్తున్న రాళ్ళ రూపంలో లభిస్తుంది. దీని సోప్‌స్టోన్ అని కూడా పిలుస్తుంటారు. ఈ ఖనిజానికి చిన్నరంధ్రాల్లా వుండి ఉపరితలాన కెంపు పసుపు రంగులు కనిపిస్తుంటాయి. నాణ్యమైన అభ్రకం ఇటలీలో లభిస్తుంది. అభ్రకం నిక్షేపాలు ఇంగ్లండ్, కెనడా, జర్మనీ, రొడీషియా దేశాల్లో కూడా కనిపిస్తుంటాయి.



పాశ్చాత్యదేశాల్లో అభ్రకం రాయితో అందమైన పాత్రలను తయారు చేస్తున్నారు. అందుకని వారు అభ్రకాన్ని 'పాట్‌స్టోన్' అని పిలుస్తుంటారు. అభ్రకానికి విలక్షణమైన గుణాలనేకం వున్నాయి. ఉష్ణోగ్రతను భరించగలగటాన దీన్ని అత్యధిక ఉష్ణోగ్రతకు గురిచేయబడే పదార్థాలుంచబడిన పాత్రలకు పూతగా ఉపయోగిస్తారు. ఇది ఏసిడ్స్ ఎడల రియాక్ట్ అవదుగనుక అన్నిరకాల ఏసిడ్లను నిలవ వుంచడానికి ఉపయోగిస్తారు. లోహాల్లో ఇది విద్యుత్ వాహకం కాదు. అతితక్కువ విద్యుత్తును గ్రహిస్తుంది. అందుకనే అభ్రకాన్ని స్విచ్ బోర్డుల్లోనూ, విద్యుత్ నిరోధకంగానూ ఉపయోగిస్తారు. పూర్వం ఈజిప్షియన్లు దుష్టశక్తులను పారదోలడానికి అభ్రకంతో తాయత్తులను తయారుచేసేవారు. మనం ముఖానికి రాసుకునే అభ్రకానికి ఇంత చరిత్ర వుంది. ✱

సాయంత్రం ఐదు గంటల సమయం. వాతావరణం మేఘావృతమై వర్షం వస్తుందన్నట్లుగా ఉంది. నిజానికి వారం రోజులుగా రోజూ వర్షం పడుతూనే ఉంది. పత్తి విత్తనాలు ఈ వర్షంలోనే వేయడం, మొలవడం కూడా జరిగింది. తడి ఆరకపోవడం మూలంగా జొన్న విత్తనం వేయలేదింకా.

వీధులన్నీ బురదతో గజిబిజిగా ఉన్నాయి.

డాక్టరుగారి ఇంటి వరండాలో నలుగురు పేషెంట్లు మాత్రం బల్లమీద కూర్చుని ఉన్నారు. లోపల డాక్టరు ఎవరితోనో మాట్లాడుతున్నాడు. కూర్చున్నవారికి ముళ్లమీద కూర్చున్నట్లుగా అసహనంగా ఉంది.

"ఈయన ఇప్పుడే బయటికి రాడేమో!" ఒక ముసలమ్మ నీరసంగా అంది. ఆమె ముఖం జ్వరంతగిలి వాడి పోయినట్లుంది.

"తొందరపడితే ఎలా? ఎవరితోనో మాట్లాడుతున్నట్లుంది" లుంగీ విదిలించుకుంటూ అన్నాడు ఒక యువకుడు.

వీళ్లు మాట్లాడుతూఉండగానే డాక్టరు బయటకు వచ్చాడు. మెడలో స్టెతస్కోప్ వేళ్లాడుతున్నది. ఆయనను చూసి అందరూ లేచినిల్చున్నారు.

"బాబూ! ఇంటికి వెళ్ళాలి. పిల్ల ఒక్కతే ఉంది" అంది ముసలమ్మ.

"అయిందమ్మా..పంపిస్తాను" అంటూ కుర్చీలో కూర్చుని ముసలమ్మను దగ్గరగా పిల్చి చెయ్యిపట్టి చూశాడు. నోటిలో థర్మామీటర్ పెట్టాడు. తీసిచూస్తూ "జ్వరం పెద్దగాలేదు అమ్మమ్మా! ఉదయానికల్లా తగ్గిపోతుంది. ఈ టాబ్లెట్స్ వేసుకో!" అంటూ రెండు బిళ్ళలు ఆమె చేతిలో పెట్టాడు. ముసలమ్మ బయటకు వెళ్తూ ఉండగానే ఒక యువకుడు తొందర తొందరగా లోనికివచ్చాడు. డాక్టరు అతడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"డాక్టరుగారూ! పల్లెలో సుందరయ్యగారి కోడలు ప్రసవించలేక బాధపడుతున్నది. మిమ్మల్ని అర్జంటుగా తీసుకరమ్మని నన్ను పంపించారు" అన్నాడు అతను చెమట తుడుచుకుంటూ.

"ఈ వర్షంలోనా?" అన్నాడు డాక్టరు నెమ్మదిగా. అక్కడున్న మిగిలిన వారిని కూడా చూసి పంపించేశాక "వర్షం వచ్చేలా ఉందే'' అన్నాడు ఆ యువకుడిని చూస్తూ.

"ఎట్టి పరిస్థితిలోనయినా మిమ్మల్ని తీసుకురమ్మన్నారు. ఉదయంనుండి నొప్పులతో బాధపడుతున్నది. ప్రాణాపాయం కలుగవచ్చునని భయపడుతున్నారు" అన్నాడా యువకుడు.

"సరే!" అన్నాడు డాక్టరు లేస్తూ.

ఆ ప్రాంతానికంతకూ ఆయన ఒక్కడే డాక్టరు. మూడు సంవత్సరాలుగా ప్రాక్టీసు చేస్తూ మంచివాడుగా, నెమ్మదస్తుడుగా పేరు పడ్డాడు. డాక్టరుకు ఉండవలసిన అన్ని లక్షణాలు ఉన్నవాడుగా గుర్తించబడ్డాడు. పట్నం సమీపంలోనేఉన్నా జనం ఈయన దగ్గరకే వస్తారు.

ఆ పల్లె చిన్నదేఅయినా ధనిక రైతులకు నిలయం. సనాతన ఛాందసాలకూ, పెత్తందారీతనానికీ ఆటపట్టు. సహజంగా గర్వపోతులయిన పెత్తందార్లు సాధారణ వ్యక్తికి విలువ ఇవ్వరు. డాక్టరుగా తగిన పేరు సంపాదించుకోవడంతో రఘు మాత్రం విలువ సంపా




దించుకున్నాడు వారి దృష్టిలో.

ఆ పల్లెనుండి కలుగొట్లకు మెటల్ రోడ్డు ఉంది. బస్సులు రావుగానీ ఎడ్ల బళ్లే వస్తాయి. ఎంత వర్షంలోనయినా సైకిళ్లు పోతుంటాయి.

కలుగొట్లలో సుందరయ్య మోతుబరి ఆసామి! పెత్తందారు! పెద్దమనిషి! రఘుకు మొదటినుండీ తెలిసినవ్యక్తి. వైద్య అవసరాలు ఏం వచ్చినా రఘునే పిలిపిస్తాడు ఆయన. కోడలు కాన్పు కాక పోవడంతో మనిషిని పంపించాడు ఇప్పుడు.

వస్తున్న రఘునుచూసి కుర్చీ తెప్పించి వేశాడు వసారాలో!

వస్తూనే "ఎలా ఉందండీ?" అన్నాడు రఘు. సైకిల్ తొక్కిన ఆయాసంతో అతనికి శరీరమంతా చెమటపట్టింది. పైగా ఒక్కొక్క చినుకే రాలుతున్నది ఆ సమయంలో.

"నొప్పులు పూర్తిగా ఉన్నాయండీ! అమ్మాయి బాధతో విలవిల్లాడిపోతున్నది. రండి లోపలకు" అన్నాడు సుందరయ్య.

ఇద్దరూ లోనికి వచ్చారు. మంచం మీదున్న పేషెంటును పరీక్షగా చూశాక చెయ్యిపట్టి నాడి చూశాడు. విపరీతమైన బాధతో మెలికలు తిరుగుతూ వికృతంగా ముఖం పెట్టి బాధ అణచుకోడానికి ప్రయత్నం చేస్తున్నదామె.

"మరేం ఫర్వాలేదు. ఇది సహజమే! ఇంజక్షన్ ఇస్తే కొంత నొప్పి తగ్గే అవకాశం ఉంటుంది'' అంటూ వేడినీళ్లు తెప్పించి సిరంజి కడిగి మందు ఎక్కించాడు. అక్కడున్న అందరి ముఖాల్లో ఆతృతను గమనించాడు. భుజం కింద కండరానికి ఇంజక్షన్ ఇచ్చాడు. సిరంజి కడిగి బాక్సులోపెట్టి బయటకు వచ్చాడు.

"ఫర్వాలేదంటారా?" అన్నాడు సుందరయ్య ఆయనతోపాటుకూర్చుంటూ.

"ఏమీలేదులెండి! ప్రతి స్త్రీకి ఇది సహజమేనండీ"

"ఏం సహజమో? ప్రసవమనేసరికి ప్రాణ భయమే. ప్రతి ప్రసవానికి చచ్చి బతుకుతూనే ఉంటారు. పైగా ఇది తొలి కాన్పుకూడా" అంది సుందరయ్య భార్య వారికి కాఫీ ఇస్తూ.

డాక్టరు నవ్వి "అది నిజమేనమ్మా!" అన్నాడు.

చీకటిపడుతున్నది. వసారాలో లైటు వేశారు. మబ్బులు దట్టంగా కమ్ముకుంటున్నాయి. ఒకటొకటే రాలుతున్న చినుకుల్ని లైటు వెలుతుర్లో చూస్తూ కూర్చున్నాడు.

మరికొంత సేపటికి ఆమె ప్రసవించింది. ఆ విషయం బయటకు వచ్చి సుందరయ్య భార్య చెప్పింది.

"సమయానికి మీరు రావడంవల్ల సుఖంగానే ప్రసవించింది"

తాను రాకున్నా ఆమె ప్రసవించి ఉండేది. తనవల్ల ఆమె సుఖంగా ప్రసవించిందేమీలేదు. అవిధంగా ఊహించుకుని వాళ్ళు తృప్తి పొందటం తప్ప. అదేమాట ఆయన అన్నాడు. కాని, పల్లెటూరివారి పద్ధతి వారిదే! ఖర్మకాలి ఆమె చనిపోయి ఉంటే, దానికి బాధ్యుడుగా వాళ్ళు తననే నిర్ణయించేవారేననే విషయం తలపుకు వచ్చి నవ్వుకున్నాడు.

"సరే! నేను వస్తానండీ!" అంటూ లేచాడు.

సుందరయ్య ఆశ్చర్యంగా అతనివైపు చూసి "ఈ వర్షంలో, చీకటిలో మీరు పోవడమా? కాదు కాదు. ఈరోజు ఇక్కడే ఉండాలి" అన్నాడు.

"లేదండీ! నా కోసం ఎవరో ఒకరు ఎదురుచూస్తుంటారు. నాబాధ్యత నేను నెర వేర్చానుగదా! ఇటువంటి అవసరమే మరొకరికి రావచ్చు. అందుకయినా వెళ్ళాల్సిందే గదండీ''

"మీరు వెళ్ళకూడదని కాదండీ! కానీ, ఈ సమయంలో మంచిది కాదు. పైగా సరయిన దారికాదు. చీకటి పడితే ఈ దారంట మనుషులు ఎవరూ తిరుగరు''

ఆశ్చర్యంగా సుందరయ్యవైపు చూసి "ఏమిటి? ఎందుకు తిరుగరు? దొంగల భయమా?'' అన్నాడు.

''దొంగలభయం కాదు; దెయ్యాల భయం! దారి మధ్యనున్న సంజీవయ్య బావివద్ద చీకటి పడితే దయ్యాలు ఆటకా యించనారంభిస్తాయి"

డాక్టరు పకపక నవ్వాడు. "ఈ కాలంలో కూడా ఇంకా ఈ దెయ్యాల పిచ్చేమిటండీ! అసలు దెయ్యాలనేవి ఎప్పుడూ లేవు. అవి మనుషులు సృష్టించు కున్నవి మాత్రమే!''

"మీరెన్ని చెప్పినా మేం నమ్మక తప్పదు డాక్టరుగారూ! ఈమధ్యనే అర్ధరాత్రి ఆ తోవవెంట ఈ సంగతి తెలియని కొత్తవ్యక్తి పోతుంటే గుండె మీద కాలేసి తొక్కి మరీ ఆ మనిషిని చంపిందో దెయ్యం. అతడొక్కడే కాదు ఆ బావివద్ద ఇప్పటికే అలా ఎందరో చచ్చారు. పొద్దు గుంకిందంటే చాలు– దెయ్యాలు అరుస్తూ తిరుగుతుంటాయట. ఈ సమయంలో మీరు పోవడం, మేము పంపడమూ మంచిది కాదు''

"భయపడకండి సుందరయ్యగారూ! ఈ దెయ్యాల్ని ఎన్నింటినో ఆడించిన వాణ్ణి నేను. ఈ దెయ్యాలు నన్నేం చేస్తాయి?''

"నామాట వినండి డాక్టరుగారూ! ఒక్కపూటకు మునిగేదేమీ లేదు నిదానంగా వెళ్ళడం మేలు"

"మరేం ఆదుర్దా పడకండి. నేనువెళ్ళక తప్పదు" అంటూ లేచి సైకిల్‌స్టాండు తీసి చేతపట్టుకున్నాడు. వారివైపు చూస్తూ వెళుతున్నట్లు తలూపి సైకిల్ ఎక్కాడు.

"ఈయన చెబితే వినడు" అంది సుందరయ్య భార్య.

'ఎవర్నయినా వెంట పంపితే బాగుండే దేమో?' అనుకున్నాడు సుందరయ్య. బురదలో సైకిల్ తొక్కడం సాధ్యంకాక తోసుకుంటూ ఊరి వెలుపలకు వచ్చాడు డాక్టర్. అక్కడ దారి బాగుంది. సైకిల్ ఎక్కి ముందుకు కదిలాడు. ఆకాశంలో బడబడమని ఉరుములు ఉరుము తున్నాయి. మెరుపులు ఉండి ఉండి మిరిమిట్లుగొలుపుతూ మెరుస్తున్నాయి. మెరుపుల వెలుతుర్లో దారి కనిపించినట్లే కన్పించి, తిరిగి గాఢాంధకారం అలుము కుంటున్నది. మెరుపు సమయంలో కళ్ళు మూసుకపోతున్నాయి. సన్నగా తుంపర్లు పడుతూనే ఉన్నాయి.

గ్రామం దాటిన తర్వాత 'ఈరోజు బయలుదేరకున్నా బాగుండేదేమో?' అను కున్నాడు డాక్టరు. మామూలు సమయంలో సైకిల్ మీద పావుగంట లోనే వెళ్ళవచ్చు. వర్షం మూలంగా రోడ్డు మీద కూడా అక్కడక్కడ గతుకులు ఏర్పడి నీరు నిలబడింది. చీకటి కావడం వల్ల గోతులు కన్పించక సైకిల్ ధాటికి నీరంతా చింది ఎగిరి పడటం జరుగు తున్నది. బురద అటుంచి సైకిల్ గతుకుల్లో పడినప్పుడు ఎగిరి పడవలసి వస్తున్నది. దీనికితోడు దెయ్యాన్ని గురించి

వాళ్ళ భయం గుర్తుకొస్తోంది. తానుకూడా చాలాసార్లు ఈ విషయం విన్నాడు. ఈ దారిలో చీకటిపడ్డతర్వాతతెలిసినవారెవరూ నడవరని! పల్లెటూర్లలో దెయ్యాల కథలూ,భయాలూ ఎక్కువ! ఎంత చదువు కున్నవాడయినా ఈ బూచికి లొంగి పోతున్నాడు.విజ్ఞానం వృధాఅవుతున్నది. తాను చదువుకుని, సైన్స్‌ను గురించి ఎంతోకొంత తెలిసి ఉండి కూడా ఇప్పుడు భయపడుతున్నాననుకున్నాడు. ఆ ఊహ మనస్సులోనికి వస్తూనే నవ్వుకున్నాడు. తాను ఈ మూఢనమ్మకాలు లేని హేతువాదిననీ, నాస్తికుడననీ ఇక్కడి ప్రజల ఉద్దేశం! కానీ, అంతర్గతంగా తనలోనూ భయం ఉంది. పైకి ఎంత డాంబికాలు చెప్పినా అంతర్గతంగా ఎందరో భయపడుతున్నారు ఈ బూచిని చూసి! మాటలవల్ల వాదాన్ని కొనసాగించ గలవ్యక్తి ఆచరణలో నిలబడలేకపోవచ్చు. ఇందుకు ఉదాహరణ తనే! పిరికితనాన్ని కప్పిపుచ్చుకోకుండా ఈ రాత్రి వారి మాటవిని అక్కడే ఉంటే బాగుండేదేమో అలా ఆలోచించుకుంటూనే సైకిల్ తొక్కుతున్నాడు.

ఇంతలో చెవులు పగిలిపోతాయేమో నన్నంత భయంగా ఓ ఉరుము ఉరిమింది. దానితోపాటే, తళతళమని మెరుపు విల్లు లాగా మెరిసి మాయమైంది. ఆ మెరుపు లోనే కనిపించింది సంజీవయ్య బావి వద్ద నున్న స్మశానం! ఒక్కక్షణం గుండెను దిటవు చేసుకున్నాడు. బావి చుట్టూఉన్న తుమ్మచెట్లు, స్మశానం ముందున్న వేపచెట్టు గాలికి విపరీతంగా ఊగుతున్నాయి. స్మశానం దాటి బావి దగ్గరకు వచ్చేసరికి సైకిల్ దానికదే ఆగిపోయింది. అతడు బ్రేకులు వేయలేదు. గుండె ఒక్కసారి ఝల్లుమంది. సైకిల్ నిలబడటమేమిటి? దిగి ముందుకు తోయడానికి ప్రయత్నిం చాడు. ముందుకు కదలలేదు. అతడిలో ఆలోచన, దానితోబాటు భయం ఆరంభ మయింది.

అది ఒక దిగుడుబావి. బావి మెట్లు సరిగ్గా రోడ్డుమీదనే ఉన్నాయి. బావి వెనుక చెట్లు. ఒకవైపుగా స్మశానం రోడ్డు మీదకు ఉంది. స్మశానంలో మరింత చీకటి రాజ్యమేలుతున్నది. రాతిస్థంభాలు, చూలాలతో ఎన్నడో కట్టిన గుహలాంటి స్మశానంలో మెరుపు వెలుగు పడటంలేదు. బావి మెట్లపక్క పెద్ద వేపచెట్టు విరబోసుకొని ఊగుతున్నది. చెట్టు చుట్టూ కట్టిన అరుగుమీద ఏముందో ఆ కటిక చీకటిలో అర్థం కావడంలేదు. కప్పలు బెకబెకమంటూ అరుస్తున్నాయి. 'గీ' మంటున్న కీచురాయి శబ్దాలు, రకరకాలు అరుపులు, గుడ్లగూబల కూతలు విన్పి స్తున్నాయి. ఆ భయంకరమైన వాతా వరణంలో వంటరిగా ఒక్కడు! సైకిల్ కదలడంలేదు. ఎందుకు ఆగిందో ఆలో చించగల స్థాయిలోలేడు. ఇది దయ్యం చేష్టా? దెయ్యాలు మనుష్యుల్ని నిలిపి రొమ్ముమీద తొక్కిచంపుతాయట మరి సైకిల్ నిలపడం పెద్దసమస్యా?గ్రామంలో బయలుదేరినప్పుడున్న ధైర్యం ఊరు దాటిన తర్వాత లేదిప్పుడు. ఊరుదాటిన తర్వాత ఏర్పడిన సంశయం స్థానంలో ఇప్పుడు భయం ఏర్పడింది. ఆ భయం వల్ల కనీసం ఆలోచించేస్థితిలో కూడా లేడు.

దబదబదబమంటూ ఉరుము, దానితో పాటు మెరుపు. కళ్లు చిట్లించి చూసిన డాక్టర్‌కు వేపచెట్టుకు కొంతదూరంలో తెల్లగా చీరకట్టుకున్న మనిషి బావివైపు

నడుస్తున్నట్లు కనిపించింది. డాక్టర్ శరీరంలోని నరనరాలు వణికిపోయాయి. ఒళ్లు జలదరించింది. భయంతో శరీరం చల్లబడింది. అరుద్దామనుకున్నాడు కానీ, నోట మాట రాలేదు. కాళ్ళు, చేతులు కదలలేదు. ఆ స్త్రీ బావివైపు కదిలి బావి గట్టు దగ్గరకు వచ్చినట్లు మసక మసకగా కన్పిస్తున్నది. దయ్యం అనేక రూపాలలో ఎదురవుతుందని చెబుతుంటే విన్నాడు. అనేక ఆకారాలు దాల్చవచ్చని కూడా విన్నాడు. ఏమో? ఒణికే ఒళ్ళును అదుపులో పెట్టుకొనమనికి ప్రయత్నిస్తూ చుట్టూ చూశాడు. చుట్టూ ఇరవై గజాల దూరంలో ఉన్న చెట్లు లీలగా మసగ్గా కన్పిస్తున్నాయేగానీ, ఇంకేమీ కన్పించ లేదు.

ఆమె దెయ్యమే అయితే ఈ రోజు తన పని అయిపోతుందనుకున్నాడు. కింద జరజర పాకిన శబ్దమయితే తల కిందకు తిప్పి చూశాడు. తాడులాంటి ఆకారం సాగిపోతున్నది. అది పామే! సందేహం లేదు. అదే తనను కరిస్తే! చేతిలో సైకిలు పట్టు తప్పుతున్నది. కంపరమెత్తుతున్న ఒళ్ళును స్వాధీనం లోనికి తెచ్చుకునే స్థాయి లేదు. పండ్లు గిటకరాచుతున్నాయి. ముఖం భయంతో బాధతో ముడుచుకుంటూ ఉంది.

"అమ్మా!"

నరనరాల్ని తోడేసే అరుపు!
గుండెల్ని నమిలివేసే అరుపు!
ఆ ఒంటరి నిశీథిలో నిలబడే మనిషి రక్తం చప్పగా చల్లారిపోయేలా చేసే అరుపు!

అది మనిషి అరుపే!

సందేహం లేదు! డాక్టరు ఇప్పుడు మనిషి కాదు. మనిషిగా ఆలోచించనూ లేదు. ఆ అరుపు అతడి నరనరాలు లాగేసింది. తనకు అతి దగ్గరలో అతి వికృతంగా అరచిన ఆ అరుపుకు అతడు శిలలాగా తయారయ్యాడు. శరీరం నిర్జీవంగా ఉన్నా కళ్లు రోడ్డు వెంట అరుపు వినిపించిన వైపు చూశాయి. ఎదురుగా తెల్లటి ఎద్దు పరు గెత్తుతూ వస్తున్నది.

సందేహం లేదు. అది దెయ్యమే. ఒక దెయ్యం ఆడమనిషి రూపంలో బావివద్ద నిలబడింది. మరో దెయ్యం ఎద్దు రూపంలో రోడ్డువెంట తన వద్దకు పరు గిడుతూ వస్తున్నది. ఇక తాను చావక తప్పదు.

'దబ్'మన్న చప్పుడు. బావిగట్టు మీది ఆకారం బావిలో దుమికింది. బావి లోని నీళ్లు చెళ్లున పైకి లేచి కిందికి జారి పోయాయి. ఎద్దు దగ్గరగా వస్తున్నది. డాక్టర్ భయానకంగా అరచాడు. తను అరుస్తున్నట్లు కూడా అతడికి తెలియడం లేదు. అతని అరుపుకు ఎదురుగా వస్తున్న ఎద్దు ఒక్క క్షణం నిలబడి, పొలాలకు అడ్డంపడి పోసాగింది. డాక్టర్ చేతిలోని సైకిల్ రోడ్డుమీద పడింది. చిటచిటమంటూ మెరిసిన మెరుపు వెలుగులో నిర్జీవమైన డాక్టరు దేహం బురదలో పడిపోయి, గుడ్డలు తడిసిపోయాయి.

• • •

ఆ ప్రాంతంలో దోసపంట ఎండా కాలం వేస్తారు. మంచి వర్షాల సీజనులో కోతకు వస్తుంది. ఆ పంట వేసేది సన్నకారు రైతులు. వారు పండించే పంట మార్కెట్‌కు తీసుకువెళ్తే అక్కడి దళారులు దోపిడీ చేసేస్తారు. అందువల్లనే వారు దోసకాయలు బండ్లలో వేసుకుని

పల్లెటూళ్ళ వెంట అమ్మకానికి వస్తారు. ఆవిధంగా ఎక్కువ ధరకు అమ్మకో వచ్చని వారి ఆశ.

ఇద్దరు రైతులు కలిసి తమ పంటను ఒక బండిలో వేసుకొని గోపల్లె వచ్చారు. సాయంత్రం వరకూ అమ్ముకున్నా ఇంకా కొంత సరుకు మిగిలింది. అటునుంచే పక్కఊరు వెళ్దామనుకున్నారు. కానీ వర్షం మూలంగా ఆ దారి బురదమయం. అందువల్ల కలుగొట్లలో అమ్ముకుని, అట్నుంచదే పోదామనుకున్నారు.

సాయంత్రం ఆరయింది. గోపల్లె నుండి దారి బాగుంటుందని వారికి తెలుసు. అందువల్ల ఎట్లాగయినా రాత్రి కలుగొట్ల చేరి ఉదయమే అన్నీ అమ్ముకుని మధ్యాహ్నానికి ఊరెళ్లాలనుకున్నారు. తుంపర్లు పడుతున్నా బండి కట్టారు.

ఆ సమయంలో పోతున్న బండిని చూసి కొందరు ''ఈ రాత్రి ఉండి పొద్దున్నే పోగూడదటయ్యా? ఒక రాత్రికి ఏం మునిగిపోతుంది?" అన్నారు.

"కాదులెండి. వెళ్లాలి'' అన్నాడు

బండిలో మనిషి.

బండి గ్రామం దాటేటప్పటికి వర్షం కొంత ఎక్కువ అయింది. ఆ దారులు గతంలో చూసి వున్నా, వాతావరణం బాగులేకపోవటంతో వారికి చీకాకుగా ఉంది. వారివద్ద దోచుకోడానికి వస్తువులేమీ లేవు. దోసకాయల మారకానికి డబ్బుకు బదులు జొన్నలు వస్తాయి. రాత్రిపూట ఆ జొన్నల కోసం ఏ దొంగలూ రారు. అందువల్లనే వారు ధైర్యంగా ఉన్నారు. అయినా—

"ఈ రాత్రి పోకపోతేనే మంచిదేమో" అన్నాడు ఎడ్లను అదిలిస్తున్న మనిషి. ముందు చూపు సాగడం లేదు. ఎడ్లు కూడా సరిగా చూపందక నిదానంగా నడుస్తున్నాయి.

"ఇప్పుడేమయింది? ఒక గంటలో ఆ పల్లె చేరతాం! సత్రంలో పడుకుని పొద్దున్నే అమ్ముకోవచ్చు" అన్నాడు బండిలో మనిషి.

"అదికాదు. ఈ దారి మధ్యలో ఒక బావి ఉంది. అది దెయ్యాల బావిగా పేరు తెచ్చుకుంది. ఇప్పటికే అనేకమంది అక్కడ చంపబడ్డారు" అన్నాడు రెండో వ్యక్తి వణుకుతూ. బండిమీది మనిషి మాట్లాడలేదు.

పల్లెటూరివారికి దొంగలకంటే దెయ్యాలే ఎక్కువ భయం కలిగిస్తాయి. దొంగలు ఉన్న సొత్తు దోచుకొని, మనిషిని ప్రాణాలతో విడుస్తారు. దెయ్యాలు అలాకాదు - మనిషి ప్రాణాలు తీస్తాయి.

గాలి విపరీతంగా వీస్తున్నది. జుయ్యిన వీస్తున్న గాలి చెవులగుండా శరీరంలోనికి ప్రవేశించి చలితో ఒణికిస్తున్నది. ఉరుముతున్న ఉరుముల శబ్దాలకు తోడు రోడ్డు వెంట నిలిచిన నీటిలో కప్పల బెకబెకలు! గోండు కప్పలు ఉండి ఉండి వికృతంగా అరుస్తున్నాయి.

బావి అల్లంత దూరం ఉండగానే బండి నిలబడిపోయింది. ఎంత అదలించినా ఎద్దులు ముందుకు కదలడంలేదు. కొడితే తోకలు పైకెగరేసి కాడికిందనుండి తల పక్కకు లాగడానికి ప్రయత్నిస్తాయేగానీ ముందుకు సాగడం లేదు.

"ఏమయింది?" అన్నాడు బండి మీదున్న మనిషి.

"ఏదో అయింది. లేకుంటే ఇంత మొండికి వేయవు" అన్నాడు అదిలిస్తున్న మనిషి. కిందకి దిగడానికి ఇద్దరూ భయపడుతున్నారు. చివరకు భయపడుతూనే బండిమీది మనిషి కిందకు దిగాడు. ఎండ్ల ముందుకు వచ్చి గంగడోలు నిమిరాడు. ఒక ఎద్దు గట్టిగా రంకెవేసి బురద తొక్కుతూ చిందులేయసాగింది.

దిగిన వ్యక్తి కళ్లు చిట్లించి ముందుకు చూశాడు. ముప్పైగజాల దూరంలో మసగ్గా చెట్లు కన్పిస్తున్నాయి. అదే బావి ప్రాంతం అనుకున్నాడు.

తటాలున మెరిసిన మెరుపులో తెల్లటి చీర కట్టుకున్న మనిషి కనుపించింది. బండికి కొంతదూరంలో పొలంలోపడి బావి వైపు పోతున్నది. ఆ మనిషి నడుస్తున్నపుడు కాలివెంట లేచే బురద కిందపడి చప్పుడవుతున్నది. ఆ మనిషిని చూసిన ఎద్దులు మరోసారి రంకెవేశాయి. ఆ మనిషిని వీరు ఇద్దరూ చూశారు. గుండెలు పగిలిపోయినంత పనయింది వారికి.

ఔను...తప్పకుండా అది దెయ్యమే అయి ఉంటుంది. ఈ భయంకరమైన రాత్రి సమయంలో మగవాడే ఒంటరిగా బయటకు రాలేడు. ఒక స్త్రీ ఒంటరిగా రావడం అసంభవం! అది దెయ్యంకాబట్టే





తిరుగుతున్నది. పైగా ఈ దెయ్యాల బావి వద్ద మరెవరు తిరుగుతారు?

ఒళ్లు కంపరమెత్తుతుంటే అణచుకోడానికి అతిప్రయత్నం చేస్తూ "ఏం చేద్దాం ?" అన్నాడు ఎడ్ల ముందున్న మనిషి. బండిమీదున్న మనిషి మాట్లాడలేదు. మాట్లాడే స్థితిలో లేడు. నోరు పెగలడం లేదు. ఈ రాత్రి గడిస్తే-జన్మలో ఈ సమయంలో ప్రయాణం చేయకూడదని నిర్ణయించుకున్నాడు. చిందులుతొక్కుతున్న ఎద్దుల్ని నిలపడానికి ప్రయత్నం చేస్తూ "బండినదలించు. ఏమవుతే అదేఅవుతుంది" అన్నాడు.

ధైర్యం తెచ్చుకోడానికన్నట్లు ముందున్నవ్యక్తి కసరి "ఏరా..మాట్లాడవు? పోదాం పద" అన్నాడు గద్దిస్తూ. ఆ గద్దింపు వెనుక భయాన్ని దాచుకోడానికి అతను ప్రయత్నిస్తున్నాడు.

"నాకు భయంగా ఉంది" అన్నాడు అతడు.

నిజానికి ఇద్దరికీ భయంగానే ఉంది. అయితే దారి మధ్యలో ఉన్నారు. ఎటో ఒక వైపు చేరాలి. లేకపోతే ఇక్కడే చావవలసి వస్తుందని ముందున్న వ్యక్తి బాధ!

"తిరిగి గోపల్లెకు పోదామా?"

బండి మీదున్న వ్యక్తి తలూపాడు. అతను తలూపడం ముందున్న వ్యక్తికి కన్పించలేదు. కానీ మౌనం అర్ధాంగీకారం అన్నట్లు బండి వెనుకకు తిప్పడానికి ప్రయత్నిస్తూ నగలు పట్టి, ఎద్దను అదిలించి, బండిని తిప్పాడు. ఆ తిప్పడంలో నగలమీదున్న వ్యక్తి ఏమరుపాటుతోనూ, భయంభయంగానూ ఉండటంవల్ల నగల మీదనుండి జారి కిందపడ్డాడు. బండి తిరగడంలో చక్రం అతని మీద పడింది. చక్రం అతని మీదకు రావడంతో కింద పడ్డ వ్యక్తి అతి భయానకంగా అరిచాడు. ఆ అరుపునకు ఎద్దులు చెల్లాచెదరుగా ఎగిరాయి. పట్టెడలు తెగిపోయాయి. ఎద్దులు వాటి ఇష్టం వచ్చినట్లు అవి పరుగెత్తుతున్నాయి. ఏం జరిగిందీ ముందున్న వ్యక్తికి అర్థంకాలేదు. అరుపయితే విన్పించింది కానీ, ఏమయిందీ తెలియదు. రెండు ఎద్దులూ తెంపుకొని పోయిన తర్వాత తిరిగి బండి వద్దకు వచ్చాడు. చక్రం కింద నలిగిపోయిన శరీరం తగిలింది. వంగి శరీరాన్ని చూస్తున్నంతలోనే దూరంగా ఢభీల్లుమని చప్పుడు, ఆ చప్పుడుతో పాటు పురుషుడి కేక భయంకరంగా విన్పించింది. నిశీథిలో ఒక్కడూ ఏం చేయలేక భయంతో అరుస్తూ రోడ్డు వెంట పరుగెత్తాడు. ఎటు పోవాలో, అసలు ఏం జరిగిందో, తను ఏంచేయాలో కూడా అతడికి తెలియదు. రోడ్డుమీద దాదాపు ముప్పయి గజాలు పరుగెత్తాడు. కాళ్లకు తగిలే రాళ్ళతో పోటీపడి పరుగెత్తి బావి దగ్గరగా వచ్చాడు. అసలే భయానక స్థితిలో ఉన్న అతని కాళ్లకు మెత్తటి శరీరం లాంటిది తగిలేసరికి ఒళ్ళు జలదరించి "అమ్మో" అన్న కేకతో కింద పడ్డాడు. తన కాళ్లకు తగిలింది మనిషి శరీరమే అయివుంటుందనుకున్నాడు.

* * *

నాగయ్య ఇంటివద్ద జనం చాలామంది చేరివున్నారు. నాగయ్య రెండవ కొడుకు వెంకయ్య భార్య ఆ సాయంత్రం నుండి కన్పించడంలేదు.

నెలరోజులుగా కట్నం డబ్బులు తండ్రి వద్ద నాబట్టుకు రమ్మని వెంకయ్య పోరుతున్నాడు. అతని భార్య పార్వతి తండ్రికి రెండు ఉత్తరాలు రాసినా జవాబు లేదు. దానితో ఆమె మీద ఇంట్లో సాధింపులు

ఎక్కువయ్యాయి. ఇంట్లో అందరూ దెప్పిపొడవడం మొదలయ్యింది. చివరికి ఈరోజు ఆమె ఎదురు మాట్లాడినందుకు వెంకయ్య చెప్పు తీసుకుని తల పగిలేలా బాదాడు. ఇంట్లో అందరూ అతనికే మద్దతు ఇచ్చారు; ఎవరూ కనీసం విడిపించనైనా లేదు. ఉదయంనుండీ ఆమె వంటింటి నుంచి బయటకు రాలేదు. తల పగిలి రక్తం కారుతుంటే రక్తం ఆగడానికి కాఫీపొడి అద్దుకుంది. మధ్యాహ్నంఅన్నం కూడా తినలేదు. సాయంత్రం చెంబుతో నీళ్లు తీసుకొని ఇంటినుండి బయటకు వెళ్లడం అందరూ చూశారు. కాని,ఎంతకూ తిరిగి రాలేదు. గంట కూడా గడిచిపోయే సరికి ఇంట్లోనివారికి అనుమానం వచ్చింది. ఈ వార్త తెలిసి ఇరుగుపొరుగు తోడయ్యారు. ఊరి చుట్టూ వెతకడం ఆరంభించారు.

అసలే వర్షం. కింద బురద. ఎక్కడ కాలు పెట్టినా జర్రున జారిపోవడం, చీకటిలో కింద పడటం జరుగుతున్నది. విసుగుపుట్టి తిరిగి వచ్చారు.




"ఊరిలో బావులు కూడా వెతకండి" అన్నాడు మునసబు ఆదుర్దాగా!

"దానికంత ధైర్యం కూడానా? పుట్టింటికి పారిపోయిందేమో?" అంది నాగయ్య భార్య ఈసడింపుగా.

"అదేం మాట పుల్లమ్మా! ఈ వర్షం, బురద... ఇంత చీకటిలో ఒంటరిగా ఆడ కూతురు ఎట్లా వెళ్తుంది?" అంది పక్కింటి సుబ్బాయమ్మ.

"దానికేమిటే! అన్నింటికీ తెగవిడిచిన ముండలకు ఈ చీకటి, వర్షం అడ్డం వస్తాయా? ఇంట్లో అందర్నీ బెదిరించడానికి ఇదో కొత్త ఎత్తు. పోనీ, దానికదే తిరిగి వస్తుంది అంది అత్త.

నాగయ్య వద్దకు వచ్చాడు మునసబు. కోడలు ఛస్తే తమ పీకల మీదకు వస్తుందేమోనని నాగయ్య వణుకుతున్నాడు. భార్య అంత గట్టిగా మాట్లాడుతుంటే చావదని మళ్లీ కాస్త ధైర్యపడుతున్నాడు.

"నాగయ్యా! ఎందుకయినా మంచిది. ఒకసారి బావులన్నీ వెతికిద్దాంపద! ఏమయినా అయితే మీ పీకల మీదకే వస్తుంది. ఇప్పటికే మీరామెను ఆరడి పెడుతున్నట్లు అందరికీ తెలుసు. పైగా ఉదయం చావబాదారు. ఆ పిల్ల చావడమే జరిగితే, అది హత్య కేసు కిందకు రావచ్చు" అన్నాడు మునసబు.

ఆ మాటతో బెదిరిపోయిన నాగయ్య కొంత మందిని వెంటపెట్టుకొని గ్రామంలో ఉన్న నాలుగు బావుల వద్దకు వెళ్ళి వెదురు గడలు నీళ్ళలో దించి చూశారు. ఎందులోనూ మనిషి శరీరం ఉన్న జాడ తెలియలేదు. ఒకవేళ పుట్టింటికే వెళ్ళిందేమోనన్న అనుమానం. ఆ సమయంలో పోవడం అసాధ్యం. నాగలమర్రి నడిచివెళ్ళి సమయానికి బస్సు దొరికితే అక్కడినుండి దాదాపు మూడు రూపాయలు ఛార్జీ! ఇదంతా ఆ సమయంలో అసాధ్యమని అందరికీ తెలుసు. అయినా వారి తృప్తికొరకు ఒకవేళ పోయి ఉండవచ్చునేమో అనుకున్నారు. ఎక్కడో పడిచచ్చి ఉంటుందని నిర్ణయించుకోడానికే భయపడిపోతున్నారు.




ఉదయం ఆరుగంటలకే ఆ అనుమానంతో ఊరివారు ఇద్దరు సంజీవయ్య బావి వద్దకు వచ్చారు. అక్కడి దృశ్యం చూసిన ఇద్దరూ బావిలోకి తొంగిచూడకుండానే అదురుతున్న గుండె చేత పట్టుకుని కలుగొట్లకు పరుగెత్తి వచ్చారు. పరిస్థితిని అందరికీ వివరించి చెప్పారు. సుందరయ్య దిగ్భ్రమచెందాడు. తాను వద్దన్నా వెళ్లిన డాక్టర్ ఇంటికి చేరడానికి బదులు బావివద్ద చచ్చిపడి ఉన్నాడని తెలిసి హుటాహుటిని అక్కడకు పరుగెత్తాడు. ఆయన వెంట వందలకొద్దీ జనం స్త్రీలు, పిల్లలతో సహా పరుగెత్తారు. కలుగొట్లకు మైలుదూరంలో బావి! అక్కడినుండి మరో మైలుదూరంలో గోపల్లె! ఈ వార్త గోపల్లెకు కూడా తెలియడంతో అటువైపునుండీ జనం రావడం ఆరంభించారు. బురద తొడ తొక్కిడిగా ఉంది.

బావి దగ్గరకు వచ్చాడు సుందరయ్య

డాక్టరు శవం రోడ్డుమీదకు కాళ్లు, బుర దలో బావిమెట్లవైపు తలతో ఉంది. ముఖంలో భయం కన్పిస్తున్నది. రెండు గజాలదూరంలో మరోశవం ఉంది. అది ఎవరిదో వారికి తెలియదు. పాతిక గజాల దూరంలో ఒక బండి, బండి చక్రం కింద మరో శవం నలిగి పచ్చడిలా అయిపోంది. ఎద్దులు ఆ ప్రాంతంలో ఎక్కడా లేవు. పట్టెడలు తెగిఉన్నాయి. బండిలో దోస కాయల బస్తాలున్నాయి.

ఈలోగా బావిలోకి తొంగిచూసిన వ్యక్తులకు తెల్లటి చీర పైన తేలుతూ కన్పించింది. అందరూ బావిచుట్టూ గుమి గూడారు. ఆ చీర చూసిన తర్వాత మరో మనిషి నీటిలో ఉందని తెలిసిపోయింది. మెట్లగుండా నలుగురు యువకులు బావి లోనికిదిగారు. రొమ్ము లోతు నీళ్ళున్నాయి. మనిషిని చేతులమీదకు తీసుకొని మెట్ల వెంట నడిచి పైకి ఎక్కి గట్టుమీద బండపై దించారు.

నాగయ్య భార్య, మరికొందరు ఆడ వాళ్ళు శవాన్ని గుర్తుపట్టి కిందపడి పొర్లుతూ, ఏడుస్తూ "నా తల్లే...నా బంగారుపాపే" అంటూ రోదిస్తున్నారు. చూసేవారికి అదో నటనగా కన్పించిందే గానీ నిజంగా చనిపోయిన వ్యక్తికోసం ఏడుస్తున్నట్లులేదు.

సుందరయ్య, మరికొందరు చెట్టు కిందకు చేరారు. జనం రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. చివరకు అది దెయ్యం పనేనని తేల్చి చెబుతున్నారు. దెయ్యంవల్లే ఆ అనర్థాలు ఆరంభమయ్యా యని జనం అక్కడక్కడ గుంపులుగా చేరి చెప్పుకుంటున్నారు. డాక్టరు భార్య, చెల్లెలు, అతడి బంధువులు శవం దగ్గర విలపిస్తున్నారు. కొందరు యువకులు శవాలవద్దకు ఎవరినీ వెళ్ళనీకుండా, తాకనీ కుండా అడ్డుపెడుతున్నారు. సుంద రయ్య, మునసబు కలిసి సంప్రదించుకుని పోలీసు స్టేషన్‌కు రిపోర్టు పంపారు.

"పోలీసులు వచ్చి ఏం చేస్తారయ్యా! ఈ దెయ్యాలతో వారు పోట్లాడుతారా ఏమిటి?" అన్నాడు ప్రెసిడెంటు. ఆరంగు ళాల చుట్ట ఆటు పిసికి ఇటు పిసికి నిప్పు అంటించబోతే తడిగాలికి అంటు కోవడంలేదు.

"ఇది దెయ్యాలే చేశాయని ఎలా చెప్పగలం?మనుషులే చేసి ఉండొచ్చుగా?" అనుమానంతో అన్నాడు సుందరయ్య. ఒకవైపు దెయ్యాలే చేసి ఉంటాయని విశ్వాసం! మరోవైపు ఈ అనుమానం.

"ఆ ... ఎవరికయినా వారిమీద ఈర్ష్య ఉండి చంపారనే అనుకుందాం! డాక్టరుకు ఏం దెబ్బతగిలింది? దెబ్బ తగలకుండా ఎలా చస్తాడు? పార్వతి ఇంత దూరం పనిగట్టుకొని వచ్చి చావడమేమిటి? ఊరిలో బావులులేకనా? దెయ్యమే వెంట బడి తెచ్చిపడేసి ఉంటుంది. సమయానికి పీఠ్కా దొరికితే స్వాహాచేసి ఉంటుంది"

"ఈ బావికి మంత్రం వేయిద్దాం మహానుభావా అందే విన్నావటయ్యా ప్రెసిడెంటూ! ఎవడూ దీన్ని గురించి పట్టించుకోలేదు. ఇంతకుముందు చీకటి పడ్డ తర్వాత ఈ బాటమీద తిరగాలంటే జనం చచ్చేవారు. ఇహ ఇప్పుడు పగలు తిరగాలన్నా భస్తారు" అన్నాడు మునసబు.

అలా తలోమాట మాట్లాడుతున్నారు. పక్కనే పెద్ద సత్రం ఉంది. పెద్ద పెద్ద రాళ్లతో ఏనాడు కట్టారోగానీ ఈనాటికీ చెక్కుచెదరలేదు. చుట్టూ అరుగులు. ఒక వైపు పెద్ద గది ఒకటి. పూర్వం అక్కడ

వైభవంగా పెళ్ళిళ్ళు చేసేవారు! ఇప్పుడు పాడుపడింది. పగలయినా అక్కడ ఒంటరిగా కూర్చోవాలంటే భయం! బావికి ఎడమవైపు పదిగజాల దూరంలో పోలేరమ్మ గుడి చిన్నది ఉంది. గుడిలో చిన్నశిల్పం నాలుగు చేతులతో ఉంది. కొంతదూరంలో చిన్న చెయవు. చెరువు చుట్టూచింతచెట్లు విరబోసుకొని ఉన్నాయి.

పోలీసులు వ్యానులో వచ్చారు. ఆపాటికే జనం విపరీతంగా వచ్చారు; ఇంకా వస్తున్నారు.



చుట్టుపక్కల పల్లెలకు అదే కేంద్రం కావడం వల్లా ఆ డాక్టరుకు ఈ పల్లెలతో సంబంధం ఉండటం వల్లా, మంచి డాక్టరనే పేరు ఉండటంవల్ల తండోపతండాలుగా వచ్చారు జనం. ఆ వచ్చిన జనం బండి కిందపడి చనిపోయిన వ్యక్తి, డాక్టరు వద్ద పడి చనిపోయిన వ్యక్తి ఏ ఊరివారో కూడా గుర్తుపట్టారు.

పోలీసులు జనాన్ని దూరంగా తోశారు. ఫొటోగ్రాఫర్లు ఫొటోలు తీశారు. పోలీసు ఆఫీసర్లు శవాల దగ్గరగా వచ్చి కదలించి

చూశారు. ఒక వ్యక్తి నీళ్ళలో పడి చని పోయింది. ఒక వ్యక్తి బండి చక్రం కింద నలిగిపోయాడు. మరి ఇద్దరు నేల మీదే సాధారణ స్థితిలో చనిపోయారు. ఇవి హత్యలనేదానికి ఎలాంటి ఆధారం లేదు. ఒక వ్యక్తి పొరపాటున బండికింద పడి చచ్చాడనుకున్నా, మరో వ్యక్తి బావిలో పడి చచ్చిందనుకున్నా, మిగిలిన ఇద్దరూ చనిపోవడానికి కారణం ఎవరికీ అర్థం కావడం లేదు. పెద్దలు కొందరు ఆ బావి పుట్టుక, దయ్యాల చరిత్ర ఇన్స్పెక్టరుకు వివరించి చెప్పారు. అతడు నవ్వి, "దెయ్యాలు మనుషుల్ని చంపడమేమిటి?" అన్నాడు.

జనంలోనుండి ఎవరో గట్టిగా అరిచాడు "నీవు ఒక రాత్రి ఇక్కడ ఉండి తెల్లారి బతికి వస్తే దయ్యాలు లేనట్లే!"

ఇన్స్పెక్టరు కోపంగా అటు చూశాడు కానీ మాట్లాడలేదు. తాను దయ్యాలు ఉన్నాయో లేదో తర్కించడానికి రాలేదు. తన బాధ్యత తాను చేయాలి. జనం విశ్వాసాల్ని వ్యతిరేకించడం, సమర్థించడం తనపనిగాదు. ఇంతలో సుందరయ్య ఇన్స్పెక్టరు వద్దకు వచ్చాడు.

"వీరిని ఇక్కడే పంచనామా చేసే అవకాశం ఉందా?" అని అడిగాడు.

"అటువంటి అవకాశం లేదండీ! బావిలో పడ్డ స్త్రీ తలమీద దెబ్బ ఉంది. మరోవ్యక్తి బండి కిందపడి చనిపోయాడు. మిగిలిన ఇద్దరూ ఏవిధంగా చనిపోయారో తెలియదు. అందువల్ల నాలుగు శవాల్నీ పోస్టుమార్టం చేయాల్సిందే! ఆ తర్వాతే మిగిలిన విషయాలు బయటపడతాయి" అన్నాడు ఇన్స్పెక్టర్.

"జనంలో తొక్కిడి ఆరంభమయింది.





ఎవరిని తీసుకెళ్ళినా డాక్టరు శవాన్ని మాత్రం తీసుకెళ్ళడానికి లేదన్నారు. "ఇది దెయ్యంపనేనని తెలుస్తూనే ఉంది. ఆయనను తీసుకెళ్ళి కోయడానికి మేం ఒప్పుకోం" అన్నారు. పోలీసులు నచ్చ చెప్పినా వినకపోవడంతో, పెద్దమనుషుల చేత చెప్పించారు.

చివరకు జనం సర్దుకున్నారు. ఫలితం ఏమవుతుందో వేచిచూద్దాం అనుకున్నారు. కొందరు దెయ్యాల ప్రతాపం అన్నారు. మరికొందరు ఇదేదో హత్యాప్రయత్న మన్నారు. మరికొందరు ఇది కాకతాళీయంగా జరిగిందన్నారు. మరికొందరు ఇది చేతబడి వ్యవహారం అయి ఉండ వచ్చన్నారు. పోస్టుమార్టం కొరకు పోలీసులు శవాలను వ్యానులో తీసుకెళ్లారు.

• • •

డాక్టరు చావు మామూలు చావు కాదనీ, చేతబడి చేసి చంపబడ్డాడన్న వార్త గోపల్లెలో గుప్పున వ్యాపించింది. ఆ ప్రాంతాలలో చేతబడిద్వారా చంపడం, హింసించడం అప్పటికే చాలాసార్లు జరిగి నందువల్ల డాక్టరు కూడా అదేవిధంగా చంప బడ్డాడనే వదంతి ఆరంభమయింది. వదంతి ఎవరు వ్యాపించినా అది అన్ని ప్రాంతాలకూ విస్తరించింది.

డాక్టర్ మృత దేహం గోపల్లెకు తీసుకురాబడింది. డాక్టర్ తమ్ముడు దగ్గరుండి శవదహన ఏర్పాట్లు చేయించాడు. అతని బంధువులు పెద్దగా రాలేదు. అతడిది ఆ ప్రాంతం కాక పోవడంతో తెలిసినవారు తప్ప సన్నిహితులు ఎవరూ లేరు.

ఆ సాయంత్రం పోలీసులు ముందు ప్రెసిడెంటు ఇంటికి వచ్చారు. సాదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టాడాయన.

"డాక్టరుది ఏ వూరండీ?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నాలుగు సంవత్సరాల క్రితం భార్యా చెల్లెలితో ఇక్కడికి వచ్చాడు. అతనికో తమ్ముడున్నాడు. అంతకుమించి వివరాలు ఇక్కడ ఎవరికీ తెలియవు"

"అతనికివిరోధులెవరయినాఉన్నారా?"

కళ్ళు చిట్లించి చూశాడు ప్రెసిడెంటు గోవర్ధనం! తర్వాత చిన్నగా నవ్వి "ఎందుకలాఅడుగుతున్నారు?" అన్నాడు.

"డాక్టరు చావు మామూలు చావు కాదు. అది దాదాపు హత్య కిందకు వస్తున్నది. అందువల్లనే అడగవలసి వచ్చింది"

గోవర్ధనం కళ్ళు ఆశ్చర్యంగా చూస్తున్నాయి. "డాక్టరును చంపడమా!"

"కావచ్చు. కాకనూపోవచ్చు. ఇప్పుడే చెప్పలేం. అతని గొంతు పిసకబడి ఉంది. కొంతవరకూ అతని చావుకు అదీ కారణమేనని డాక్టర్ రిపోర్టు ఇచ్చాడు. అయితే ఆ గొంతు తన చేతులతో పిసుక్కున్నాడా, ఎవరయినా పిసికారా అన్నదే ఇపుడు తేలవలసింది"

"తన గొంతు తనే పిసుక్కోవడం ద్వారా కూడా మనిషి చావడానికి అవకాశాలున్నాయంటారా?" అనుమానంగా అడిగాడు ప్రెసిడెంటు.

"చాలావరకూ ఉన్నాయి. అయితే హతుడి అప్పటి మానసిక పరిస్థితుల్ని బట్టి ఉంటుందది"

ప్రెసిడెంటుకొంత సేపు మాట్లాడలేదు. వీధిలో పోతున్న లేగదూడవైపు చూస్తూ కూర్చొన్నాడు.

"అతనికి విరోధులెవరైనాఉన్నారా?"

"నాకు అతడితో పెద్ద పరిచయం లేదండీ! ఆ వివరాలన్నీ ఆ కుటుంబం ద్వారా మాత్రమే రాబట్టవలసి ఉంటుంది. అక్కడికే వెళ్దాం" అంటూ లేచాడు. అతని వెంట ఇన్‌స్పెక్టరు, నలుగురు కానిస్టేబుల్స్ లేచి నిలబడ్డారు.

వీధి వెంట బురదగా ఉంది. కాళ్ళకున్న బూట్లు అక్కడే విడిచి వట్టి కాళ్ళతోనే వీధిలోకి వచ్చారు. బురదలో కాళ్లు ఈడ్చుకుంటూ డాక్టర్ ఇంటి ముందుకు వచ్చారు.

పోలీసుల్ని చూసి, మంచం తెచ్చి బయట వసారాలో వేశాడు రాము. అందరూ కూర్చున్న తర్వాత అటుగా పోతున్న మనిషిని పిలిచి, మునసబును పిలువమన్నాడు. మరికొంత సేపటిలో మునసబు కూడా హాజరయ్యాడు.

డాక్టర్ భార్యవైపు చూశాడు ఇన్‌స్పెక్టర్! ముఖం కళావిహీనంగా ఉంది. ఏడ్చి ఏడ్చి నీరసించినట్లుంది.

"మునసబుగారూ! డాక్టరుగారు చంపబడ్డారని ఇన్‌స్పెక్టర్ చెబుతున్నారు. పరిస్థితి కొత్త మలుపు తిరుగుతున్నట్లుంది" అన్నాడు ప్రెసిడెంటు.

మునసబుతోపాటు, ఆ ఇంటివారు కూడా ఈ మాటకు ఆశ్చర్యపడ్డారు. డాక్టరు దెయ్యం భ్రమవల్ల చచ్చాడని ఇంతవరకూ వారందరి ఊహ!

జనం ఒకరొకరే అక్కడకు వస్తున్నారు. ఈరోజు పోలీసులు మళ్ళీ రావడంతో అనుమానపడుతున్న జనం ఏమిటో విందామని చేరుతున్నారు.

"నేను నమ్మను" అన్నాడు మునసబు విస్మయంగా!

"ఎవరు నమ్మినా, నమ్మకున్నా యదార్థం అంతే! ఈ విషయంలో కొన్ని వివరాలు కావాలి. అందుకే ఇప్పుడు వచ్చాము. డాక్టరుగారికి ఎవరయినా

 చతుర ... లలి

# పెరిగే పాపాయిలకు

కావాలి ఒక ప్రత్యేకమైన ఘన ఆహారం...

# ఫారెక్స్



**ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం.**

1. మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్.
2. మీ పాపాయిని రక్తహీనత నుండి సంరక్షించడానికి, పాపాయి యొక్క రోగ-ప్రతిరోధక శక్తిని ఎక్కువ చేయడానికి మరియు ఆరోగ్యవంతమైన రక్తం సమకూర్చడానికోసం, బ్రాండ్ చేయబడిన మరే ఇతర ఘన ఆహారం కన్నా అధిక ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్.
3. మీ పాపాయికి గట్టి పళ్లు మరియు ఆరోగ్యవంతమైన ఎముకలు ఏర్పడటానికి అవసరమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్‌ను ఆదర్శవంతమైన నిష్పత్తిలో కలిగిన ఏకైక బ్రాండ్ చేయబడిన ఘన ఆహారం ఫారెక్స్.
4. మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది కనుక, ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్.




డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్®**

గ్లాక్సో నుండి

CASGLF-42-183 TL

శతృవులున్నారా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ డాక్టర్ భార్యను చూస్తూ.

డాక్టరు భార్య ముఖంమీదకు ముసుగు లాక్కుని, తలవంచుకుని గడపకు అటు వైపు కూర్చుని, గడపమీద వేలితో రాస్తూ అంది – "ఆ విషయంలో నేనేం చెప్పగలనండీ! ఇంటి వరకూ శతృవులు ఎవరూ లేనట్లే లెక్క! బయట విషయాలు నాకంతగా తెలియవు. ఆయన కూడా బయటి విషయాలు అంతగా ప్రస్తావించరు"

"అతనికి ప్రత్యేకంగా విరోధులుంటారంటే నమ్మే ఆస్కారమే లేదండీ! ఎవరితో ఎంతవరకు మాట్లాడాలో అంత వరకే. తనపనేదో తాను చేసుకుపోవడం, మరొకరి విషయాల్లో తల దూర్చకుండా ఉండటం అతడి లక్షణం" అన్నాడు మునసబు.

"మీకు అతడు బాగా పరిచయమా?"

"ఆఁ! ఈ గ్రామానికి వచ్చినప్పటి నుండి కూడా నాతో సన్నిహితంగా ఉంటున్నాడు. అతన్ని గురించి తప్పుగా చూపే అవకాశమే లేదు"

"ఆయన జీవితవివరాలు ఇస్తారా?"

మునసబు డాక్టరు భార్యవైపు చూశాడు. తమ్ముడు రాము కలుగజేసుకుంటూ– "మా స్వగ్రామం టంగుటూరండీ! ఆర్థికంగా పెద్దగా లేనివాళ్ళమే! మా అమ్మా, నాన్నా చనిపోవడం మూలంగా, పొలాల మీద వస్తున్న నష్టాల్ని తట్టుకోలేక ఉన్నది అమ్మేసి ఇక్కడికి వచ్చాము. ఓ ప్రైవేట్ డాక్టరువద్ద మా అన్న కాంపౌండరుగా పనిచేసిన అనుభవంతో ఇక్కడ డాక్టరుగా చలామణి కాగలిగాడు. నేను, మా చెల్లెలు, వదిన, అన్న–ఇదే మా కుటుంబం"

"అంటే ఆయన క్వాలిఫైడ్ డాక్టరు కాదన్నమాట !" ఇన్‌స్పెక్టరు తల ఊపుతూ అన్నాడు.

"బతికించే మందు ఇచ్చేవాడు కావాలిగానీ, వాడి డిగ్రీతో జనానికి పనేమిటండీ ! యం.బి.బి.యస్.లు చేయలేని పని ఒక్కోసమయంలో నాటుమందు పని చేసి ప్రాణం నిలుపుతుంది గదా!"

ఇన్‌స్పెక్టరు మునసబువైపు చూశాడు. తిరిగి రాము వైపు చూస్తూ "మీ అన్నను చంపడానికి బలమైన కారణాలు ఉన్నవారు ఎవరయినా ఉన్నారేమో ఆలోచించు"

రాము తల ఆడించాడు. "మా కుటుంబం ఇక్కడికి వచ్చిన నాలుగు సంవత్సరాల్లోనూ పట్టుమని నాలుగు నెలలు కూడా నేను ఇక్కడ ఉండలేదు. నేను డిగ్రీ చదువుతున్నాను. అందువల్ల వేసవి సెలవులలో తప్ప ఇక్కడకురాను"

"సరే" తల ఊపాడు ఇన్‌స్పెక్టరు.

"అంతా అగమ్యగోచరంగా ఉంది" అన్నాడు మునసబు.

ఇన్‌స్పెక్టరు లేచాడు. అతడితోపాటు ప్రెసిడెంటు కూడా లేచాడు. మునసబు అక్కడే ఉండిపోగా మిగిలినవారంతా తిరిగి ప్రెసిడెంటు ఇంటివద్దకు వచ్చారు.

"మీకెవరి మీదయినా అనుమానం ఉందా?" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

ప్రెసిడెంటు అరంగుళాల చుట్ట వెలిగించే పనిలో ఉన్నాడు. ఇన్‌స్పెక్టరు మాటకు తలఎత్తి చూసి "ఇప్పటివరకేమీ లేదు. అయినా ఆలోచించాలి" అన్నాడు.

అతడేదో, ఎవరిమీదో అనుమానపడుతున్నాడని ఇన్‌స్పెక్టరు అనుకున్నాడు. ముందు వివరాలు తెలుసుకుంటే, తర్వాత ఒకదానికొకటి తీగలాగా కదుల్తాయి.

పల్లెటూళ్ళలో కదలింపు ముందు ఆరంభం కావాలి.

ప్రెసిడెంటు ఇంటివద్దనే భోజనాలు కానిచ్చారు. మధ్యాహ్నం తిరిగి డాక్టరు భార్య దగ్గరకెళ్ళి స్టేట్‌మెంట్ తీసుకున్నారు. వెళ్ళిపోతూ ప్రెసిడెంటుతో అన్నాడు–"మీకు గ్రామంలో స్నేహాలుంటాయిగదా! విచారించండి. ఏమాత్రం వివరాలు తెలిసినా మాకు అందించండి"

ప్రెసిడెంటు తలూపాడు.

జనంలో కుతూహలం, ఒకవిధమైన ఆదుర్దా ఏర్పడింది. నిన్నటిదాకా వారు అనుకున్నదివేరు. జరుగుతున్నది వేరు. డాక్టరును గొంతు పిసికి చంపవలసినంత పనేమిటి? ఒకవేళ పిసికి చంపారనుకున్నా, నాగయ్య కోడలు అప్పుడే అక్కడకు వెళ్ళి ఎందుకు చావాలి? ఇంటి మనుషులిద్దరూ అక్కడే ఆ సమయంలోనే ఎందుకు చావాలి? ఇవన్నీ జనం నోళ్ళలో నానుతున్నాయేగానీ ఎవరికీ, ఎలాంటి ఆలోచనా అందటంలేదు. డాక్టరు చంపబడితే మిగిలినవారు ఏవిధంగా చచ్చారు? వాళ్ళు కూడా చంపబడ్డారా? లేక ఒకరినొకరు చంపుకున్నారా?

పోలీసులు వెళ్ళిన తరువాత రాముని అడిగాడు మునసబు–"పోలీసులు చెప్పేది నిజమేనంటావా రామూ?"

అతడుకూడా దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టున్నాడు. వెంటనే జవాబివ్వలేకపోయాడు. రమణమ్మ మునసబువైపు చూసింది.

"ఇదంతా ఏదో మాయాజాలంగా ఉందండి! ఏది ఏమిటో అర్థం కావటం లేదు. నిన్నటిదాకా దెయ్యమన్నారు, చేతబడి అన్నారు. ఈరోజు చంపారంటున్నారు. ఇదంతా మా ప్రారబ్ధానికొచ్చి పడింది. మా బతుకు బజారులో పడటానికే జరిగింది" అంది కళ్ళు తుడుచుకుంటూ.

"ఎలా జరిగిందో మనం పూర్తిగా తెలుసుకోవాలి. హత్యఅంటే నేను నమ్మను. ఇది తప్పకుండా దెయ్యాలపనకాని, చేతబడి కాని కావాల్సిందే"

"వాటిద్వారా మంత్రాలతోనే చంపవచ్చు కదా! మరి గొంతుపిసికి చంపటమెందుకు? అయినా ఆయనను చంపవలసిన అవసరం ఎవరికి ఉందండీ?"

"ఏమో?" అన్నాడు మునసబు. కాసేపాగి ఆమెవైపు చూస్తూ–"ఈమధ్య మనిషి ఏమైనా మారినట్లు కనిపించాడా?" అన్నాడు.

"ఆవిధంగా నాకు అనిపించలేదండీ"

"ఎవరితోనయినా తగవు పెట్టుకున్నట్లు గానీ, తనతో ఎవరయినా పెట్టుకున్నట్లు గానీ చెప్పాడా?"

"అవన్నీ నాకు చెప్పరు. బయటి విషయాలు ఇంటిలోకి రావు. వచ్చినా అవి ముక్తసరిగా మాత్రమే! అయినా ఆయనలో మార్పేమీలేదు. కాని రాత్రి పూట అప్పుడప్పుడు హఠాత్తుగా లేచి కొంతసేపు కూర్చుండేవారు. పది నిముషాలు అలా కూర్చుని, ఏదో ఆలోచించుకుంటూ తిరిగి పడుకునేవారు. ఎందుకట్లా చేస్తున్నారని అడిగితే జవాబు ఉండేదికాదు"

"నాకన్పించేదేమంటే మొత్తానికి ఆయన ఏదో గూడుపుఠాణిలో పడ్డాడని! చేతబడి అయితే ఇది మన ఊరివారి పనే అయి ఉంటుంది. ఇద్దరు ముగ్గురు చేతబళ్ళు చేసేవారున్నారు. కాని, ఇతనికి – వారికి ఉన్న వైరమేమిటో మనకు తెలియదు. కేవలం దెయ్యాలపనే అయితే మనం




చేసేదేమీలేదు. చేతబడి అయితే మాత్రం తప్పకుండా తిరుగు దాడిచేయాలి" రాము ఆవేశంగా అన్నాడు.

అతని ముఖంవైపు చూసి తలతిప్పు కుంది ఆమె. మునసబు పంచెతో ముఖం తుడుచుకుంటూ వీధివైపు చూశాడు. సాయంత్రం చీకటి పడబోతున్నది. పొలాలనుండి ఎడ్లు, మనుషులు ఇళ్ళకు తిరిగి వస్తున్నారు. రోడ్డుమీద నడుస్తున్న పశువుల కాళ్ళకింద బురద చితికి చిట్లి పోతున్నది.

మునసబు లేచాడు.

"మాకు భయంగా ఉందండీ" అంది ఆమె లేచి నిలబడుతూ. మునసబు ఆవులించి చేతులు పైకెత్తి మెటికలు విరిచాడు. తల పంచుకుని పల్లెవాటు సవరించుకున్నాడు. భుజంమీది కండువా విదిలించి తిరిగి భుజంమీద వేసుకుంటూ— "ఏం భయపడవలసిన అవసరం లేదు. నేనున్నాగా" అన్నాడు వీధిలోనికి నడుస్తూ. అతడు కన్పించినంతదూరం చూసి రమణమ్మ లోనికి నడిచింది.

మునసబు ఊరి వెలుపలనున్న దేవా లయం వద్దకు దారితీశాడు. చుట్టూ పెద్ద ప్రహరీ మధ్య దేవాలయం విశాలంగా ఉంది. ప్రహరీ ముందు పెద్ద వేపచెట్టు, దానిచుట్టూ విశాలమైన అరుగు. చుట్టు పట్ల మరికొన్ని దిమ్మెలు ఏర్పాటుచేసి ఉన్నారు. తోవలోనే దేవాలయం ఉండటంవల్లా, విశాలమైనది కావడంవల్లా వచ్చే పోయే జనం అక్కడ తాత్కాలికంగా విశ్రాంతి తీసుకుంటుం టారు.

మునసబు అక్కడికి చేరేసరికి పూజారి నారాయణశాస్త్రిలు రామాయణం చేత పట్టుకొని, దారివెంట వచ్చిపోయేవారిని చూస్తూ కూర్చునున్నాడు. మునసబును చూసి పలకరింపుగా నవ్వి "రావయ్యా" అన్నాడు.

"నీ దగ్గరికే వస్తున్నాలే! ఇదేమిటి... రామాయణం చేత పట్టుకుని దారమ్మట నడిచేవారిని చూస్తున్నావ్" అన్నాడు మునసబు.

"పొద్దు గడవక" అన్నాడు లేస్తూ. కండువా దులుపుకుని భుజంమీద వేసుకుని "లోపలకు పోదాంపద" అంటూ ముందుకుసాగాడు. ఇద్దరూ దేవాలయ ఆవరణలోకివచ్చి ధ్వజస్థంభం అరుగుమీద కూర్చున్నారు. చీకట్లు కమ్ముకుం టున్నాయి. ఆవరణలో లైటు మసగ్గా వెలుగుతున్నది.

"ఈ విషయం విన్నారా?" అన్నాడు మునసబు శాస్త్రిని చూస్తూ.

"ఏ విషయం?"

"డాక్టర్ గొంతు పిసికి చంప బడ్డాడట"

శాస్త్రి తలూపాడు. "ఇంతకు ముందే విన్నాను. అందులో విశేషమేముంది?" అన్నాడు. నస్యంపట్టా లాగి, చేతికి తీసుకుని ముక్కుకు పట్టించాడు. జుట్టు ముడి విప్పి విదిలించి తిరిగి ముడివేసు కున్నాడు.

గూళ్ళకు చేరిన పావురాలు కిచ కిచమని అరుస్తున్నాయి. పిచ్చుకలు అటు ఇటు ఎగురుతూ అరుస్తున్నాయి. ఆవరణ బయట చెట్టుమీద కాకుల గోల విపరీతంగా ఉంది.

"డాక్టరును గొంతుపిసికి చంపే అవసరం ఎవరికి ఉంది?"

"నీకే ఉండవచ్చు?" అన్నాడు శాస్త్రి.

మునసబు తెల్లబోయి చూశాడు.

"ఏం! నేనన్నదాంట్లో తప్పేమిటి?"


"అదికాదు నేనంటున్నది? అసలు
న్నటిదాకా అతడు దెయ్యం చేతనో,
తబడి చేతనో చచ్చాడనుకున్నాం.
రోజు ఈవిధంగా మారిందేమిటని
శ్చర్యంగా ఉంది"
''ఇందులో వింతేమిటోయ్! చేతబడి
యబడినవాడు కూడా గొంతుపిసుక్కొని
వవచ్చు. దెయ్యంవల్ల చచ్చేవాడు కూడా

గొంతు పిసకబడి చావవచ్చు. అనేక పద్ధతులూ, పరిస్థితులూ ఉన్నాయి"

"నిజంగా దెయ్యాలూ, చేతబడులూ ఉన్నాయంటారా?"

"లేకపోవడమేమిటి ? ఈరోజుయితే ఈ అణ్వస్త్రాలు, ఆటంబాంబులూ కని పెట్టారు కానీ, పూర్వం రాజుల కాలంలో మైళ్ళ దూరంలో ఉన్న వ్యక్తిని కూడా ఈ చేతబడుల ద్వారానే నాశనం చేసే వారు. దేవతల కాలంలో మాయలూ, మంత్రాలతో మనుషుల్ని పశువులుగా, శిలలుగా తయారుచేశారని పురాణాల్లో చదివాం కదా...అవే చేతబడులంటే! అవి నేటికీ జరుగుతూనే ఉన్నాయి. కత్తితో

పొడుస్తే మనిషి చావకపోవచ్చు గానీ, చేతబడి చేస్తే ఇక వాడి బతుకు అయి నట్లే"

"నేను నమ్మను. కేవలం మంత్రాలో ఒక మనిషిని చంపడానికి అవకాశంఉంటే పల్లెటూళ్లలో ఒకరినొకరు కత్తులతో పొడుచుకోవడం, కాపువేసి నరకడం చేయ వలసిన పనేలేదు. అందరూ చేతబడి పద్ధతే అనుసరించేవారు గదా?"

"అవకాశం లేని చోట్లనే ఈ కత్తులు ఉపయోగిస్తూ చేతనయినచోట చేతబడుల ద్వారా నాశనం చేస్తున్నారు. ఇది ఎదుటి వాడికి చెప్పి చేయవలసిన పనిలేదు. పైగా చేసేవాడు చేయబడేవాడికి ఎన్నడూ తెలిసిరాడు"

"పూర్వం నుంచి ఇది నిజంగా జరుగు తున్నదంటావా?"

శాస్త్రి పెద్దగా నవ్వాడు. "నాకు తెలిసి నంతవరకూ తంజావూరు రఘునాథ రాయలు ఈ చేతబడితోనే చచ్చాడు. చంద్రగుప్తుడి చేతులు దీనివల్లనే చచ్చు బడ్డాయి. రామరాయలు కాళ్ళు దీనివల్లనే విరిగిపోయాయి. దీనివల్ల సాధ్యం కానిది ఏదీలేదు. ఇంతెందుకూ? నిన్న మొన్న చనిపోయిన నెహ్రూ చేతబడివల్ల పది హేను రోజులు మంచంలో నుండి లేవ లేక అన్నీ మంచంలోనే చేసుకుని చని పోయాడు కదా"

మునసబు నోరు వెళ్ళబెట్టాడు. "నెహ్రూ సాధారణ మరణం పొందాడు కదా?"

"ఎవరన్నారోయ్ పిచ్చోడా? ఆవిధంగా జనానికి భ్రమకల్పించారు. శాస్త్రిలను నమ్మని నెహ్రూను శాస్త్రం తోనే మడియగొట్టారు"

"నిజంగా?"

"మన న్యాయశాస్త్రంలో ఒక చట్టం వుందండి.పోలీసులచేతిలో అరెస్టుకాకుండా ఉండటానికి 'యాంటిసిపేటరీ బెయిల్' అనేది ఒకటి సృష్టించబడింది. ముందు గానే ఈ బెయిల్ తీసుకున్నవాడు నిజంగా హంతకుడే అయినా పోలీసులు ఏమీ చేయలేరు. అలాంటిదే ఈ చేతబడి కూడా"

మునసబు మాట్లాడలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"వెళ్దామా? సమయం మించిపోతు న్నది"

"పద పోదాం" లేచాడు మునసబు. ఇద్దరూ బయటకు వచ్చిన తరువాత తలుపులు లాగి, తాళం వేశాడు శాస్త్రి. ఇద్దరూ ఊరిలోనికి నడక సాగించారు.

"మీరు చెప్పేది నిజమయితే, ఈపని ప్రెసిడెంటుగాడే చేయించి ఉంటాడను కుంటాను" అన్నాడు మునసబు నడుస్తూ.

"ఎందుకనుకోవాలి?ముందే చెప్పాను— నువ్వే చేయించి ఉండొచ్చుగా! రమణమ్మను నీ చేతిలో పెట్టుకున్నావు. అడ్డు లేకుండా జేసుకోవాల్సిన అవసరం నీకే ఉంది"

"కాదు. ప్రెసిడెంటుగాడు ఆ రమణ మ్మను అకట్టుకోడానికి పడరాని పాట్లు పడి, ఆమెచేత అసహ్యించుకోబడి,డాక్టరు చేత చీవాట్లు తిన్నాడు. అవన్నీ బయట పడలేదు గానీ, అదే కోపంతో ఈ పని చేయించి ఉండవచ్చు గదా! పైగా ఆ మంత్రగాడు మల్లారెడ్డి పీడి మనిషేకదా?"

"తొందరగా ఒక నిర్ణయానికి రాకు" అన్నాడు శాస్త్రి. ఊరిలోకి వచ్చిన తరు వాత తన ఇంటి దారిపట్టాడు మునసబు. అతడు కనుమరుగవుతూనే, శాస్త్రి ప్రెసి డెంటు ఇంటి వైపు సాగాడు.





ప్రెసిడెంటు గోవర్ధనం ఇంటి అరుగు మీద కూర్చున్నాడు. పక్కనే అంగ రక్షకుడు సోములు కర్రపట్టుకొని, కింద కూర్చుని బీడీ దమ్ము లాగి వదులుతున్నాడు. కరెంటు ఉన్నట్లు లేదు. లాంతరు వెలుగుతున్నది. ప్రహారీ తలుపు దాటివస్తున్న శాస్త్రిని చూసి "రా...రావయ్యా! చాలా పొద్దుపోయి వస్తున్నావు?" అన్నాడు. శాస్త్రి వచ్చి కూర్చున్నాడు చుట్టూచూస్తూ. సగం చీకటి, సగం వెలుతురు ఆక్రమించు కున్నట్లుంది. కరెంటు వెలుతురులో తిరిగినవారికి కిరోసిన్ దీపాల వెలుతురు చీకటిగానే ఉంటుంది.

"ఏమిటి విశేషాలు?" అన్నాడు శాస్త్రి గోవర్ధనాన్ని చూస్తూ.

"డాక్టర్‌గారు గొంతుపిసికి చంప బడ్డాడని మెడికల్ రిపోర్టులో తేలిందట. ఆశ్చర్యంగా లేదూ" అన్నాడు గొంతు తగ్గించి మాట్లాడుతూ.

శాస్త్రి అర్థంగా తలతిప్పాడు. "అందులో ఆశ్చర్యం ఏముంది?"

"అదేంటయ్యా! వాన్ని చేతబడి చేయించింది మనం! చేతబడి ద్వారా చచ్చాడనుకుంటున్నాము. కాని గొంతు పిసకటం ద్వారా చస్తాడనుకోలేదుగదా!"

"కొంపదీసి కనుక్కున్నారనా! చేతబడిచేస్తే కూడా అలా చచ్చే అవకాశాలున్నాయి. ఉదాహరణకు – మన చేతబడి వాడిమీద పారే సమయంలో వాడిలో మతిస్థిమితం తప్పి ఉక్కిరిబిక్కిరవుతూ తన చేతులతో తన గొంతు తానే పిసుక్కోవచ్చు. అదే జరిగి ఉంటుంది. ఈ చేతబడి వ్యవహారం పోలీసులకు తెలియదుగనుక మరొకరు పిసికినట్లు భావిస్తున్నారేమో!"

"ఇది జరిగే పనేనంటారా?" అనుమానంగా అన్నాడు గోవర్ధనం.

"తప్పకుండా! ఎన్ని పురాణాల్లో లేదూ అపోధంగా అదిసరే! మునసబు నీమీద అనుమానపడుతున్నాడు. డాక్టర్ చావుకు నువ్వే కారకుడివని నిర్ణయించు కున్నట్లున్నాడు"

ప్రెసిడెంటు ముఖం భయంతో ముడుచుకుపోయింది. ఇంత వరకూ తన పేరు ఇందులో రాలేదు. ఇక బయట పడితే తను అభాసుపాలు కావలసి వస్తుంది.

శాస్త్రి తల ఊపుతూ "ఇంతకుముందే వాడి అనుమానాలన్నీ వెల్లడించాడు. ఏమాత్రం వాడు నిర్ధారణకువచ్చినా నీ పని ఇక అంతే!"

"ఏం చేయమంటారు?"

"ఏముంది? వాడినికూడా తీసేయటమే! అడ్డువచ్చినవాడిని వచ్చినట్లే తొలగించడం మంచిది"

వెంటనే మల్లారెడ్డికొరకు కబురు పంపించారు. మల్లారెడ్డి వస్తూనే ఇద్దరినీ చూసి "పెద్దలు కలిశారంటే ఏదో విశేషముంటుంది" అన్నాడు నవ్వుతూ.

"విశేషాలకేం చాలా ఉన్నాయి. రా! కూర్చో" అన్నాడు ప్రెసిడెంటు.

మునసబు మాట్లాడిన మాటలు వివరంగా అతడికి చెప్పారు. ఆ మాటలు విని మల్లారెడ్డి మండిపడ్డాడు. "వాడు మనసు చీడపురుగు. పైకి బాగానే ఉంటున్నా మనల్ని నాశనం చేయడానికే వాడి ప్రయత్నాలన్నీ. వాణ్ణి తీసేస్తే ఈ ఊరిలో మనకు అడ్డుండదని చెప్పినా మీరే వినలేదు"

"అడ్డువచ్చేవాణ్ని తీసేయాల్సిందే! కానీ ఎవడు ఎక్కువ పని ఆలోచిస్తే ముందు డాక్టర్ వచ్చాడు. వాడు పోయాడు. వాడి తర్వాత వీడు వస్తున్నాడు. ఇప్పుడు

పీడిని తీసేయాలి" శాస్త్రి సమాధానం ఇచ్చాడు.

"ఈవిధంగా మీ కొరకు నా శక్తి యుక్తులన్నీ నాశనం చేసుకోమంటారు. అంతేనా? ఇక భస్తే ఈ చేతబడి చేయను"

"బాబ్బాబూ! ఆ మాటంటే ఎట్లా? నువ్వు లేకపోతే మమ్మల్ని కుక్కల్లా చంపుతారు. నీవల్లే మేము ఇంతవరకూ బాగున్నాము. మునసబు బాధ్యత నువ్వే తీసుకోవాలి" అన్నాడు ప్రెసిడెంటు బతిమాలుతూ.

మల్లారెడ్డి శాంతించాడు. "ఏమిటి విషయాలు?" అన్నాడు నెమ్మదిగా.

"వాడిని తీసేయాలి!"

"నిజమే! వాడి తర్వాత మరొకడు వస్తాడు. ఈవిధంగా ఎంతమందిని తీస్తాం. వాడితో రాజీకివస్తే?"

"లాభంలేదు. వాడు మనతో కలవడు. ఆవిషయం వాడితో మాట్లాడితే నేను కూడా మీతో ఉన్నట్లు బయటపడి వాడి రహస్యాలు ఇక నాకు చెప్పడు. ఆవిధంగా చేరుతున్న సమాచారం కూడా ఆగిపోతుంది"

మల్లారెడ్డి చివరకు సరేనన్నట్లుగా తలూపాడు.

"ఈరోజే వాడి పని పట్టాలి" అన్నాడు ప్రెసిడెంటు.

"కాదు. బుచ్చి ఊరిలో లేదు. అది లేకుండా నేను ఏ పనీ చేయను. అది రేపు వస్తుంది. రేపు ప్రారంభిద్దాం. నాకు డబ్బు కావాలి. అందుకొరకే ఇప్పుడు వచ్చాను" అన్నాడు మల్లారెడ్డి ప్రెసిడెంటు వైపు చూసి.

"ఎంత?"

"పదివేల రూపాయలు"

ప్రెసిడెంటు నోరుతెరిచాడు. "పది వేలా? నా వద్ద లేదు"

"అదేంమాట! మన పంపకాల్లో ఇంకా ఎక్కువే వస్తుందిగదా నాకు"

"ఇప్పుడు నావద్ద లేదు"

"అలా కుదరదు. నాకు కావలసిందే!"

మల్లారెడ్డి మొండిపట్టు శాస్త్రికి తెలుసు. ఎంత మాటంటే అంతే ఇక! పదివేలు మర్యాదగా ఇచ్చి అతన్ని లాలించడమే మంచిదనుకున్నాడు.

"సరేలేవోయ్ రెడ్డి! ఇప్పుడంటే ఎట్లా? ఉదయం తీసుకో!"

"ఆ మాటంటే పేచీయేలేదు. లేదంటే నాకు మండుతుంది" అంటూ వెళ్ళి పోయాడు మల్లారెడ్డి.

"ఈ తలతిరుగుడు వెధవతో ఎప్పుడూ పేచీయే!" అన్నాడు గోవర్ధనం చీదరించుకుంటూ.

"అలా అంటే ఎట్లా? ఎవరిని ఎక్కడ ఎట్లా పట్టాలో ఆవిధంగానే పట్టాలి. అదుపెట్టుకోవాలి. లేకుంటే పనులు జరుగవుమరి! సరే వస్తాను" అంటూ లేచాడు శాస్త్రి. ప్రెసిడెంటు కూడా లేచి నిలబడ్డాడు.

"జాగ్రత్తగా విశేషాలు సేకరిస్తూ ఉండండి. మునసబుగాడు నామీద పోలీసు రిపోర్టు ఇచ్చినా ఇస్తాడు" అన్నాడు.

శాస్త్రి తలూపాడు.

ప్రెసిడెంటు ఎటువంటి పిరికివాడో శాస్త్రికి తెలుసు. అతడిని గుప్పిట్లో పెట్టు కోవడం ద్వారా తన పనులు సాగించు కోవాలని ఆయన ఉద్దేశం!

శాస్త్రిని ఆకట్టుకుని ఆయనద్వారా మునసబు రహస్యాలు బయటకు లాగాలని ప్రెసిడెంటు ఆరాటం.

వీరిద్దరినీ అడ్డుపెట్టుకుని తన మంత్ర





తంత్రాల ద్వారా తానేదో పొందవగల దన్న ఆశ కల్పించి ఇద్దరికీ ఎసరు పెట్టా లనేది మల్లారెడ్డి సిద్ధాంతం!

ఒకరిని మించినవాళ్ళు మరొకరు!




మల్లారెడ్డి ఇల్లు గ్రామం నడిబొడ్డున ఉంది. గ్రామ జాతర సమయంలో జాతర పెద్దమ్మను ఆ ఇంటికి కొంచెం దూరంలో గుడారంవేసి మూడురోజులు నిలబెడ తారు. ఆ తర్వాత వూరేగించి గ్రామం వెలుపలకు తీసుకుపోతారు. ఆ మూడు రోజులూ వాయిద్యగాళ్ళకూ, కూలీలకూ, పెద్దమనుషులకూ మల్లారెడ్డి ఇల్లు కేంద్రంగా ఉంటుంది.

మల్లారెడ్డి చిన్నప్పటినించీ చిల్లరమల్ల రగా తిరిగేవాడు. అతడికి చదువు లేదు. కొంతకాలం గ్రామంలో కనిపించకుండా వెళ్ళిపోయాడు. తిరిగివచ్చిన తర్వాత తాను చేతబడి ప్రయోగాలు నేర్చుకున్నా ననీ, ఎవరినయినా ఇట్టే చంపేయగలననీ మాట్లాడేవాడు. ఇతనిమాటలువిని కొందరు అపహాస్యం చేసినా మరికొందరు నిజమే నని నమ్మేవారు. ఆ తర్వాత రెండు మూడు ప్రయోగాలుచేసి కొందరిచావుకు కారణం కావడంతో అతడి చేతబడిమీద జనానికి విశ్వాసం, ఆ విశ్వాసంతోపాటు భయం కూడా ఏర్పడింది. అతని జోలికి వెళితే ముప్పుతప్పదన్న భయంతో దూరం దూరంగా ఉండేవారు. మొదటినుండీ మునసబుకు, ప్రెసిడెంట్ కు ఆ గ్రామంలో సరిపడదు. మల్లారెడ్డి ప్రెసిడెంటువేపు నిలిచి మునసబుని చంపేస్తానని ఎన్నో సార్లు బహిరంగంగానే అన్నాడు. అది తన నెత్తికి చుట్టుకుంటుందన్న భయంతో ప్రెసిడెంటు ప్రతిసారీ వారించేవాడు. ఈమధ్యనే సారాయిపాట మధ్య ఇద్దరికీ విభేదాలు మరింతగా వచ్చాయి. డాక్టరు ప్రెసిడెంటుకు సపోర్టు. డాక్టరు భార్యను మునసబు ఆక్రమించుకున్నాడు. ఆవిధంగా డాక్టరుఇంట్లో రెండు గ్రూపులు ఏర్పడ్డాయి. డాక్టరు భార్యను ఆక్రమించు కోవాలన్న తహతహతో ప్రయత్నం చేసిన ప్రెసిడెంటును ఆమె చెప్పుతో కొట్టడం, డాక్టరుకు ఈ విషయంతెలిసి ప్రెసిడెంటుతో తగవుపెట్టుకోవడంతో అతన్ని తీసివేయడానికి మల్లారెడ్డిద్వారా ప్రయత్నం జరిగింది. చివరకు డాక్టరు చావడం, ఇప్పుడు ఆ చావు కొత్తమలుపు తిరిగి ప్రెసిడెంటు మీదకు వస్తుందన్న భయం ఏర్పడ్డంతో మునసబును తీసేయ డమే శ్రేష్ఠమనుకున్నాడు. అతని చావు వల్ల వచ్చే నష్టాలకంటే బతికిఉంటే వచ్చే కష్టాలే ఎక్కువని భావించాడు.

మల్లారెడ్డి ఇంటివసారా అరుగులమీద సాయంత్రం ఏడుగంటలదాకా ఎవరో ఒకరు ఉంటారు. రాత్రిపూట కూడా పొరుగూరువాళ్లు తమ ఊరు వెళ్ళలేకపోతే అక్కడే పడుకుంటారు.

పొద్దుపోయేవరకూ మల్లారెడ్డి బయటే కూర్చున్నాడు. మునసబును గురించి బహి రంగంగా మాట్లాడటం మానుకున్నాడు. ఇప్పుడు ప్రగల్భాలు పలికితే మునసబు చావడమే జరిగితే తనద్వారానే జరిగిందని జనం భ్రమపడతారు. దానివల్ల తాను ఇరుక్కోవలసి వస్తుందని ముందుజాగ్రత్త

పడ్డాడు.

రాత్రి ఎనిమిది గంటలకు బుచ్చి వచ్చింది. బుచ్చి మగడుకూడా మంత్రగాడే. అతడి ద్వారానే మంత్రవిద్యలో ప్రావీణ్యం సంపాదించింది. అతని మంత్ర తంత్రాలకు విసిగిపోయిన జనం రాళ్ళతో కొట్టిచంపారు. అప్పటినుండీ బుచ్చి మల్లారెడ్డి మనిషయింది. తన మొగుణ్ని కొట్టి చంపించడానికి కారకుడయిన మునసబు మీద ప్రతీకారం తీర్చుకోవాలని కలలు కంటూ అవకాశం కొరకు ఎదురుచూస్తున్నది.

మంత్రగాళ్ళయినంత మాత్రాన పెద్ద మొనగాళ్ళేమీకాదు. పైగా మంత్రగాళ్లని తెలిస్తే జనం బహిరంగంగానే చంపుతారు. అందువల్ల మంత్రగాడికి కూడా వెనుక అర్థబలం, అంగబలం అవసరం! దానికి అనుగుణంగానే ప్రెసిడెంటును పట్టాడు మల్లారెడ్డి. అందువల్లనే మల్లారెడ్డి ఎన్ని ఆగడాలు చేసినా, ఇష్టం వచ్చినట్లు స్త్రీల మీద పడుతున్నా తెగించి జనం బుచ్చి మొగుణ్ణి కొట్టినంత సులభంగా చేయలేక పోతున్నారు. ఈ అవకాశం ఉపయోగించుకుని మరింత తీవ్రంగా జనంమీద పడటం ఆరంభించాడు. అతని మంత్రాలు,చేతబడుల వల్ల చావును సంగతటుంచి, అనేకమంది స్త్రీలను బెదిరించి మానభంగంచేసి, అడ్డమన్న మగవాళ్ళను నీ అంతుచూస్తానంటూ బెదిరించేవాడు.

సహజంగా జనం ఎవడినయితే అసహ్యించుకుంటారో, వాడికి సహాయంచేసే వారిని కూడా అసహ్యించుకుంటారు. అక్కడా అదే జరిగింది. జనంచేత క్రూరుడుగా అనిపించబడ్డ మల్లారెడ్డిని ప్రెసిడెంటు సపోర్టు చేయడంతో, అతని మీదా జనానికి అసహ్యం ఏర్పడింది జనంభయాన్ని చూస్తున్నారేగానీ, వారిలో అంతర్గతంగా ఉన్న అసహ్యాన్ని అర్థం చేసుకోలేకపోతున్నారు.

శాస్త్రి ఎవరికీ చెడ్డకాడు. అంతర్గతంగా ప్రెసిడెంటుతో, బహిరంగంగా మునసబుతో ఉంటూ మునసబు తన శిష్యుడని ప్రచారం చేసుకొంటాడు. కర్ర విరుగకూడదు, పాము చావకూడదు అనేరకం.

బుచ్చితోపాటు మరొక వ్యక్తి పెద్ద కట్టతో వచ్చాడు. ప్రెసిడెంటు పాలేరు అతడు. ప్రెసిడెంటుకు విశ్వాసమయిన వాడు. చేతబడి సమయంలో ధైర్యవంతుడయిన వ్యక్తి పక్కనుండాలని మల్లారెడ్డి చెప్పడంతో అతన్ని పంపించాడు ప్రెసిడెంటు.

ముగ్గురూ ఇంటిలోకివెళ్ళి తలుపులు బిగించారు. పూజామందిరంలో గంప కిందకు దించి అందులోని వస్తువులుతీసి కిందపెట్టారు.

ఎదురుగా పెద్ద కాళికాపటం! మెడలో పుర్రెలు ధరించి, ఎనిమిది చేతులలో ఎనిమిది ఆయుధాలు, మరో రెండు చేతులతో రక్తం కారుతున్న శిరస్సులు పట్టుకొని, నోటిలో నాలుక బయటకు చాపి, భయంకరంగా కన్పిస్తున్న సిలువెత్తు పటం. పటానికి పెద్ద పూలమాల వేశాడు మల్లారెడ్డి. ముగ్గుపిండితో ముగ్గులు వేశాడు. వాటి చుట్టూ పసుపుతో వలయాకారం, దానిపైన తిరిగి కుంకుమతో వలయాకారం వేశాడు. మధ్యన బోణపు కూడు పోశారు. అంతకుముందే సిద్ధంగా ఉంచిన కోడిని తెచ్చి గొంతు కొరికి, రక్తం బోణం కూడులో పోసి కలిపాడు. రెండు ఎముకలు, ఒక తల పుర్రె పటం ముందు పెట్టాడు. మెడలో




రుద్రాక్షమాలలు వేసుకున్నాడు. అడ్డబొట్టు పెట్టుకుని, పైన కోడి రక్తం బొట్టుగా పెట్టుకున్నాడు. అగరువత్తులు వెలిగించి నిమ్మకాయల కుప్ప పక్కకు తోసి రెండు కొబ్బరికాయలు కొట్టాడు.

ఇదంతా చూస్తుంటే వచ్చిన వ్యక్తికి గుండెలు గుబగుబమంటున్నాయి. ప్రెసిడెంటు పొమ్మంటే వచ్చాడు. ఇప్పుడు పారిపోదామనుకున్నా పారిపోలేకపోతున్నాడు.

మల్లారెడ్డి ముఖంలో క్రమక్రమంగా తీక్షణమయిన రూపం ఏర్పడుతున్నది. కనుగుడ్లు పెద్దవి చేస్తూ అవులిస్తున్నాడు.

"ఒరేయ్ శీనూ! ధైర్యంగా ఉండు. నీకేం భయంలేదు. ఈరోజు జగదాంబ నీకు దర్శనమిస్తుంది. నీ జన్మలో ఎన్నడూ చూడలేవు.... చూడు"

తలూపాడు శీను. కన్పించేది జగదాంబో కాదో కానీ, తాను పారిపోతే బాగుండు ననుకున్నాడు.

"నిమ్మకాయలు ఎప్పుడూ కోస్తుండు. నేను 'హ్రీం' అన్నప్పుడల్లా ఓ కొబ్బరి కాయ కొట్టు. భయపడకు. నిన్నేం చేయదు శక్తి! నువ్వు భయపడ్డావో కోడి రక్తం లాగే నీ రక్తం తాగుతుంది. నిమ్మకాయలు మాత్రం ఏమారకుండా కోయాలి. దృష్టి పక్కకు మరల్చవద్దు. ఎప్పుడూ అమ్మ మీదె ఉంచాలి. చూపు తప్పిందా నీ చూపు ఇక ఉండదు"

హెచ్చరికలు, జాగ్రత్తలు చెబుతూ తనపని తాను చేసుకుంటున్నాడు. వేప మండలు విరిచి, ఆకులు రక్తపు అన్నం మీద చల్లి, మరికొన్ని వేపమండలు చేతికి తీసుకుని అగరుబత్తి పొగవైపు విదిలించాడు. పొగ అటు ఇటు చెల్లా చెదురుగా వ్యాపిస్తున్నది. ఈలోగా బుచ్చి గుడ్డలు విప్పి నగ్నంగా వచ్చింది. చేత ఖడ్గం పట్టి, నొసటికి కోడి రక్తం పుద్దుకొని, జుట్టు విరియబోసుకుని, ఒక్క చేత వేపమండలు పట్టుకుని నిలబడింది. పూనకం వస్తున్నట్లు ఊగుతున్నది. ఆవేశంగా ఏదో అరుస్తున్నది. ఈ పరిస్థితిలో శీను గుండె క్షణక్షణానికి దిగజారి పోతున్నది. తన ప్రాణాలు కాపాడమని పటానికి మనసులోనే మొక్కుకున్నాడు. తనను ఆ దేవతకు బలి ఇవ్వడానికి తెచ్చారేమోనని అతనికి భయంగా ఉంది.

మల్లారెడ్డి గుడ్డలు విప్పాడు. ఓం, హ్రీం, హ్రాం అంటూ వేపమండలు చేతపట్టి అరుస్తూ ఎగురుతున్నాడు. మనిషి రూపంగల మట్టిబొమ్మను రక్తపు కూడు మధ్య పైన పెట్టి, వేపమండలతో ఆ బొమ్మను కొడుతూ అరుస్తున్నాడు. 'హ్రీం' అన్నప్పుడల్లా టెంకాయ కొడుతున్నాడు శీను. ఏమారకుండా నిమ్మకాయలు కోస్తున్నాడు.

పటంలో చలనం వస్తుందేమోనని పటం వేపే చూస్తున్నాడు. అలా దాదాపు రెండు గంటలు గడిచింది. పటంలో చలనం లేదు. వాళ్ళిద్దరూ అరవడం, ఎగరడమూ ఆపడం లేదు. శీనుకు క్రమ క్రమంగా భయం తగ్గి నిద్దుర వస్తున్నది. పగలంతా మట్టి బండికిపోసి, బండి పొలానికి తీసుకెళ్ళి, అక్కడ ఆ మట్టి లాగిలాగిచేతులు అలసిపోయాయి. శరీరం విశ్రాంతి కోరుతున్నది. ఇప్పుడీపని తగలకుంటే ఈపాటికి హాయిగా నిద్ర పోతుండేవాడు.

నిద్రమత్తుతో ఒక్క తూ లు డు తూలిన శీనుకు ఏదో శబ్దం అయినట్లని పించి కళ్ళు రెప్పలాడించాడు. అంత ఎత్తు పటం కిందకు ఫెళ ఫెళమంటూ విరిగి

పడింది. గాజు పెంకులు ఎగిరి దూరంగా పడ్డాయి. అమ్మ దర్శనమిస్తుందేమోనన్న భయం ఏర్పడింది. పిల్లి ఇంత భయంకరంగా ఉంటే ఇక అమ్మ ఎంత భయంకరంగా ఉంటుందో ఆ ఊహ భరించలేకపోయాడు. పటం వెనకనుండి పెద్ద పందికొక్కు పరిగెత్తుతూ రావటంతో అదే అమ్మవారన్న భయంతో, భయానకంగా కేకవేసి శీను పరుగెత్తాడు. తలుపు తీసి అరుచుకుంటూ వీధివెంట పరుగుతీశాడు. వసారాలో పడుకున్న ఒకరిద్దరు ఈ అరుపులు విని వాళ్ళూ పరుగెత్తడం ఆరంభించారు. అసలే బురద రొంపి. వాళ్ళు పరుగెత్తడంతో బురద శబ్దం చేస్తూ చిట్లిపోతున్నది. ఈ అరుపులకూ, శబ్దాలకూ ఇళ్ళలోని జనం నిద్రనుండి లేచారు. కానీ, ధైర్యంగా తలుపు తెరవడానికి సిద్ధంగా లేరు. మూడు రోజుల కిందటే చేతబడిలో చనిపోయిన డాక్టర్ వారికి కన్పిస్తున్నాడు. చావు కేకలు వేస్తున్నా ఎవరూ వినిపించు



కునే స్థితిలో లేదు. బతికుంటే ఉదయం చూద్దామనుకున్నారు.

శీను ఆ పరుగు సరాసరి ప్రెసిడెంటు ఇంటిలో పడేవరకూ తీశాడు. తలుపులు దబదబా బాదడంతో ఆడవాళ్ళు తలుపు తీశారు. చావుకళతో కన్పిస్తున్న శీనును చూసి "ఏమయిందిరా?" అంది ఆమె.

శీను మాట్లాడలేదు. వణుకుతున్నట్టు ప్రెసిడెంటు మంచం దగ్గరకు వెళ్ళి రెండుకాళ్ళు పట్టుకున్నాడు. ఎగరొప్పు వస్తున్నది. "ఏమిట్రా?" అంటున్న ప్రెసిడెంటు మాటలు అతనికి విన్పించడం లేదు. స్పృహతప్పి పడ్డాడు. పరిస్థితి ఏమిటో తెలియక ప్రెసిడెంటు భార్య మరికొందరిని లేపి తీసుకొచ్చింది. అందరూ మంచం చుట్టూ నిలబడ్డారు. ఒకరు బుంగతో నీళ్ళు తెచ్చి పోశారు. కొంతసేపటికి కళ్ళు టపటపలాడించి తెరచి చూశాడు. చుట్టూ ఉన్న జనాన్ని చూసి కెవ్వున అరచి తల పక్కకు తిప్పుకుని కళ్ళు మూసుకున్నాడు.

"ఏమయిందిరా శీనూ! నేనురా...ప్రెసిడెంటును మాట్లాడుతున్నాను. నీకేం భయంలేదు. చెప్పు చెప్పు"

శాస్త్రి వచ్చాడు. నాడి పట్టి చూశాడు. రొమ్ము మీద చెయ్యివేసి చూశాడు. కళ్ళు రెప్పలు విప్పి చూశాడు.

"అందరూ ఎందుకు? వెళ్ళండి. పిల్లడిని పడుకోనివ్వండి. కొంచెం విశ్రాంతి తీసుకుంటే బాగుంటుంది. ఉదయం మాట్లాడదాము" అన్నాడు. కాళ్ళు లాగి నిటారుగా చాపాడు. చేతులు కూడా బారుగా చాపాడు. ఎగసిపడుతున్న రొమ్ము వైపు చూస్తున్నాడు. జనం చాలా మంది వెళ్ళిపోయారు. ముఖ్యులనుకున్న ఒకరిద్దరు నిలబడ్డారు.

పావుగంట తర్వాత మళ్ళీ కదిలించాడు ప్రెసిడెంటు. "శీనూ! ఏమయిందిరా? చెప్పు నీకేంభయంలేదు. నేనున్నానుగా" అన్నాడు వీపు తట్టి.

అప్పటికి నోటినుండి మాట రాలేదు. చివరకు పెగిల్చి అన్నాడు "అమ్మ కనపడింది. పందికొక్కు రూపంలో వచ్చింది"

శాస్త్రి, ప్రెసిడెంటు ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. అమ్మేమిటి? పందికొక్కు ఏమిటి? వారికి విచిత్రంగానూ, భయంగానూ ఉంది. అక్కడ ఏం జరిగిందో వివరంగా తెలిస్తేగానీ, తాము ఇప్పుడు ఏం చేయాలో ఆలోచించలేరు. ఆ యింటి దగ్గరకు పోవడానికి వారికి ధైర్యంలేదు. వివరాలు చెప్పవలసినవాడు చెప్పలేక పోతున్నాడు.

శాస్త్రి శీను గుండె నిమిరాడు "ఎందుకంత భయం? జరిగిందేదో జరిగిపోయింది. ఇక భయపడవలసిన పని లేదులే" ధైర్యం చెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆవిధంగా అనునయించి కూపీ లాగాలని ఆతృత! శీను నిమ్మళించాడు. మరో గంటకు బాగా తేరుకున్నాడు. చుట్టూ ఉన్న నలుగురినీ పరకాయించి చూశాడు. అంతవరకూ జరిగింది పూసగుచ్చినట్లు తెల్పాడు.

అంతా విన్న ప్రెసిడెంటు "పందికొక్కేమిటి?" అన్నాడు భయంగా!

"అంతే! దేవుడు అనేక రూపాలలో దర్శనమిస్తాడు. మత్స్యావతారం, కూర్మావతారం, కోడి అవతారం, కప్ప అవతారం— మనం ఎన్నో విన్నాం. అమ్మ ఈసారి పందికొక్కు రూపంలో ప్రత్యక్షమయి ఉంటుంది" శాస్త్రి శాంతంగా అన్నాడు ఆలోచిస్తూ. ముఖం మీద దరహాసం వెల్లివిరిసింది. అతని ముఖం చూసి ప్రెసి




డెంటు ధైర్యపడ్డాడు. "ఇక మునసబు గాడి పని అయిపోతుంది. ఊరిలో పీడ విరగడవుతుంది" అన్నాడు ఊపిరి పీల్చి విడుస్తూ.

తెల్లవారుఝాము వరకూ అక్కడి నుండి కబురు వస్తుందేమోనని ఎదురు చూశారు. మునసబు చనిపోయినట్లు కూడా కబురు వస్తుందని చూస్తున్నారు. కాని ఏ కబురూ రాలేదు. తెల్లవారేవరకూ అక్కడ ఉంటే తాను బయటపడతా నన్న భయంతో శాస్త్రి ఇంటికి వెళ్తూ "తెల్లారే వరకూ అటు వెళ్లకు. అసలు బయటకే వెళ్ళకపోవడం మంచిది" అన్నాడు.

ప్రెసిడెంటు తలూపాడు. శాస్త్రి వెళ్లి పోయాడు.

నిముషమో యుగంగా ఉంది ప్రెసి డెంటుకు. రాత్రంతా నిద్దురలేదు. ఏం జరిగిందో ఊహిస్తూ కాలం గడుపు తున్నాడు. మునసబు చనిపోతే తాను చేయవలసిన పనులు, జనంపద్ద ఏవిధంగా ప్రవర్తించాలన్నదీ ఆలోచిస్తున్నాడు.

బయట ఎవరో ఆదుర్దాగా మాట్లాడు తుంటే విని, ప్రెసిడెంటు బయటకు వచ్చాడు. బాగా తెల్లారిపోయింది. అతన్ని చూసి మాట్లాడుతున్నవారు దగ్గరగా వచ్చారు.

"ఇది విన్నారా?" అన్నాడు ఒకవ్యక్తి. మునసబు మరణవార్త కొరకు కాచుకుని ఉన్న ప్రెసిడెంటు అతడే చనిపోయి ఉంటాడనుకున్నాడు. అదురుతున్న గుండెల్ని దిటవుచేసుకుంటూ "ఏమిటి?" అన్నాడు.

"మనూర్లోమంత్రగాడు లేడూ... వాడే నండీ మల్లారెడ్డిగాడు! వాడి ఇంట్లోనే వాడు చచ్చిపడిఉన్నాడు"

"ఆ!" అంటూ నోరు తెరచాడు ప్రెసిడెంటు. అతని గుండె క్షణక్షణానికీ వేగం హెచ్చుతున్నది. అతడి చెవుల్లో రెళ్లు చూసుకుపోతున్నంత రొద! నిలబడ లేక అరుగుమీద కూర్చున్నాడు.

"అతి భయంకరంగా చంపబడ్డా డండీ పాపం! రౌడీ ముండాకొడుకు! చివ రకు వాడి చావుకూడా రౌడీ పద్ధతిలోనే జరిగింది"

ప్రెసిడెంటు మాట్లాడలేదు. అత డెందుకు మౌనం వహించాడో మాట్లాడే వ్యక్తికి అర్థంకాలేదు. వారిద్దరికీ ఉన్న సంబంధం చాలా మందికి తెలుసు గనుక, ఇందులో ఏదయినా రహస్యముందేమో ననిపించింది.

ఇంతలో శాస్త్రి వచ్చాడు. ఆపాటికే శాస్త్రికి ఈ విషయం తెలిసిపోయింది. చెప్పడానికే వచ్చినట్లుంటుందన్న ఉద్దే శంతో తనకు ఏమీ తెలియనట్లే నటిం చాడు.

"ఏమిటయ్యా గోవర్ధనం! పొద్దున్నే బయట కూర్చున్నావేమిటి ? ఆరోగ్యం బాగుండలేదేమిటి?" అన్నాడు శాస్త్రి.

"మల్లారెడ్డి చచ్చాడట. మీకు తెలి సిందా?" అన్నాడు ఆదుర్దాగా ప్రెసి డెంటు. శాస్త్రి ఆశ్చర్యంగా అతని వైపు చూశాడు.

"ఏ మల్లారెడ్డి?"

"అదేనయ్యా...మంత్రగాడు మల్లా రెడ్డి!"

"వాడికేమయ్యా! నిన్న బాగానే ఉన్నాడు. నేను చూశాను కూడా!"

"ఈరోజు చచ్చాడట. ఒకసారి వెళ్ళి వద్దాం పదండి" అన్నాడు ప్రెసిడెంటు. అక్కడే ఉన్న మరో ఇద్దరు వారి వెంట నడిచారు

మల్లారెడ్డి ఇంటివద్దకు వచ్చేసరికి జనం వీధి పట్టకుండా నిలబడ్డారు. కింద బురద! ఆ బురదను గజిబిజిగా తొక్కుతూ లోపల ఏముందో, ఏం జరిగిందో చూడాలన్న ఆత్రుత జనానికి! వెట్టివాళ్లు ఎవరినీ లోపలకు రానివ్వడంలేదు. తెరిచిన తలుపులు తెరచినట్లే ఉన్నాయి. వసారాలో మునసబు, కరణం, నలుగురు వెట్టివాళ్లు ఉన్నారు. ఒకరిద్దరు పెద్దమనుషులు మునసబు దగ్గరకు వచ్చి మాట్లాడి వెళ్తున్నారు.

ఆ సమయంలో ప్రెసిడెంటు, శాస్త్రి అక్కడకు వచ్చారు.

"ఏమిటోయ్ మునసబూ! ఏం జరిగింది?" అన్నాడు శాస్త్రి.

"మల్లారెడ్డి చనిపోయాడండీ! పోలీసులకు రిపోర్టు పంపించాము. వాళ్ళు వచ్చేవరకూ జనాన్ని లోపలకు పోకుండా ఆపాము" అన్నాడు.

ప్రెసిండెటు, శాస్త్రి ఇద్దరూ వసారాలో అరుగుమీద కూర్చున్నారు.

"ఎట్లా చనిపోయాడు?"

"వాడిని గురించి అందరికీ తెలిసిందే కదండీ! వాడో రౌడీ. ఏదో మంత్రాలు తంత్రాలంటూ, మనుషులమీద ప్రయోగిస్తానంటూ అందర్నీ బెదరించి ఆడపిల్లలను చెరచడం, డబ్బులు లాగటం అలవాటయింది. అలాంటిది మళ్లీ ఏదో చేయబోయి వాడికర్మ వాడే అనుభవించినట్లున్నాడు"

"ఇంతకీ చచ్చాడా, చంపబడ్డాడా?'' అనుమానంగా అడిగాడు శాస్త్రి.

"చంపబడ్డాడు. ఆ చంపబడటం కూడా ఘోరంగా! కుక్క కూడా అంత ఘోరంగా చంపబడదేమో" వికృతంగా ముఖంపెట్టి అన్నాడు మునసబు. ప్రెసిడెంటు మాట్లాడలేదు. ఇద్దరూ అవసరమైతే గానీ పలుక్కోరు. ఇద్దరిమధ్యా వైరమేమీ లేకున్నా, డాక్టరు భార్య రమణమ్మ మునసబు స్వంతం కావడంతో, ప్రెసిడెంటు గుండెలు మండుతూ ఉన్నాయి. తనను చెప్పు దెబ్బలు కొట్టినదానికి వీడు రక్షకుడు అనుకున్నప్పుడల్లా ఎంత తొందరగా వీడిని హతమారుద్దామా అన్నంత కసి ప్రెసిడెంటుది. పైకి ప్రశాంతంగా ఉండి అదను కొరకు ఎదురుచూస్తున్నాడు. చివరకు మల్లారెడ్డిని ప్రయోగిస్తే ఆ మల్లారెడ్డే గుడ్లు తేలేశాడు. మల్లారెడ్డి చనిపోయినందుకు కాదు ప్రెసిడెంటు బాధ - తప్పించుకుపోయిన బుచ్చి వచ్చి ఈ ఘటనకంతటికీ కారకుడు తానేనని చెబుతుందేమోనన్న భయం! శీను బతికి బయటపడినా, తన కాపలా కుక్కలాంటి వాడు కాబట్టి వాడినుండి ఏ రహస్యం బయట పడకపోవచ్చు. కాని బుచ్చి అలా ఊరకుంటుందా? అసలు దీనికి కారణం తానేనని బుచ్చికి మల్లారెడ్డి చెప్పి ఉంటాడా?

పోలీసువ్యాను దూసుకుంటూ వచ్చింది. టైర్లకింద పడ్డ బురద ఆటూ ఇటూ చిమ్మింది. కొంత జనంమీద పడింది. జనం తిట్టుకుంటూ దూరంగా జరిగారు.

పోలీసులు వ్యానునుండి దిగారు. మునసబు ఇన్‌స్పెక్టరు ఎదురుగా వచ్చి "రండి" అన్నాడు చిరునవ్వుతో.

ఇన్‌స్పెక్టర్ హుందాగా దిగి చుట్టూ చూసి తల పంకించి "ఏమయింది మునసబుగారూ?" అన్నాడు.

"ఈ ఇంటి ఆసామీ చంపబడ్డాడు. ఎలా చంపబడిందీ తెలియడంలేదు" అన్నాడు. ఇన్‌స్పెక్టర్ తలుపువద్ద ఇద్దరు పోలీసులను పెట్టి లోపలకు నడిచాడు.





ఆయన వెంట ప్రెసిడెంటు, శాస్త్రి, మునసబు, కరణం లోపలకు వెళ్లారు.

పూజామందిరంలోకి అడుగు పెట్ట బోయిన ఇన్‌స్పెక్టర్ షాక్‌తిన్నట్లు ఒక్కసారి అడుగు వెనక్కి వేశాడు. అతని గుండె కూడా కొద్దిసేపు వణకి పోయింది. ప్రెసిడెంటు, శాస్త్రి ఆ దృశ్యం చూసి వణకిపోతున్నారు.

మల్లారెడ్డి శరీరం నగ్నంగా ఉంది. బలమైన కత్తితో ముక్కలుగా నరికినట్లు ఉంది. ఒక కాలు నరికి దూరంగా వేయబడి ఉంది. చెయ్యి నరికి వేయబడిఉంది కానీ ఊడిరాలేదు. తల నరికి, ఒకకాలు మోచెయ్యి వరకూ నరికి పటంముందు బలి కంఠంలాగా అమర్చబడి ఉంది. ఆ గది మొత్తం రక్తంతో తడిసి ఆరిపోవడం వల్ల లైటువెలుతుర్లో నిగనిగమెరుస్తున్నది. ఖడ్గంలాటిది అక్కడే ఉంది. రక్తపు కూడు అలాగే కుప్పగా ఉంది. కుప్పపైన మనిషి ఆకారంలో గోధుమపిండి బొమ్మ ఒకటి ఉంది. కోసివేయబడ్డనిమ్మకాయలు, పగులగొట్టబడ్డ టెంకాయలు, కాలి ఆరి పోయిన అగర్‌బత్తీలు, తమలపాకులు, వక్కలు, కుంకుమ పసుపు డబ్బాలు, ముగ్గు డబ్బా, పగిలిపోయిన పెద్ద కాళికా పటం, చెల్లాచెదరుగా పడ్డ అద్దపు తునకలలో ఆ గది చూడడానికే భయం కరంగా ఉంది.

అక్కడ నిలబడ్డ అందరిముఖాల్లోనికి చూశాడు ఇన్‌స్పెక్టర్. లోపలకు అడుగు వేసి ఖడ్గాన్ని కర్చీఫ్‌తో ఒకవైపుగా పట్టి కొంచెం ఎత్తాడు. చాలా బరువుగా ఉంది. దానిదెబ్బ పడితే కాలో చెయ్యో తెగడం పెద్ద వింతేమీకాదు. బహుశా దానితోనే ఆ దేహాన్ని నరికేసి ఉండవచ్చు అను కున్నాడు.

"మునసబుగారూ! మళ్లీ టౌనుకు వ్యాను పంపించాలి. ఇంత దారుణంగా ఉంటుందనుకోలేదు. హత్య అంటే మామూలేననుకున్నాను. ఈ పరిసరాల్ని ఫొటోలు తీయించాలి. నిపుణుల్ని రప్పించాలి" అంటూ కానిస్టేబుల్‌ను పిలిచి చెప్పాడు.

ఆయన ఆజ్ఞ అవుతూనే వ్యాను వెళ్ళిపోయింది. అందరూ వసారాలోనికి వచ్చి కూర్చున్నారు. తలకున్న టోపీతీసి కింద పెడుతూ "ఎలా జరిగిఉండవచ్చు?" అన్నాడు స్వగతంగా.

ఎవ్వరూ పలుకలేదు. పోలీసులతో చర్చిస్తే ఏమవుతుందోనన్న భయం. ఇది ఇంతదారుణంగా, హృదయవిదారకంగా ఉంటుందని ప్రెసిడెంటుగాని, శాస్త్రిగాని అనుకోలేదు. అతన్ని ఎవరు చంపా రన్నది వారిముందున్న ప్రశ్న! బుచ్చి అంతలావు హత్యచేసి ఉంటుందా? ఏమో? ఇటువంటి రక్తం ఎన్నోసార్లు అదిచూసే ఉంటుంది. అటువంటప్పుడు భయమేమిటి?

"ఎవరితను?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నోట్స్ తీసి రాసుకోడానికి సిద్ధపడుతూ. మునసబు గొంతు సవరించుకున్నాడు — ఇటువంటి కేసులన్నీ తనకు తోడవు తున్నాయన్న భావనతో.

"మల్లారెడ్డి. పూర్తి పేరు వీరగాని మల్లారెడ్డి"

"ఏం చేస్తుంటాడు?"

"ఏం ఉందండీ! జులాయివెధవ! చిన్న ప్పటినుండి రౌడీగా తిరిగాడు. అటు తర్వాత కొన్నాళ్లు కేరళ ప్రాంతం వెళ్ళి మలయాళ మంత్రాలు నేర్చుకొని వచ్చా నని చెబుతుండేవాడు. ఎంతవరకు నిజమో ఎవరికీ తెలియదు.ఆడవాళ్లమీద దాడి వాడి నిత్యకృత్యం! ఎవరయినా డబ్బులివ్వక

పోతే చేతబడి చేసి చంపేస్తానని బెదరి స్తుంటాడు. వాడికి చేతబడి ఎంత తెలుసో, ఆ చేతబడివల్ల జనం ఎంతవరకు భస్తారో గానీ జనాన్ని మాత్రం బాగా బెదిరించే వాడు" అన్నాడు మునసబు.

ఇన్‌స్పెక్టర్ నవ్వి "మీకు వాడిమీద బాగా కక్ష ఉన్నట్లుందే?" అన్నాడు.

మునసబు తప్పొప్పు పడ్డాడు. తాను ఆవేశంగా మాట్లాడాననుకున్నాడు.

"అది కాదండీ! ఉన్న విషయం చెబుతున్నాను. ఇక్కడి ప్రజలను అడిగితే మీకే తెలుస్తుంది కదా"

"సరే! ఇతడి ఆస్థిపాస్థులేమిటి?"

"ఇదిగో, ఈ ఇల్లు స్వంతమే! ఇంతకు మించి మరేం ఆస్థిలేదు. ఇది కూడా తాకట్టులో ఉంటే విడిపించాడు ఈమధ్యనే!"

"ఎవరికి తాకట్టుపెట్టాడు?"

"ప్రెసిడెంటుగారికి"

ఇన్‌స్పెక్టరు ప్రెసిడెంటువైపు తల తిప్పి చూశాడు.

"దీన్ని ఎంతకు తాకట్టు పెట్టుకున్నారండీ?"

"పదివేలరూపాయలకు తాకట్టు పెట్టుకున్నానండీ"

"పదివేల రూపాయలు ఇచ్చి విడిపించుకున్నాడా?"

"ఆఁ! విడిపించుకున్నాడు ఈమధ్యనే"

ఆశ్చర్యంగా ప్రెసిడెంటు వైపు చూశాడు ఇన్‌స్పెక్టర్! "పైసా ఆదాయం వచ్చే అవకాశం లేనివాడు ఏవిధంగా పదివేలు తీర్చాడండీ?"

ప్రెసిడెంటు మాట్లాడడానికి ఊపిరాడ లేదు. తమాయించుకోడానికి నిమిషం పట్టింది.

"నాకా వివరాలేవీ తెలియవు. డబ్బు తెచ్చిచ్చి తనఖా పత్రం వాపసు తీసుకున్నాడండీ"

"పెళ్లాం, పిల్లలు లేరా మునసబు గారూ?"

"లేరండీ! ఒక్కడే ఉంటున్నాడు."

"అంటే రక్తబంధువులు కూడా ఎవరూ లేరా?"

"లేరు. ఒక్కడే"

ఇంతలో వ్యాను వచ్చింది. ఫొటోలు తీయమని చెప్పాడు ఇన్‌స్పెక్టర్. ఫొటోగ్రాఫర్ లోపలకు వెళ్ళాడు. జనం తొడ తొక్కిడిగా ఉన్నారు. లోపల ఎట్లా జరిగిందో చూడాలని వారి ఆదుర్దా! పోలీసులు, వెట్టివాళ్లు జనాన్ని తోసి వేస్తున్నారు. ఎవరో కొంత బురద పోలీసులమీద విసరివేశారు వెనుకనుండి.

ఫొటోలు తీయడం అవుతూనే ఇన్‌స్పెక్టర్ లేచి వ్యాను వద్దకు వచ్చాడు. పోలీసులు, హెడ్‌కానిస్టేబుల్ కలిసి లోపలికి వెళ్ళి శవాన్ని, ముక్కలను అక్కడి వస్తువులను రక్తపు కూడు, నిమ్మకాయలు, దెంకాయలతో సహా తెచ్చి వ్యానులో చేర్చారు. తలుపు తాళం వేయడానికి పోలీసు ప్రయత్నం చేస్తుండగా ఏదో తట్టినట్లు ఇన్‌స్పెక్టర్ తిరిగి లోపలకు వచ్చాడు. అతని వెంట పోలీసులు ఇద్దరు లోపలకు వెళ్ళారు.

వంటింటి వైపు దారి తీశాడు. చాలా చెక్కపెట్టెలు పేర్చబడిఉన్నాయి. ఒక పెట్టె మూత ఊడతీయమని ఆదేశించాడు ఇన్‌స్పెక్టర్. కానిస్టేబుల్ మూత తీశాడు. పైన ప్లాస్టిక్ కాగితాలు! కొన్ని పేపర్లు తొలగించి చూస్తే అడుగున సంచులలో నల్లమందు కన్పించింది. పెట్టెల మూతలన్నీ తెరచి వేశారు. అన్నిపెట్టెల్లోనూ




నల్లమందు, గంజాయి స్టాకు చేయబడి ఉంది. మునసబును, ఫొటోగ్రాఫర్‌ను పిలువమని ఆదేశించాడు. ఫొటోగ్రాఫర్‌ను ఫొటోలు తీయమని ఆదేశించి మునసబు వైపు తిరిగి – "ఇదేమిటో తెలుసా మునసబుగారూ?" అన్నాడు సంచి పైకెత్తి.

"నాకు తెలియదండీ" అన్నాడు సంచివైపు చూస్తూ.

"ఇదే గంజాయి అంటే! ఇది నల్లమందు. ఇవిగో ఈ పెట్టెల్నిండా ఆ మందే! ఏమీ లేనివాడు పదివేల రూపాయలు చెల్లించి తన ఇల్లు విడిపించుకున్నాడంటే అనుమానం వచ్చింది. ఈ ప్రాంతాలలో నల్లమందు, గంజాయి స్మగుల్ అవుతు ఎక్కొందని వార్తలున్నాయి. కాని, అది ఇక్కడ ఇలా దొరుకుతుందనుకోలేదు" అన్నాడు.

మునసబు గుండె అదురుతున్నది. ఇంతవరకూ మల్లారెడ్డి బజారు రౌడీ అనుకున్నాడు. అతడో ఘరానా స్మగ్లర్ అన్న సంగతి ఇప్పుడే అర్థమవుతున్నది.

ఇన్‌స్పెక్టర్ ఊపిరి పీల్చి విడిచి బయటకు వచ్చాడు. లోపల నుంచి బయటకు పోయే మార్గాలన్నీ మూసి, తలుపు తాళం వేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. నలుగురు కానిస్టేబుళ్లను అక్కడ కాపలా పెట్టాడు. నల్లమందు, గంజాయి సంచులు రెండు తీసుకొని వ్యాను ఎక్కాడు.

"రేపు మళ్ళీ వస్తాను. మీరు ఇంటి వద్దే ఉండండి" అన్నాడు మునసబును చూస్తూ. మునసబు తల ఊపి రెండు చేతులు ఎత్తి నమస్కారం చేశాడు. ప్రతినమస్కారం చేసి పోనివ్వమని డ్రైవర్‌ను ఆదేశించాడు. వ్యాను వెళ్ళిపోయింది.

"ఏమిటయ్యా! మునసబూ పరిస్థితి ఇట్లా వచ్చింది!" అన్నాడు శాస్త్రి.

మునసబు విషాదంగా నవ్వాడు. "మన ఊరికేదో పీడ తగుల్కొంది. ఒకదాని కొకటి ఆరంభమయ్యాయి. ఇంకా ఎందరు పోతారో?" అన్నాడు వేదాంత ధోరణిలో! జనంలో గుసగుసలు ఆరంభమయ్యాయి. మునసబు మనుషులు మునసబునూ, ప్రెసిడెంటు మనుషులు ఆయననూ చుట్టుముట్టి వివరాలడుగుతున్నారు. వారికి తెలిసింది వారు చెబుతున్నారు.

క్రమక్రమంగా జనం పల్చబడ్డారు. వెట్టివాళ్ళను ఇంటికి పంపి పోలీసులకు అన్నం తెప్పించాడు. అన్నం తిని పేక ముక్కలు బయటకు తీసి కూర్చున్నారు పోలీసులు.

ప్రెసిడెంటు, శాస్త్రి విడిపోయారు కళ్ళతో మాట్లాడుకుని! శాస్త్రి మునసబు వద్దకు వచ్చి "ఎవరు చంపివుంటారని నీ ఉద్దేశం?" అన్నాడు.

"ఎట్లా చెప్పగలం? మనమేదైనా ఊహించి మాట్లాడామనుకో.... అనవసరంగా వాళ్ళను ఇందులో ఇరికించినట్లవుతుంది"

"డాక్టర్ చావుకు కారకుడు మల్లారెడ్డి అని జనం అనుకుంటున్నారుకదా...వారే ఏమైనా చేయించారేమో?"

"నాకేమీ తెలియదండీ! అయినా అతడి ఇంట్లో ఇంతలావుపని చేసే వాళ్ళెవరు? మొనగాళ్ళందరూ తమ పెళ్ళాలను ఏమన్నా వాణ్ణి ఏమీ చేయలేక నోరుమూసుకునేవారు గదా! వాళ్ళేం చేస్తారు?"

"ఏముందిలే! ఆవేశం వచ్చి తెగబడాలిగాని ఎలుక ఏనుగు కాకూడదా

ఏం?" అంటూ శాస్త్రి ముందుకు కదిలాడు. పోతున్న అతన్ని చూస్తూ నిలబడ్డాడు మునసబు.

"మునసబుగారూ! మధ్యాహ్నం కాఫీ ఫలహారం పంపండి" అన్నాడు కానిస్టేబుల్ ఒకడు. మునసబు అసహనంగా కన్నెగరేశాడు. ఇదో పీడ..అయినా తప్పదు.

* * *

మధ్యాహ్నం శాస్త్రిగారింటికి వెళ్ళాడు మునసబు! శాస్త్రిగారు మంచంలో పడుకుని పైనున్న వాసాల్ని లెక్కపెడుతున్నాడు. ఇందులో తాను ఏవిధంగా ఇరుక్కుంటాడో, ఏవిధంగా తప్పించుకోవాలో అంచనా వేస్తున్నాడు. మునసబు రావడంతో లేచి కూర్చుని "రావోయ్" అన్నాడు. మునసబు పక్కనున్న స్టూల్ మీద కూర్చున్నాడు. "ఏమిటి విశేషాలు?" అన్నాడు శాస్త్రి.

"మీకు తెలిసినవే! కొత్తవేమున్నాయ్? అయినా వీడు ఇటువంటివాడని మనకు ఇంతవరకూ తెలియదే!" అన్నాడు మునసబు ఆశ్చర్యంగా.



శాస్త్రి మాట్లాడలేదు.

"వీడికి అంత సరుకు దాచిపెట్టడానికి ఇంతడబ్బు ఎక్కడిది? దీని వెనుక ఏదో పెద్ద ముఠా ఉంటుందని పోలీసుల అనుమానం! పదివేలు ఒక్కసారి కట్టి ఇల్లు తనఖా విడిపించుకున్నాడంటేనే ఇన్స్పెక్టర్‌కు అనుమానం వచ్చింది. వీడి వెనుక కాయకులెవరై ఉండవచ్చు?"

శాస్త్రి మెత్తగా నవ్వాడు. "నాకు మాత్రం ఏం తెలుసు? గుళ్లో పూజారిత్వం నడుపుకునే నాకంటే, ఊర్లో మునసబు పనిచేసే నీకే బాగా తెలుస్తుంది. అయినా అంత డబ్బు పెట్టుబడి పెట్టగలవాడు ఇక్కడ ఎవడు?"

మునసబు మెల్లిగా అన్నాడు – "నా అనుమానం ప్రెసిడెంటు కావచ్చేమోనని. వారిద్దరూ చాలా కాలంగా సన్నిహితంగా ఉంటున్నారు. డాక్టర్ మీద చేతబడి ప్రయోగం నిజమే అయితే, మల్లారెడ్డి ద్వారానే జరిగి ఉండాలి. మల్లారెడ్డికి ప్రెసిడెంటు వత్తాసు ఇచ్చి ఉండాలి"

"నేను ఊహించలేను మునసబూ! ఏమయినా కావచ్చు"

"మల్లారెడ్డిని చంపింది ఎవరై ఉండవచ్చు?"

"ఆలోచించు! వాడు మంత్రగాడు. వాణ్ని చంపవలసిన అవసరం ఎవరికి ఉంది? శక్తి మాత్రమే చంపి ఉండవచ్చు. పైగా వాడు ఆ సమయంలో శక్తికొరకు ఆవాహన చేస్తున్నట్లు ఉంది కదా!"

"మనుషులెవరూ చంపలేదంటావా?"

"నన్నేమైనా అనుమానిస్తున్నావటోయ్ ఖర్మకాలి!" అన్నాడు శాస్త్రి నవ్వుతూ. మునసబు కూడా నవ్వుతూ "ప్రెసిడెంటును గురించి మీ ఉద్దేశం ఏమిటి?" అన్నాడు.

"అతని గురించి నాకంటే నీకే బాగా బాగా తెలుసు"

"మత్తుమందు రవాణాలో అతని పాత్ర ఉన్నట్లు నా అనుమానం!"

శాస్త్రి మునసబును పరీక్షగా చూశాడు. అనుమానం అంటే, తప్పకుండా రేపు పోలీసులకు చెబుతాడు. ఆవిధంగా ప్రెసిడెంటు కంఠానికి తెస్తాడు. అతడు ఇతడి కంఠానికి తేవాలని ప్రయత్నిస్తే చివరకు అటుది ఇటుగా మారుతున్నది. ప్రస్తుత పరిస్థితిలో ప్రెసిడెంటు ఇందులో ఇరుక్కోవడమంటే, తాను కూడా అందులో దూరక తప్పదు. ఇంతవరకూ తనను గురించి ఎవరికీ ఏమీ తెలియదు. ఇప్పుడు బయటపడితే తన పరువూ, మర్యాద నాశనమవుతుంది. ఏంచేయాలో ఆలోచిస్తున్నాడు.

తిరిగి అడిగాడు మునసబు "మల్లారెడ్డిని చంపించిందికూడా ప్రెసిడెంటు కావచ్చని నా అనుమానం"

"కారణం?"

"ఇద్దరూ అందులో భాగస్థులయి ఉంటారు. తాను బయటపడకుండా ఉండాలంటే అతన్ని అంతమొందించడమే మార్గంగా భావించి ఉంటాడు. చివరకు జరిగిందదే"

"నీ ఊహలు పోలీసులకు చెబితే ఈ ఊరికి నిప్పుకొరివి అంటుకుంటుంది. ఆ విధంగా నాశనం చేయొద్దు"

"మనలో మాట అంటున్నాను. పోలీసులకు ఎందుకు చెబుతాను? సరే! డాక్టర్ భార్య రమణమ్మకూడా ఆరోగ్యం బాగుండటం లేదు. ఆమెమీద కూడా చేతబడి ప్రయోగం చేసి ఉంటారని వారి అనుమానం. ఇంతకూ ఈ చేతబడి మన గ్రామాన్ని నాశనం చేయడానికి ఆవిర్భ




వించినట్లుంది. దీనికి విరుగుడులేదా ?" అన్నాడు మునసబు.

"ఒక పనిచేద్దాం! ఈ చేతబళ్ళు ఎవరు చేస్తున్నారోగానీ అందరికీ ఎసరుగా తయారవుతున్నాయి. ఇకముందు మన ఊరికి చేతబడి చేయకుండా ఉండటానికి విరుగుడు యంత్రం ఏర్పాటుచేద్దాం. పీడ విరగడవుతుంది"

"ఎంత ఖర్చవుతుంది?"

"పదివేలు కావచ్చు. గ్రామం మొత్తం మీద మనిషికో వందరూపాయలు. పెద్ద ఖర్చు కాదు. ఈవిధంగా గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకుని కాలం గడపడం కంటే అదే మేలుకదా!"

"ప్రయత్నిద్దాం" అన్నాడు మునసబు. "మీరు రేపు ఉండండి. పోలీసులు వస్తారు కదా... పెద్దలందరూ ఉండటం మంచిది. ప్రెసిడెంటుకు కూడా చెప్పండి"

శాస్త్రి తలూపాడు. మునసబు వెళ్ళిపోయాడు. మునసబు బయటకు వెళ్ళూనే కూతుర్ని కేకేసి "ప్రెసిడెంటును దేవాలయం వద్దకు రమ్మనిచెప్పు. నేను వెళుతున్నాను" అన్నాడు. కూతురు వెళ్ళిపోయింది.

బయటే నిలబడ్డ మునసబు ఈ మాటలు విన్నాడు. అర్థమయినట్లు తల పంకించి వెళ్ళిపోయాడు.




ఖండువా భుజంమీద వేసుకుని దేవాలయంవేపు సాగాడు శాస్త్రి. సాయంత్రం నాలుగుగంటలు కావస్తున్నది. రెండు రోజులుగా వర్షం లేకపోవడంతో బురద ఆరిపోయి బురద స్థానంలో గట్టి మట్టి ఉండలు తయారయ్యాయి. పొరపాటున కాలు గట్టిగావేస్తే వేళ్ళుపగిలిపోతున్నాయి.

దేవాలయం తలుపు తెరచి లోనికివెళ్ళి అరుగుమీద కూర్చున్నాడు. కొంత సేపటికి ప్రెసిడెంటు వచ్చాడు "ఏమిటి విశేషాలు?" అంటూ.

"మునసబుగాడు నిన్ను అనుమానిస్తున్నాడు" అన్నాడు శాస్త్రి గోవర్ధనం ముఖంలోనికి చూస్తూ.

అతడి ముఖం మూర్ఛరోగిలా తయారయింది.

"ఏ విధంగా?" అన్నాడు ఆతృతతో

"వాడి ఇంట్లో దొరికిన మత్తుమందు నీదేననీ;వాడూ,నువ్వూకలసి ఈవ్యాపారం చేసేవారనీ; ఇద్దరిమధ్య వ్యతిరేకతలు వచ్చి వాణ్ని నువ్వు చంపించి ఉంటావనీ అనుమానం. రమణమ్మ ఆరోగ్యం బాగా లేదట. ఆ చేతబడికూడా నువ్వే చేయించి ఉండవచ్చని కూడా వాడి అనుమానం"

ప్రెసిడెంటు ముఖం కళవళపడింది. ఈవిధంగా రావచ్చునని ఉదయంనుండి పరిణామాలు తెలుస్తున్నాయి. పదివేల రూపాయల తాకట్టు మల్లారెడ్డి విడిపించుకున్నాడన్నప్పట్నుంచి ఇన్‌స్పెక్టర్‌కు అనుమానంగానే ఉంది. ఇంకా కొంత కాలం ఆ తాకట్టు కాగితం తనదగ్గరేఉన్నా సరిపోయేది. వాడు తొందరపడి దాన్ని తీసుకుని ఊరంతా టాంటాం చేసేసరికి ఇప్పుడు తనపేరు కూడా బయటకు వచ్చింది. రెండులక్షల నగదు వాడు తెచ్చి పెట్టాడంటే ఎలాగూ నమ్మరు. వెనుక

తన హస్తముందని ఖచ్చితంగా అంచనా వేసారు. మునసబు ఆ అవకాశంకొరకే ఎదురుచూస్తున్నాడు. అతడికి ఇంతకు మించి అవకాశంరాదు.

ఆలోచిస్తున్న అతన్నిచూసి శాస్త్రి గారు "ఏమిటి?" అన్నాడు.

"అసలు మన ప్లాను ఎట్లా విఫలమయిందా అని! బుచ్చి ఏమయిందీ తెలియడంలేదు. ఈ బుచ్చి దొరికితేకానీ అన్ని విషయాలు బయటపడవు"

"అది పారిపోయినట్లుంది. ఇంతకూ ఈ బుచ్చి కావాలని వాణ్ని చంపిందా లేక శివమెక్కి నరికిందా అన్నది తేల్చాల్సిన ప్రశ్న! అది కావాలనే చంపి ఉంటే అది మునసబుకు అనుకూలంగా ఉండి ఉండాలి"

"అంతా గజిబిజిగా ఉంది. తల పగిలిపోతున్నది ఆలోచించలేక !" అన్నాడు విసుగుపడుతూ ప్రెసిడెంటు.

'నీకంటే నాకు మరీ విసుగు' అనుకున్నాడు శాస్త్రి. బయటకు మాత్రం "తొందరపడితే లాభంలేదు. ఏమాత్రం బయటపడ్డా మన మర్యాదలు పోతాయి. నలుగురిలో తలెత్తుకొని తిరగలేక చావాల్సి ఉంటుంది"

నీరెండ పడుతున్నది. ఆలోచిస్తూ హఠాత్తుగా "దేవాలయంలోని మందు ఇంకెక్కడికయినా తరలిద్దాం" అన్నాడు ప్రెసిడెంటు.

"మంచిదే! కానీ ఇప్పుడు ఎలా తరలిద్దాం? ఊరిలో పోలీసులు ఉన్నారు. మనమీద అనుమానం ఎలాగూ ఉంది గనుక, మునసబు నిఘా ఏర్పాటు చేయవచ్చు. దేవాలయంలో ఉంటుందని ఎవరూ ఊహించలేరు గనుక కొంత కాలం ఇక్కడ ఉంచడమే మేలనుకుంటున్నాను"

"ఏమో! ఇంతవరకూ వాడు మిమ్మల్ని అనుమానించలేదు. మిమ్మల్ని కూడా అనుమానిస్తే అంతా బయటపడుతుంది. పైగా వాడినుంచి వివరాలేమీ అందవు మనకు"

ఇద్దరూ మౌనంగాలేచారు. ప్రెసిడెంటు వెళ్ళిపోయాడు.

శాస్త్రి ఆలోచిస్తూ గర్భగుడి తలుపులు తెరచి అన్యమనస్కంగానే దీపారాధన చేసి, వసారాలో లైటు వేశాడు. చీకటి పడుతున్నది. ఇంటికి పోవాలని పించడం లేదు. ఇద్దరు ఎదిగిన ఆడపిల్లలు నెత్తిమీదున్నారు. వారి పెళ్ళిళ్ళు చేయాలి. ముగ్గురు కొడుకులకు అదరువు కల్పించాలి. దేవాలయం రాబడి తిండికే చాలదు. ఏవిధంగా డబ్బు సమకూర్చాలి? ప్రెసిడెంటు సలహామీద మత్తుమందు దొంగరవాణాలో భాగం పంచుకున్నాడు. ప్రెసిడెంటు మూర్ఖుడని శాస్త్రి ఇంత వరకూ ఆలోచించాడు. ఇప్పుడు ప్రెసిడెంటు తెలివి అమోఘమైందని అర్థం చేసుకున్నాడు.డబ్బుపోతేపోయింది. అతడు ఇరుక్కోవడం లేదు. మల్లారెడ్డి ఇంటిలోనూ, దేవాలయంలోనూ స్టాకు ఉంచబడింది. ఈ రెండు చోట్ల ఎక్కడ దాడి జరిగినా ప్రెసిడెంటు మర్యాదకు లోపం రాదు.అవచ్చేది మల్లారెడ్డికి,శాస్త్రికే! మల్లారెడ్డి రౌడీ! ఎన్ని అపవాదులొచ్చినా భరించగలడు. పైగా ఇప్పుడు ఎలాగూ లేడు. కానీ తాను ఉన్నాడు. దేవాలయం మీద దాడి జరిగితే తన బతుకు పగిలిపోతుంది. ఐదుగురు పిల్లలూ చిప్ప చేతికి తీసుకోవాలి. తాను జైలుకు వెళ్ళి మర్యాద పోగొట్టుకొని బతకడంకంటే చావడమే మేలు.




ఆలోచిస్తూ కూర్చున్న అతడు చుట్టూ ఏం జరుగుతున్నది కూడా చూసే స్థితిలో లేడు. వాతావరణం మేఘావృతంగా ఉంది. వర్షం పడే సూచనలు లేకున్నా ఈదురు గాలి విపరీతంగా వీస్తున్నది. రోడ్డు వెంట నడిచే జనం పలుచబడ్డారు. లేచి గుడి తలుపు వేశాడు. తాళం జేబులో వేసుకుని ఇంటికి దారిపట్టాడు.

"నాన్నా! మునసబుగారు వచ్చి వెళ్లారు" అంది కూతురు ఎదురుగా వచ్చి. శాస్త్రి పలుకలేదు. తల వంచుకుని లోపలకు వెళ్లాడు. స్నానం చేసి అన్నం ముందు కూర్చున్నాడు. కానీ తినాలని పించడం లేదు.

మునసబు దగ్గరకు వెళ్ళడమా, మానడమా? గ్రామంలో ఇప్పుడు మునసబు చేయిపైగా ఉంది. అతనికి అన్నివిషయాలూ చెప్పి శరణుకోరడమా? ఇంతవరకూ తాను ప్రెసిడెంటువైపు ఉండి మునసబును వంచించినందుకు అతడికి కోపంగా ఉండదూ? పైగా ప్రెసిడెంటు తనకు చేసిన ద్రోహం ఏమిటి? తమందరికీ పెట్టుబడి పెట్టి, వచ్చిన లాభాలు అందరికీ ఇస్తున్నాడు. అతన్ని ఆపదలో విడిచి, తనదారి తాను చూసుకోవడమా? ఏం చేయాలి? అన్నీ సమస్యలే!

మునసుబు దగ్గరికి వెళ్ళి వివరాలు తెలుసుకుందామనుకున్నాడు. టార్చిలైటు చేతికి తీసుకుని తలుపు వేసుకొమ్మని చెప్పి, మునసుబు ఇంటివైపు దారితీశాడు. ఇంటి దగ్గర మునసుబు లేడు. డాక్టరు ఇంటివద్ద ఉంటాడని తెలిసి అక్కడికి వెళ్లాడు. వసారాలో మంచం మీద మునసుబు కూర్చుని ఉన్నాడు. మరో మంచం మీద రమణమ్మ కూర్చుని ఉంది. శాస్త్రిని చూసి ఆమె లేచి కింద కూర్చుంది "రండి కూర్చోండి" అన్నాడు మునసబు.

"ఏమిటి వచ్చావట?" అన్నాడు శాస్త్రి కూర్చుంటూ.

"ఆలా వీధికి వచ్చాను. మీరున్నారే మోనని పలుకరించాను. అంతే! ప్రత్యేకంగా విశేషాలేమీలేవు" అన్నాడు నవ్వుతూ.

రమణమ్మ వైపు చూశాడు శాస్త్రి. ఆమె ముఖం పాలిపోయి ఉంది. మృత్యు ముఖంలోనికి అడుగిడేదానిలా ఉంది. 'తప్పకుండా ఆమెకు చేతబడి చేసి ఉంటారు' అనుకున్నాడు.

"చూడండి. ఈమె ఆరోగ్యం బాగుం డటం లేదు. చేతబడి లక్షణాలేమయినా ఉన్నాయేమో చూడండి" అన్నాడు మునసబు.

"చేతబడికి ప్రత్యేకంగా ఇవీ లక్షణా లని ఏమీ ఉండవు. మృత్యు ముఖంలోనికి వెళ్ళే రోగిలా సన్నబడిపోవడం, దేని మీదా ఇష్టం లేకుండా పోవడం! ఈమె పరిస్థితి చూస్తే అలాగే ఉన్నట్లుంది"

రమణమ్మ ముఖం పాలిపోతున్నది. భయంభయంగా శాస్త్రిని చూస్తూ అంది "వారంరోజులనుండీ, అంటే మా ఆయన చనిపోయినప్పటినుంచి నాకు ప్రతిరోజూ కన్పిస్తున్నాడండీ! నన్నూ రమ్మంటాడు. ఎక్కడికో తెలియదు. చేతులు పట్టుకొని లాగుతుంటాడు. ఈ భయంతో నా ప్రాణం పోతున్నది" అంది కళ్ళనీళ్లు కారుస్తూ.

"ఒకవేళ డాక్టరుగారు దెయ్యమై మిమ్మల్ని ఆవహించాడేమో?" ఆలోచిస్తూ అన్నాడు. "దెయ్యమైతేనే అలాగా లాగుతూ ఉంటుంది"

"ఏమో" అంది భయంగా.



"పోనీ, ఎవరైనా మాంత్రికుడికి చూపిస్తేనో?"

"నేనూ అదే అంటున్నాను. ఆమె ఒప్పుకోవడంలేదు. ఊరంతా గోల అవుతుందని ఆమె భయం"

"ఇటువంటి విషయాలలో దాచుకో గూడదు. 'ఇంటిగుట్టు వ్యాధిరట్టు' అన్నారు పెద్దలు. అందువల్ల బయట పడటమే మంచిది. మల్లవేములలో మంచి భూత వైద్యుడున్నాడు. రేపు పిలిపించండి. తగినవిధంగా చికిత్స చేస్తాడు" అన్నాడు శాస్త్రి.

మునసబు తలూపాడు. శాస్త్రి వెళ్ళిపోయాడు.

"ఈయన ప్రెసిడెంటు మనిషిలాగే ఉంది" అంది రమణమ్మ శాస్త్రి వెళ్తున్న వైపు చూస్తూ.

"ఎవరు ఎవరివైపైనా నష్టపోయేది వాళ్ళేకదా!"

"నిజంగా ఈ చేతబడులు జరుగుతాయా?"

"ఏమో ఎవరికి తెలుసు? చేస్తున్నారు. దాని ఫలితం ఏమిటో ఆ చేసినవారికే తెలియాలి"

"చేతబడిద్వారా మనుషులు చావడమే జరిగితే ఈ చంపుకోవాలు, నరుక్కోడాలు ఎందుకు? సులభంగా చేయొచ్చు కదా!"

మునసబు నవ్వాడు "అందుకూ కొన్ని నియమాలున్నాయి. రాత్రింపగళ్లు నిద్రాహారాలు మాని ఉపవాసాలు చేయాలట! ఇలాగే ఎన్నో నిబంధనలు వారికి ఉన్నాయి"

ఆమె మాట్లాడలేదు. చీకటిలోనికి చూస్తున్నది. ఏమీ కన్పించడం లేదు.





లోపల పొయ్యి వద్ద డాక్టరు చెల్లెలు ఏదో పని చేస్తున్నట్లు చప్పుడవుతున్నది. రాము పట్నం వెళ్లిపోయాడు చదువు కొరకు. మిగిలింది ఆడవాళ్ళిద్దరే! వారికి తోడు మునసబు ఇప్పుడు బహిరంగంగా మకాం అక్కడే వేస్తున్నాడు రాత్రిపూట!

మరునటి రోజు ఉదయం తొమ్మిది గంటలకు ఇన్‌స్పెక్టర్ జీపులో వచ్చాడు. ఆయనతో పాటు యస్.పి., డి.యస్.పి. కూడా వచ్చారు. తలుపు తెరచి ఇంటిలోనికి వెళ్ళి సరుకును తనిఖీ చేశారు. వారి అంచనా ప్రకారం మూడు లక్షల రూపాయలుంటుందనుకున్నారు. వీరు వచ్చిన విషయం తెలిసి మునసబు పరుగెత్తుకుంటూ వచ్చాడు. మునసబును పరిచయం చేశాడు ఇన్‌స్పెక్టర్!

"ఏమిటయ్యా! మీ వూరు చేతబళ్లకూ, మంత్రాలకూ, దొంగ సరుకుకూ ప్రసిద్ధిగా తయారయిందే?" అన్నాడు యస్.పి. అతన్ని చూస్తూ.

మునసబు చేతులు నలుపుకుంటూ నిలబడ్డాడు.

"ఇదేనా? ఇంకా ఊర్లో ఎక్కడయినా స్టాకు ఉందారా?"

"నాకు తెలియదు సార్! ఇదయినా నిన్న ఆ హత్య జరగడంతో బయట పడింది"

"వాణ్ని ఎవరు చంపిఉంటారంటావ్?"

మునసబు పలకలేదు.

"ఏం పలుకవు? పోనీ గ్రామంలో ఏమని జనం ఊహిస్తున్నారు?"

"ఎవరూ ఈ విషయంలో బయట పడటంలేదు సార్"

"ఏమయ్యా! పల్లెటూళ్లను గురించి నాకు చెబుతావా ఏం? చిన్న సంఘటన జరిగితే అది గోరంతను కొండంతగా వర్ణించి ఎవరు, ఏవిధంగా చేస్తారో చెప్ప

కుంటారు. ఇప్పుడూ అంతే"

మునసబు పలుకలేదు. జనం చాలా మంది వచ్చారుగానీ, దూరంగా నిలబడి చూస్తున్నారు. దగ్గరికి రావడానికి ధైర్యం చాలడంలేదు. శాస్త్రిగానీ, ప్రెసిడెంటు గానీ ఆ ప్రాంతాలకు రాలేదు. వచ్చిన కరణం చేతులు వెనుకకు కట్టుకుని ఒకవైపుగా నిలబడ్డాడు. చివరకు తాను ఒక్కడే వారికి జవాబివ్వవలసి వచ్చినందుకు తిట్టుకున్నాడు.

ఆఫీసర్లకు కాఫీ ఫలహారాలు చేయించమని ఇంటికి కబురు పంపేడు. తిరిగి హత్య జరిగిన ప్రాంతం ఆఫీసర్లు తనిఖీ చేశారు. ఇల్లు చాలా పెద్దది. పాత భవనం! గట్టిరాతితో కట్టబడింది. ఇంటిలోనే పశువులు కట్టే సేదానికి వసతి ఏర్పాటు ఉంది. వంట దొడ్డిలో చేసుకోడానికి అవకాశం ఉంది.

ప్రెసిడెంటునూ, ఊరి పెద్దలనూ పిలిపించమన్నాడు యస్.పి. అందర్నీ పంచాయితీ ఆఫీసుకి పిలిపించారు. అందరూ కుర్చీలలో కూర్చున్నారు.

"మీ ఊరిలో ఒక రౌడీ వద్ద ఇంత మత్తుమందు దొరికిందంటే నమ్మడం సాధ్యంకాదు. దీని వెనుక ఎవరయినా పెద్దల చేతులు ఉంటాయని తెలుస్తూనే ఉంది. దీనిలో భాగస్థులెవరో బయటకు వస్తే కనీసం క్షమించి విడిచిపెడతాం. భవిష్యత్తులో ఇలాంటివి చేయకుండా మాసుకోవచ్చు. చెప్పండి... ఈ గ్రామంలో ఎవరై ఉంటారు?"

పోలీసు ఉపన్యాసాలు వినీవినీ విసుగు పుట్టిన జనం వారి సాసునయభూతులకు భయపడరు... బయటపడరు. తమ మాటలు తమకే ఘనంగానీ జనానికి కాదని వారికి తెలియదు.

యస్.పి. మాటలకు ఎవరూ జవాబివ్వలేదు. ఎవరంతకు వారు తమను కాదని ఆ మాటల్ని గాలికి వదిలేశారు. తన మాటలు వారిలో కదలిక కన్పించనందుకు కొంత బాధపడ్డాడు యస్.పి. ఏ ఆధారాలు లేకుండా వారిలో ఎవరిని తీసుకెళ్లాలి? ఎవరిని తీసుకెళ్లినా వెనుక తగిన రాజకీయ బలాలు ఉంటాయి. ఇప్పుడు వీరి జుట్టు పట్టుకుంటే, రేపు పైన తమ జుట్టు పట్టుకుంటారు. పల్లెటూర్లలో పోలీసు లంటే ఇంతకు ముందు హడలెత్తేవారు. ఎర్రటోపీ కన్పిస్తేచాలు దాక్కుని బయటకే వచ్చేవారు కాదు. ఇప్పుడో...? ఎర్రటోపీ వెంటపడి వెకిలి కూతలు కూస్తుంటే టోపీ ధరించిన పెద్దమనిషి సిగ్గుతో తల వంచుకునిపోవలసిందే. అందువల్ల వారినందరినీ వినయంగా అడిగి లాభంలేదు. విడివిడిగానే సమాచారం సేకరించాలి. ఇన్‌స్పెక్టర్ సలహాతో ఆ సమావేశం రద్దుపరచి అందరినీ వెళ్ళిపొమ్మన్నారు. మునసబు ఒక్కడే మిగిలాడు.

"నాకు ప్రెసిడెంటు మీద అనుమానంగా ఉంది సార్" అన్నాడు ఇన్‌స్పెక్టరు. "వారిద్దరికీ సంబంధం ఉన్నట్లుంది. కాకుంటే ఒక్కసారిగా పదివేల రూపాయల తాకట్టు విడిపించుకోడం సాధ్యం కాదు గదా!"

యస్.పి. మునసబు వైపు చూశాడు. మునసబు జవాబు చెప్పలేదు. ప్రెసిడెంటు ఆవిధంగా భ్రష్టు పట్టడం అతడికి అవసరమే!

"సరే! అతడిని పిలిపించు" అన్నాడు యస్. పి. ఈలోగా అన్నానికి రమ్మని మునసబు ఇంటినుండి కబురు వచ్చింది. ఇక్కడికే పంపించమని మునసబు చెప్పి పంపాడు. అరగంటలో పెద్ద బుట్టలతో

తెచ్చారు. మసాలా బిరియానీ, కోడివేపుడు చూసి పోలీసుల నోళ్ళు ఊరుతున్నాయి. యస్.పి. తింటేగానీ వాళ్ళు తినడం మర్యాద కాదు. ఎప్పుడు తింటాడా అని ఎదురుచూడసాగారు.

ఈలోగా ప్రెసిడెంటు వచ్చాడు. ఆపాటికి యస్.పి. భోజనానికి కూర్చున్నాడు. బయటనున్న సిమెంటు దిమ్మె మీద కూర్చున్నాడు ప్రెసిడెంటు. అతడిని ఎవరూ పలుకరించలేదు.

యస్.పి. కర్చీఫ్‌తో చేతులు, ముఖం



తుడుచుకుంటూ ఆయాసంగా వచ్చి కుర్చీలో చేరబడ్డాడు. ప్రెసిడెంటు ముందుకు వచ్చి నమస్కారం చేశాడు. కూర్చోమని సైగచేశాడు యస్. పి.

"నీకూ, మల్లారెడ్డికీ సంబంధమేమిటి?"

"నాకేం సంబంధంలేదు సార్! ఇద్దరం ఒక కులం కూడాకాదు"

"కులం కావాల్సిన పనేముంది? వ్యాపారాల్లో భాగస్వాములు కావచ్చు కదా!" పరిశీలనగా చూస్తూ అన్నాడు. పైపీది కండువాతో ముఖం తుడుచు

కున్నాడు గోవర్ధనం!

"అతనితో నాకు ఎప్పుడూ సంబంధం లేదు"

"వాడికి పదివేలు అప్పు ఇచ్చావు గదా?"

"ఇంటిని తాకట్టుపెట్టుకొని ఇచ్చాను"

"తిరిగి డబ్బు ఇచ్చాడా?"

"ఇచ్చాడు"

"పైసాకు గతిలేనివాడు నీకు పదివేలు ఇచ్చాడంటే ఎవరూ నమ్మరు. ఆ ఇంట్లో నున్న మత్తుమందు అంతా నీదేనని రుజువు పరచే సాక్ష్యాధారాలు నాదగ్గరున్నాయి"

"నాకేం సంబంధంలేదు సార్!" అన్నాడు ప్రెసిడెంట్ వణుకుతూ. అతని కాళ్లు వణకడం చూస్తున్నాడు యస్.పి. అతని తత్తరపాటు చూసి, అతడికి సంబంధం ఉంటుందని నిర్ణయించు కున్నాడు. 'నిజానిజాలు తర్వాత! ఎవరినో ఒకరిని బొక్కలోతోస్తే సరిపోతుంది. ఆ తర్వాత అన్నీ బయటపడతాయి' అనుకున్నాడు.

"నిన్ను అరెస్ట్‌చేస్తున్నాను. నీదే ఆ సరుకు" అన్నాడు యస్.పి.

ప్రెసిడెంటు నోరెత్తి మాట్లాడడానికి పెగలలేదు. ఇన్‌స్పెక్టర్ వచ్చి రెక్క పుచ్చుకొని లేపి, గోడవారగా పక్కన కూర్చోబెట్టాడు. ఈ విషయం గ్రామంలో తొందరలోనే వ్యాపించింది. ప్రెసిడెంటును అరెస్ట్ చేశారన్న వార్త తెలుస్తూనే జనం తండోపతండాలుగా లేచి పంచాయితీ ఆఫీసుదగ్గర చేరారు. లోపలకు రాబోతు కున్న జనాన్ని పోలీసులు లాఠీలు అడ్డుపెట్టి ఆపుతున్నారు. అయినా లోపలకురావడానికి ప్రయత్నిస్తున్నారు.

యస్.పి. వసారా మెట్లదగ్గరకు వచ్చి నిలబడి చేయి పైకెత్తాడు. "ఎవడు పిచ్చి వేషాలువేసినా షూట్‌చేసిపారేస్తాను" అన్నాడు గట్టిగా.

"నీ సూటు చించిపారేస్తాంరోయ్!" అంటూ వెనుక ఎవరో అరిచారు. "ఏ ఆధారాలు లేకుండా అరెస్ట్‌చేసే అధికారం నీకులేదు. ఏ ఆధారంతో అరెస్ట్ చేశావో మాకు చెప్పాలి" అన్నారు ముందున్న వారు.

"ఇది పోలీసువ్యవహారం! ఎవరూ కలుగజేసుకోకూడదు"

"నీ నీతులు పట్టణాల్లో చూపించు. పల్లెటూళ్లలో మాట్లాడితే ఊరుదాటి పోలేవు. ఆధారాలు చూపించాలి" అంటూ అరిచారు.

యస్.పి. లోపలకు వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. మునసబును పిలిచాడు.

"ఏమయ్యా! జనాన్ని శాంతింపజేయ లేవా?"

"నేనేం చేయగలను సార్...మీచేత కాకుంటే"

"ఈ పిచ్చికుక్కల్ని బాదిపారేస్తాను. నీవే సాక్ష్యం" అన్నాడు యస్.పి. రెవిన్యూ అధికారిగా తనను సాక్ష్యం కోరుతున్నాడని మునసబుకు తెలుసు. జనాన్ని వెనక్కు మళ్లించడం తనకు మంచిదా కాదా ఆలోచిస్తున్నాడు. జనాన్ని చెల్లాచెదరుచేసి అయినా ఈరోజు కాకున్నా రేపయినా ప్రెసిడెంటును తీసుకెళ్తారు. ఆతర్వాత అతడితో తనకు వైరం! ఆ వైరం వల్ల వచ్చే పరిస్థితులేమిటి? ఆలోచిస్తున్నాడు.

ఈలోగా పోలీసులు లాఠీలతో జనం మీదపడి మోదడం ఆరంభించారు. జనం పారిపోతూ ఇళ్లు దాటు చేసుకుని రాళ్లు విసురుతున్నారు. కొన్ని రాళ్లు పోలీసులకు తగిలాయి. రెండు గంటల





నిర్విరామ పోరాటం తర్వాత ఇన్‌స్పెక్టర్ యస్.పి. వద్దకు వచ్చి "ఈరోజు వెళ్ళి మళ్ళీ అదనపు బలగాలతో రావడం మంచిదేమో సార్!" అన్నాడు. అనుభవం గల అతడి మాటలు పాటించడంమంచిదను కున్నాడు. తల ఊపాడు. ప్రెసిడెంటును బయటకు పంపించారు. వాతావరణం క్రమక్రమంగా సద్దుమణుగుతున్నది. పోలీసులకు దెబ్బలవల్లా, వెనుతగ్గడం వల్లా మంటగా ఉన్నది. కొంతమంది పోలీసులను మల్లారెడ్డి ఇంటివద్ద కాపలా పెట్టి జీప్‌లో అందరూ తిరిగి వెళ్ళారు.

మునసబు ఇంటిముఖం పట్టాడు. దారిలో గ్రామపంచాయతీబోర్డు మెంబర్లలో ఒకరయిన శేషయ్య ఎదురయ్యాడు.

"ఎందుకట్లా చేశారు మునసబుగారూ?" అన్నాడు.

"ఏమిటి ?" అన్నాడు తలెత్తి మునసబు.

"ప్రెసిడెంటును అరెస్టుచేస్తే మీకేమిటి? విడువమని గోలచేసిన మనుషులంతరూ మీ మనుషులేకదా! అతణ్ని విడిపించడం వల్ల మీకు కలిగే లాభమేమిటి?"

మునసబు చిన్నగా నవ్వి, అతడి చేతులు చేతిలోనికి తీసుకుని నలిపాడు.

"పిచ్చోడా...రాజకీయాలు అంతేమరి! ప్రెసిడెంటును ఊరి వెలుపలికి తీసుకెళ్ళి నాలుగు దెబ్బలు వాల్చుకుని విడిచి పెట్టరని నమ్మకమేమిటి? అప్పుడు రెండు విధాలా మనం భ్రష్టుపట్టవలసివస్తుంది. అతణ్ని అరెస్టు చేసినందుకు మనకు అతడితో వైరం. పోలీసులకు ధన రూపంగా లాభం. ఇప్పుడుఅట్లాకాదు. ఈ దాడిపల్లతాముదెబ్బలుతిన్నామన్న మంటతో తిరిగి పోలీసులు దాడిచేసి ప్రెసిడెంటును లాక్కుపోవడమేకాదు బలీయమైన కేసు మోపి ఇంటికి రాకుండా చేస్తారు. అందుకే శాశ్వత లాభం కొరకు మన మనుషులతోనే దాడి చేయించవలసివచ్చింది" అన్నాడు మునసబు.

ఆ ప్లానుకు, వాక్చాతుర్యానికి శేషయ్య ఆశ్చర్యపోయాడు. ఊపిరిపీల్చి విడిచి "వస్తాను"అంటూ ముందుకు సాగాడు.




రాత్రి శాస్త్రిగారి ఇంటివద్దకు వెళ్లాడు మునసబు! శాస్త్రి ఆలోచిస్తూ పడుకుని ఉన్నాడు. మునసబును చూసి లేచి కూర్చున్నాడు.

స్టూల్ లాక్కుని కూర్చుంటూ— "ఏమిటండి విశేషాలు?" అన్నాడు మునసబు.

"నువ్వే చెప్పాలి" అన్నాడు శాస్త్రి కిందినుండి పైదాకా చూస్తూ.

"ప్రెసిడెంటు సమస్య చూశారు కదా? పోలీసులు తిరిగి దాడిచేసి అతణ్ని తప్పకుండా లాక్కెళ్తారు. అతణ్ని పారిపొమ్మని చెప్పండి"

"ఈపాటికే అతడు వెళ్లిపోయాడు. సరుకు అతనిదేనని రుజువయిందా?"

"ఆ అవసరం పోలీసులకు లేదు. దొరికినా, దొరక్కపోయినా ఎవరో ఒకడు దానికి బలి కావాలి. ఆ బలి పశువుగా ప్రెసిడెంటునే ఎన్నుకున్నారు. దానికి కారణం—అతడు చేసిన కొన్ని

పొరపాట్లు కూడా తోడయ్యాయి. అకట్టు విషయం బయటికి రావడమే పొరపాటు"

"నీవు అనవసరంగా ప్రెసిడెంటుతో వైరం తెచ్చుకుంటున్నట్లుంది. దీనంతటికీ కారణం నువ్వేనని అతడి ఉద్దేశం"

మునసబుచిరునవ్వునవ్వాడు. "అతడు నాకూ చాలానే చేశాడు. మల్లారెడ్డి చేతబడి ద్వారా నన్ను చంపడానికే ప్రయత్నం. చేశాడన్న విషయం నాకు తెలుసు. కాని చివరకు అతడిద్రోహంఅతడినే తినేసింది. అతను విడిచిన పాము అతడి కాళ్లకే చుట్టుకుంది"

"మల్లారెడ్డి చేతబడి ప్రయోగం నిన్ను చంపడానికా?" ఆశ్చర్యంగా నమ్మలేనట్లు అడిగాడు. మరోవైపు 'ఇతడు ఎలా ఆ విషయం తెలుసుకున్నాడా?' అన్న ఆశ్చర్యం.

"ఔను. ఆవిషయం నాకు పూర్తిగా తెలుసు. ఎలా తెలుసోచెప్పను.కానీ ఒక్క విషయం! నాకి చేతబడులమీద నమ్మకం లేదు. అందువల్ల నేను చస్తానేమోనన్న భయంలేదు. ఇవికేవలంభ్రమలు.అయినా కొన్ని సమయాలలో వీటిని బలపరచాను; భవిష్యత్తులోనూ బలపరచవచ్చు. అది ఇతరుల తృప్తికొరకే! బుచ్చి మొగుడు నరహరి చేతబడులు చూసి విసుగుపుట్టి చివరకు వాడి పీడ వదలించాను. గుర్తుండే ఉంటుంది"

శాస్త్రి మాట్లాడలేదు. మునసబు అమాయకంగా లేడు. తమ తలల్లో దూరి పోతున్నాడు.

శాస్త్రి కూతురు మంచాలు ఆరు బయలులో వేసి దుప్పట్లు పరుస్తున్నది. ఆ అమ్మాయివైపు చూస్తూ అన్నాడు మునసబు—

"మీ విషయం నాకు తెలిసింది"

ఏమిటన్నట్లు తలెత్తి అతడివైపు చూశాడు శాస్త్రి!

"ప్రెసిడెంటుతోపాటుఅతడిపాపాలలో మీకూ భాగం ఉంది. మీ రిద్దరూ మల్లారెడ్డితో కలిసి మాదకద్రవ్యాలు అమ్మడం చేశారు. ఆ విషయాలు సాక్ష్యాధారాలతో నాకు తెలుసు"

ఆశ్చర్యంగా చూశాడు శాస్త్రి మునసబు వైపు.

"ఇప్పటికయినా మించిపోయిందిలేదు. నాకు ఎన్నిద్రోహాలు తలపెట్టినా నీమీద నాకు గౌరవం, జాలి ఉంది. అది లేకుంటే నిన్నుకూడా జైలులోపలకు తోయించే వాడినే.ఇప్పటికయినా నాకు సహకరించు"

శాస్త్రి మాట్లాడలేదు. ప్రెసిడెంటు పరారయ్యాడు. గ్రామంలో తన్ను పట్టి తన్నుతున్నా అడిగే దిక్కు లేదు. మునసబు తనమీద జాలిచూపిస్తున్నాడు. అతనిని చంపడానికి ప్రయత్నం చేసిన విషయం తెలిసీ తనమీద ఎందుకు జాలి చూపిస్తున్నాడు?

"నీ ఆధీనంలో ఇంకా నాలుగు లక్షల రూపాయల సరుకుంది. అవి ఎక్కడుందీ నాకు తెలుసు. వాటిని నా పరం చేయ గలిగితే ఇంతవరకూనువ్వు చేసినద్రోహం మరచిపోతాను"

శాస్త్రి అవాక్కయి వింటున్నాడు. మునసబు అన్నీ తెలుసుకున్నాడు. ఇప్పుడు తన ప్రాణం నిలుపుకోవాలంటే ఆ వస్తువులు ఇచ్చివేయడమే మంచిది. అదిపోతే మాత్రం తన సొమ్ము పోయేదేముంది గనుక? ఇకముందు గ్రామంలో ప్రెసిడెంటు బలం ఏమీలేదు. మునసబును ఆశ్రయించుకుని ఉండటమే మంచిది.

"నీయిష్టం మునసబూ! అన్నీ నీకు తెలుసు. నేను తెలియక కొన్ని తప్పులు




చేశాను. వాటిని క్షమించి విడిచిపెడితే జీవితాంతం నీకు సహకారిగా ఉంటాను"

మునసబు ముసిముసి నవ్వులు నవ్వాడు. లేచి ఉదయం కలుస్తానని చెప్పి బయటకు సాగాడు.

ఇంటికి చేరేసరికి కానిస్టేబుల్ ఒకరు అరుగు మీద కూర్చుని ఉన్నాడు. మునసబును చూసి లేచి నిలబడ్డాడు. ఇద్దరూ తిరిగి కూర్చున్నారు.

"యాదగిరీ! నీతో ఒక సహకారం కావాలి. ఆ సహకారం నీవు అందివ్వగల వనికూడా నాకు తెలుసు. నీ వివరాలు తెలుసుకున్నాను"

"చెప్పండి. నాకు చేతనయితే తప్పకుండా చేస్తాను" అన్నాడు కానిస్టేబుల్ యాదగిరి.

"మన ఇన్‌స్పెక్టర్‌కూ,నీకూ లాలూచీ సంబంధం ఉంది కదా?"

యాదగిరి మాట్లాడలేదు.

"మరేం భయం లేదు. నాకవసరం కాబట్టి మాట్లాడుతున్నాను. ఆయనకూ, నాకూ మధ్య స్నేహం ఏర్పడాలి.అందుకు నీ సహాయం కావాలి"

"దాన్దేముందండీ! ఆయనకు కావలసింది డబ్బు. దాని కొరకు ఎవరితోనయినా స్నేహం చేస్తాడు. ఇన్‌స్పెక్టర్ గురించి అందరికీ తెలుసు. ఏ విషయంలోనో చెప్పండి. రేపు మాట్లాడదాం"

"గంజాయి లాంటి వస్తువులు కొన్ని ఉన్నాయి. అవి పోలీసులు స్వాధీనం చేసుకోకుండా నాకు విడిచిపెట్టాలి"

యాదగిరి కళ్ళు ఎగరేశాడు."ఆయన చాలా మొత్తం అడుగుతాడు"

"ఎంత?"

"చెప్పలేం. నోరు పట్టినంత అడుగుతాడు. అయితే మాట తప్పకుండా మాఫీ చేస్తాడు"

"సరే! ఆయన వచ్చిన తర్వాతముందు నువ్వు మాట్లాడు.సరేనంటే నేను మాట్లాడతాను" అన్నాడు మునసబు.

యాదగిరి తలూపాడు.

"తాగే అలవాటుందా?" నవ్వుతూ అన్నాడు మునసబు.

యాదగిరి తల తడుముకున్నాడు. "అది లేనిదెవరికండి?"

ఇరవై రూపాయల కాగితం తీసి యాదగిరి చేతిలో పెట్టాడు. ఎర్రకాగితం చూసి సంతోషంగా మడిచి జేబులో పెట్టుకున్నాడు "వస్తానండీ! తప్పకుండా పని జరుగుతుంది" అంటూ వెళ్లాడు.

మునసబు మంచం మీద నడుం వాల్చాడు. ఆలోచిస్తూ పడుకున్నాడు. పోలీసులకు ఘల్లారెడ్డి ఇంటి వద్దకు అన్నం తట్టలో వేసి పంపించారు. తాను కూడా అన్నం తిని రమణమ్మ ఇంటికి వెళ్లాడు.

ఇతడు వెళ్లేటప్పటికి రమణమ్మ మంచంలో పడుకుని మూలుగుతున్నది. చెయ్యి పట్టి చూసి "ఎలా ఉంది?" అన్నాడు.

"నీరసంగా ఉంది" అంది. "నాకేదో భయంగా ఉంది. కళ్లు మూస్తే గుండెల మీద కూర్చున్నట్లు, చెయ్యిపట్టి లాగుతున్నట్లు ఉంది. చస్తానేమో" అంది గుడ్ల నీరు విడుస్తూ.

ఆమె తల దువ్వాడు మునసబు. "భయపడకు. రేపుగాని, ఎల్లుండిగాని మంత్రగాణ్ణి పిలిపిస్తాను. పిశాచం బాధ లేకుండా చేస్తాను.కళ్లుమూసుకుని పడుకో" అన్నాడు.

"కళ్లు మూసినట్లే ఉంది నా జీవితం. సరేగానీ రాము డబ్బు కావాలని ఉత్తరం

రాసాడు. పంపిస్తారా?" అంది చూస్తూ.

"తప్పదు కదా? పంపుతాను" అంటూ మంచం మీద పడుకున్నాడు.

"లక్ష్మి ఎక్కడికెళ్లింది?"

"లోపల ఉంది. అన్నం తింటున్నదేమో" అంది నీరసంగా.

"పాపం! ఆ పిల్లకు ఇంటి బాధ్యత ఎక్కువయింది"

"ఏం చేస్తుంది? నేను మంచంపాలు, పెళ్లి చేయవలసిన అన్న మట్టిపాలు" కన్నీరు విడుస్తూ అంది.

ఆమె ముఖంలోకి చూసి తలతిప్పుకున్నాడు మునసబు.

* * *

తెల్లవారుఝామునే పోలీసులు వ్యానులోను, లారీలోను వచ్చారు. ఊరి బయట వ్యాను, లారీ నిలిపి మునసబు ఇంటి వద్దకు వచ్చారు. మునసబు అప్పటికి రమణమ్మ ఇంటి వద్దనుండి ఇంకా రాలేదు. పాలేరును పంపి రప్పించారు. మునసబు అంతకుముందే ఎవరెవరిని అరెస్టు చేయించాలో లిస్టు రాసి ఉంచుకున్నాడు. ఆ లిస్టు ప్రకారం ఇళ్లలో ఉన్నవారిని లాక్కువచ్చి పంచాయతీ ఆఫీసు ఆవరణలో పెట్టారు. ప్రెసిడెంటు గోవర్ధనం ఇంటిలో లేడు. అతడు ఎలాగూ దొరకడని అందరికీ తెలుసు. తన మీద వచ్చిన కేసును మాఫీ చేసుకోడానికి ఏ పెద్ద రాజకీయ నాయకుని ప్రాపుకో పరుగెత్తి ఉంటాడని పోలీసులు ముందుగానే ఊహించారు.

మల్లారెడ్డి ఇంటిలోనున్న సరుకు దొరికిన వ్యక్తుల చేతనే బయటకు మోయించి లారీకి చేరవేశారు. పది టన్నుల బరువు మోసే లారీకి నిండుగా వచ్చింది సరుకు.

ఇదంతా పూర్తయేలోగా కాఫీ ఫలహారాలు మునసబు ఇంట తయారయ్యాయి. పోలీసులు తిండి మీదకి ఎగబడుతూనే సర్కిల్ దగ్గరికి మునసబును తీసుకెళ్లాడు యాదగిరి. నమస్కారం చేసి నిలబడ్డాడు.

"కూర్చోవయ్యా" అన్నాడు ఇన్‌స్పెక్టర్ మునసబును చూస్తూ. మునసబు కూర్చున్నాడు.

"ఏమిటి విశేషాలు?'' అన్నాడు క్రాస్ బెల్టు సవరించుకుంటూ. లంచాలు సరాసరి రాకుండా ప్రతి అధికారి ఒక ఏజంటును తయారు చేసుకుంటారు. ఇన్‌స్పెక్టరుకు వచ్చిన మొత్తంలో కొంత ఇతడికీ వాటా ఇస్తాడు. అదెంత కొద్ది మొత్తమైనా మహదానందమే. ఇన్‌స్పెక్టరు వస్తూనే మునసబు వ్యవహారం చెప్పాడు. ఇన్‌స్పెక్టర్‌కు ముందుగానే మునసబుమీద ఒక కన్నుంది. అతడు పైకి కన్పిస్తున్నంత అమాయకుడూ, నీతిమంతుడూ కాదనే ఆలోచించాడు. ఆ విషయం తెలిసిపోయింది. అతడితో తన వాటా రాబట్టుకోడమే ఇప్పుడు తన పని! దేశంలో వెయ్యికి తొమ్మిది వందల తొంభయి తొమ్మిదిమంది అవినీతిపరులే. ఆ మిగిలిన ఒక్క ఉద్యోగికూడా భయంతో లంచం తీసుకోడంలేదుగానీ ఇష్టంలేక కాదు. అటువంటప్పుడు తాను మాత్రం మడికట్టుకుని ఎందుకు కూర్చోవాలి ? ఎవడి స్థాయికి తగినట్లు వాడు లాగుతున్నాడు. పోలీసుకానిస్టేబుల్ రిక్షావాడి రిక్షాకు లైటులేదని రెండురూపాయలు లాగితే యస్.ఐ. చౌకధరల దుకాణాల్లో సరి అయిన తూకంలేదని వందలు లాగుతాడు. ఇలాగే తాహతునుబట్టి, అందే అవకాశాన్నిబట్టి, దాన్ని మాఫీచేసుకునే స్థాయినిబట్టి లాగుతారని ఈ పదిసంవత్స




రాల సర్వీసులో అర్థం చేసుకున్నాడతను.

"మీకేం భయంలేదండి! ఉన్నది ఉన్నట్టు చెప్పండి. అయ్యగారికి ముందుగానే మీగురించి చెప్పేశాను" అన్నాడు యాదగిరి. ఇన్‌స్పెక్టర్ కనుసైగచేస్తూనే బయటకు వెళ్ళాడతను.

"నాదగ్గర కొంతవరకు సిల్క్ ఉందండీ! దాన్ని మార్కెట్లో అమ్మేయాలనుకున్నాను. పోలీసుల సహకారం లేకుండా ఎన్నాళ్లు అమ్మగలం? మీరు దయతలిస్తే ఆ సరుకు అమ్ముకుంటాను" పళ్లు నములుతూ అన్నాడు మునసబు. గట్టిగా మాట్లాడితే ఏంవస్తుందో, లొంగుతాడో లొంగడోనన్న భయం.

"సరేలే! ఇది అన్నిచోట్లా మామూలే! ఈ మాట ఆరోజే ముందు చెప్పిఉంటే మల్లారెడ్డిగాడి ఇంటిలోనిది కూడా నీకే కక్కేటట్లు చాటుగాచేసి ఉండేవాణ్ని కదా! నువ్వేదో నీతిపరుడవని మానుకున్నాను"

మునసబు ముసిముసి నవ్వులు నవ్వాడు. "తమ పద్ధతిగురించి అప్పుడు నాకు తెలియదు కదండీ! అందువల్ల మాట్లాడలేకపోయాను"

"సరుకు ఎంత ఉంటుంది?"

"ఒక లక్షరూపాయల సరుకు ఉంది. భయంచేత అమ్మలేక అలాగే పెట్టుకున్నాను. దానికి వడ్డీ విపరీతంగా పెరిగిపోతున్నది"

"ఎక్కడ కొన్నావ్?"

"ఎవరో తెచ్చిఇచ్చారు"

వివరాలు చెప్పడని ఇన్‌స్పెక్టరుకూ తెలుసు. ఆ వివరాలతో తనకు అవసరం లేదు. వ్యభిచారిదగ్గర రెండురూపాయలు పట్టుకునే పోలీసుకు ఏ విటుడిదగ్గర ఏమి దొరుకుతుందనేనేం? అతడికి కావలసింది ఆ రెండురూపాయల నోటుగానీ!

"ఎంత ఇస్తావ్?" అన్నాడు సూటిగా చూస్తూ.

"ఏదో తమ దయ! నాకు ఇందులో అనుభవంలేక ఇరుక్కున్నాను. వదిలించుకుందామని ఆలోచిస్తున్నాను"

"యాభయివేలిస్తే నీవు అమ్ముకునే అవకాశం కల్పిస్తాను"

"అంత ఇవ్వలేనండీ! ఐదువేలుకూడా నాకు అందులో మిగలదు"

"పోనీ! నువ్వే చెప్పవయ్యా! సుద్దులతో టైంవేస్ట్ చెయ్యకు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ వాచీ చూసుకుంటూ. ఎవరయినా పోలీసు లోపలకువచ్చి వింటాడేమోనని అతడి భయం!

"పాతికవేలిస్తాను"

"తీసుకురాపో!" అన్నాడు విసుగ్గా ఇన్‌స్పెక్టర్. ఒప్పుకున్నదే చాలన్నట్లు బయటకు పరుగెత్తాడు. పాతికవేల రూపాయల నోట్లు తెచ్చిఇచ్చాడు. అందులో పదికాగితాలుతీసి పక్కనపెట్టి మిగిలింది పాంటుజేబులో కుక్కాడు. యాదగిరిని పిలిచి పదికాగితాలు ఇచ్చి "ఉంచుకోరా!" అన్నాడు.

యాదగిరి చొక్కాలోపల రహస్యంగా కుట్టించిన జేబులో దోపుకున్నాడు ఆ నోట్లు.

"నీకేం భయంలేదు. నేనీ ఏరియాలో ఉన్నంతవరకూ తెచ్చిఅమ్ముకో! అయితే మా మామూళ్లేవిటో అవి ఇస్తూ ఉండు"

మునసబు ఆనందంగా తలూపాడు. ఆ స్థాయిగల అధికారి అంగీకరించి, ఒప్పుకుంటే కిందివారు తనను ఏమీచేయలేరు. తనపని నిరాటంకంగా సాగుతుంది.

మునసబు బయటికివస్తూనే యాదగిరి వెంటపడ్డాడు — "మునసబుగారూ! మా

మీద కూడా దయచూపండి'' అంటూ.

"మీ ఇన్‌స్పెక్టర్ వెయ్యిరూపాయలు ఇచ్చాడు కదయ్యా!"

"ఆదేమూలకు సరిపోతుందండీ! ఆయనకేమో పాతిక, నాకేమో ఒకటేనా? పైగా తోటి పోలీసులకు ఇందులో భాగం ఇవ్వాలి. రేపు వాళ్లునాకివ్వరుగదా! మీరూ కొంత సహకరించండి.''

మునసబు పలుకలేదు! ఎలా వదిలించుకోవడమా అని ఆలోచిస్తున్నాడు. పై నాయకుడు ఎంత చెప్పినా కిందివాడితోనే






ఎక్కువపని ఉంటుంది. కిందివాడు ఆ పైవాడికి రిపోర్టుపంపితే, తాను వలలో పడవచ్చు. అందువల్ల వీడినీ ఆకట్టుకోక తప్పదు. జేబులో చెయ్యిపెట్టాడు. మరో పది వంద రూపాయల కాగితాలు తీసి యాదగిరి చేతిలో పెట్టాడు.

యాదగిరి సలాంచేసి "నా సహకారం మీకు ఎప్పుడూ ఉంటుంది'' అన్నాడు.

లారీ, వ్యానూ కదిలిపోయేవరకూ అక్కడే ఉన్నాడు. అవి రెండూ పరుగిడుతూనే, అరెస్ట్ చేయబడినవారి పెళ్లాం, బంధువులు మునసబు వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చారు. "మునసబుగారూ! మీరే విడిపించాలి. మొదటినుండీ మీ

మనుషులమే! వాళ్ళను చావబాదేస్తారు'' అన్నారు ఏడుస్తూ.

మునసబు వారికి ధైర్యం చెప్పాడు. ''మరేం భయంలేదు. రేపు ఉదయానికల్లా బెయిల్ ఇప్పించి రప్పిస్తాను. నిశ్చింతగా ఉండండి'' అన్నాడు. ప్రస్తుతం ఇన్‌స్పెక్టరుతో ఏర్పడిన కాంట్రాక్టు ద్వారా తనో గొప్ప వ్యక్తిగా ఆలోచిస్తున్నాడు. ప్రెసిడెంటు ఇక ఏమీ చేయలేడని అతడి ఊహ!

అక్కడినుండి ఇంటికి వచ్చాడు. ఆదెయ్యను పిలిపించాడు.

"దేవాలయంలోనే సరుకంతా వుంది. దాన్ని జాగ్రత్తగా కాపలా కాయండి. సరుకు రేపు బయటకు తీద్దాం. ఈరోజు నేను పట్నం వెళ్ళి పట్టుకెళ్ళినవారిని తీసుకొస్తాను"

ఆదెయ్య తల ఊపాడు. మునసబు అన్న కొడుకు. పల్లెలో ఆరితేరిన రౌడీ! ప్రెసిడెంటు మీదకు ఉసిగొల్పాలంటే, ముందు ఇతడినే ఉసిగొల్పుతాడు.

* * *

శాస్త్రికేమీ పాలుపోవడంలేదు. అతని గుండె కొట్టుకోవడం తీవ్రతరమవుతున్నదే గానీ మామూలు స్థితికి రావడం లేదు. ఏవిధంగా మునసబు దేవాలయంలోని సరుకు గురించి తెలుసుకున్నాడో అతడికి అర్థంకావడంలేదు. ప్రెసిడెంటు జైలుపాలవుతే, కొంత సరుకు అమ్మి డబ్బు తీసుకుని, మిగిలిన మొత్తంమీద తానే ఐచ్ఛికంగా పోలీసులకు ఇన్ఫర్మేషన్ ఇద్దామనుకున్నాడు. ఆవిధంగా తనకు కొంత డబ్బు మిగులుతుంది. ప్రెసిడెంటు దృష్టిలో సరుకు పోలీసుల స్వాధీనం అయినట్లూ ఉంటుంది. తాను కొంత కాజేశాడన్న అనుమానం అతడికి రాదు. ఈ ఆలోచనలతోనే ప్రెసిడెంటు పరారయినప్పటి నుండి ఆలోచిస్తున్నాడు. ఇంతలోనే మునసబు పిడుగులా పడి అసలు విషయం బయటపెట్టాడు. దాన్ని స్వాధీనం చేయకుంటే, తనను కూడా లోపలకు తోయించగల సత్తా మునసబుకుంది. ఆ సరుకు ఎలాగూ మునసబు కాకుంటే పోలీసులయినా ఆక్రమిస్తారు. కానీ, మునసబుకు అందించడం ద్వారా తాను మర్యాదగా బయటపడవచ్చు. అదే పోలీసులయితే, మానమర్యాదలు తీసిగానీ పోరు. నిలువనీడ ఉన్న ఈ మాన్యమూ, దేవస్థానం పోతుంది. బతికుంటే బలుసాకు తినవచ్చు—అనుకున్నాడు.

ప్రెసిడెంటు ఇప్పుడప్పుడే వస్తాడన్న నమ్మకంలేదు. అతడు బెయిల్ తీసుకుని గానీ తిరిగి గ్రామంలో అడుగుపెట్టడు. ఆపాటికి మునసబు సరుకు చేరవేసుకుంటాడు. తరువాత ఆ ఇద్దరి మధ్య ఈ ఆస్తి గురించి కీచులాటలు తప్పవు. ఇప్పటికే ఊరు ఊరులా లేదు. ఒక్కొక్కడు ఒక్కోమతా. ఇందులో ప్రెసిడెంటుగానీ, మునసబుగానీ, డాక్టరుగానీ, మరోడుకానీ మినహాయింపులో లేరు. జనాన్ని భ్రమపుచ్చి, భయపెట్టి, మోసపుచ్చడానికి, ఒకరి మీద ఒకరు భయపెట్టుకోడానికి మంత్రాలు, చేతబడులు ప్రయోగిస్తున్నారు. ఆ వాతావరణంచూసి జనం నోరెత్తలేకపోతున్నారు.

ఆలోచిస్తూ శాస్త్రి దేవాలయంవద్దకు వెళ్ళాడు. మనశ్శాంతిలేనప్పుడు అందించే సాధనం దేవాలయం ఒక్కటే! అక్కడ కూర్చుంటే ప్రశాంతమయిన ఆ వాతావరణంలో తాత్కాలికంగా బాధలు మరుగున పడతాయి. బయట వేపచెట్టు అరుగు మీదే ఆదెయ్య కూర్చుని

ఉన్నాడు. అతడి బుర్రమీసాలు ఎందుకు తళతళమంటున్నాయి. అతడితోపాటు మరో నలుగురు కర్రలు చేతపట్టుకుని అక్కడ కూర్చున్నారు. వారిని చూసి ఎందుకొచ్చి ఉంటారో గ్రహించాడు. తల వంచుకుని ద్వారం వద్దకు కదిలాడు. ఇతడిని చూసినా కూడా, పలుకరించ కుండా పేకాటలో మునిగిపోయారు వాళ్ళు.

తలుపుతీసి లోనికి అడుగుపెట్టాడు. గర్భగుడి ముందు పదినిముషాలు మౌనంగా కూర్చుని, చుట్టూ పరికించి చూశాడు. తర్వాతలేచి ఎడమవైపు ప్రహరీ వెంట ఉన్న గదుల వద్దకు వెళ్లాడు. మూడు గదులు వరుసగా ఉన్నాయి. పెళ్ళిళ్ళ సీజనులో పెళ్ళివారి విడిది కొరకు ఏర్పాటు చేయబడిన గదులవి. ఇప్పుడు పెళ్ళిళ్ళ సీజన్ కాదు గనుక, మరో ఆరునెలలు ఆ గదులు ఎవరికీ అవసరంలేదు. ప్రస్తుతం గంజాయి, నల్ల మందులకు అవి నిలయంగా నిలబడ్డాయి. అందులో ఏముందో చూడవలసిన అవసరం, తనిఖీ చేసే ఉద్దేశం ఎవరికీ లేదు. అందువల్లనే వాటిని ఆవిధంగా వాడుతున్నారు.

తాళంతీసి లోపలకు వెళ్ళాడు. జాజి చెక్క పెట్టెలు పేర్చి ఉన్నాయి. ఒక దానిపైన ఒకటిగా గదినిండా అవే! వాటిని చూసి కళ్ళ నుండి నీరుకారింది. అన్ని అవమానాలకు తలొంచడానికి సిద్ధ పడి దాన్ని అక్రమంగా ఇక్కడ పెట్టించావంటే డబ్బు కొరకే! ప్రెసిడెంటు లక్షలకొలదీ డబ్బు ఖర్చుపెట్టి, అక్ర మంగా ఇంత సరుకు తెప్పావంటే డబ్బు కొరకే! కాని, ఇప్పుడు ఇద్దరిచేతులూ దాటిపోయి దీనిమీద పైసా ఖర్చుగానీ, నిముషం శ్రమగానీ, ఏగాని ఎత్తు విలువ కానీ పోగొట్టుకోకుండా మనసుబు అధి పత్యం సంపాదించుకోవడమేకాదు, అది తరలిపోయే లోపల ఏం జరిగినా ఆ తప్పు తనమీదనే తోయడానికి సిద్ధంగా ఉన్నాడు. సరుకు తన ఆలయ ప్రాంగణంలోనే ఉంది గనుక, ఎవరయినా అధికారులు వచ్చి పట్టుకుంటే దానికి బాధ్యత తనదే కానీ మునసబుది కాదు.

కళ్ళు తుడుచుకున్నాడు. అంతా దేవుని దయ! చివరకు తాను ఈవిధంగా కావలసివచ్చింది. 'ఈ బాధపడటంకంటే అడుక్కుని తినడం శ్రేష్ఠమైనదేమో' అనుకున్నాడు.

వెనుక మనిషి వచ్చింది ఆయన చూడలేదు.

"ఏమిటయ్యా చూస్తున్నారు?" అన్నాడు ఆదెయ్య వెనుకనుండి. ఉలిక్కి పడి తల తిప్పి "ఏమీ లేదబ్బాయ్!" అన్నాడు శాస్త్రి.

"ఏం! ఓ రెండు పెట్టెలు లాగేద్దా మనుకున్నావేమిటి?"

అతని హేళన మాటలకు వంచిన తల ఎత్తలేకపోయాడు. ఆ వస్తువు తనది. తన వస్తువును గురించి తానే హేళనగా అన్పించుకోవలసిన స్థితి ఏర్పడింది.

"నాకెందుకు అవి? నేనేం చేసు కుంటాను?"

"ఏం అవసరం లేకనేనేమో ఇక్కడ దాచిపెట్టుకున్నది?" మళ్ళీ వెటకారంగా అన్నాడు ఆదెయ్య! "మూయవయ్యా... ముయ్యి! తలుపు వేసి తాళం వేయి" అన్నాడు కర్కశంగా. శాస్త్రి మారు మాటాడకుండా గదినుండి బయటకు వచ్చి తలుపులాగి, తాళం వేశాడు. ఆ తాళాలు ఆదెయ్య లాక్కున్నాడు.

"నీకెందుకు తాళాలు? మా దగ్గిరే

ఉంటాయి"

"అందులో దేవాలయం తాళాలు ఉన్నాయి బాబూ!"

"అవి తీసుకో!" అంటూ చేతికందించాడు. ప్రధానద్వారం, గర్భగుడిద్వారం తాళాలు తీసుకున్నాడు. మిగిలినవి వారికే ఇచ్చాడు. ఈ తలుపు తెరవకున్నా బాగుండేదేమో? కాని మనస్సు నిలువలేదు. చూడాలన్న ఆత్రుత తలుపు తీయించింది. చివరకు మళ్లీ చూడకుండా శాశ్వతంగా తాళాలు దూరమయ్యాయి. తన ఆధీనంలోని దేవాలయం గదుల మీదనే తనకు హక్కులేని పరిస్థితి ఏర్పడింది.

అక్కడినుంచి వచ్చి గర్భగుడి వసారాలో కూర్చున్నాడు. మిగిలినవారు బయటకు వెళ్లారు. జందెం సవరించుకుంటూ ఆలోచిస్తున్నాడు. రేపు మునసబు తనమీద ప్రతీకారం తీర్చుకోడన్న నమ్మకమేమిటి? ప్రెసిడెంటుతో కలసి తనను చంపడానికి మల్లారెడ్డి చేత, చేతబడి చేయించిన విషయం తెలుసుకున్న వ్యక్తి తనమీద దాడిచేయడానికే సిద్ధపడతాడు. ప్రస్తుతం చేయలేకపోవడానికి కారణం తనమీద అభిమానంతో కాదు. ఆ సరుకు ఆక్రమించి మూడు లక్షల రూపాయలు జేబులో వేసుకోవాలి. ఈలోగా తనమీద దాడిచేస్తే ఆ సరుకు తాను బయట పెడతాననీ, అందువల్ల చేతికందే డబ్బు దూరమవుతుందనీ ఆలోచించి తనమీదకు రావడంలేదు. ఈ ఆలోచన నిజమై ఉంటుందనుకున్నాడు. ఈ సరుకు స్వాధీనం చేసుకున్న తర్వాత తనపని పడతాడు. మునసబు మంచివాడేమీకాదు. బయటకు అతిమంచితనం చూపి తనను ప్రెసిడెంటువైపు వెళ్ళకుండా లాగ



దానికి తనతో సంబంధాలు పెట్టుకుని ఉంటాడు.

ప్రెసిడెంటుకూ, డాక్టరుకూ ఈ అక్రమ వ్యాపారంలో గతంలో సంబంధం ఉండేదనికూడా మునసబుకు తెలుసు. ఆ సంబంధం వల్లనే డాక్టర్ ఇంటికి రాకపోకలు ఎక్కువ చేసి, రమణమ్మను లొంగదీసుకోడానికి ప్రయత్నించి విఫలుడై చెప్పుదెబ్బలు తిని, చివరకు డాక్టరుతో వ్యాపారం తెంచుకున్నాడు. ఆ అదను మునసబు ఉపయోగించుకుని అందలేని డాక్టరుకు అంత ప్రకటించి చివరకు అతడి భార్యను లొంగదీసుకున్నాడు. ఇది శాస్త్రికి బాగా తెలుసు. రమణమ్మ సమస్యతో కొంత తగవు వస్తే గ్రామ నాయకత్వంలో మరికొంత తగవు మునసబు, ప్రెసిడెంటుకు! ఆవిధంగా ఒకప్పుడు ఐక్యంగా ఉన్నవారు చివరకు ఎవరి బొచ్చె వాళ్లు తీసుకున్నారు. ఈ విధంగా తయారయినా ఒకరి రహస్యాలు మరొకరు పోలీసుల వరకూ తీసుకెళ్ళలేదు. ఆవిధంగా ఇద్దరూ దెబ్బతింటారన్న భయం వారిది. పిట్టపోరు, పిట్టపోరు పిల్లి తీర్చిందన్న సామెత రాకుండా ఎవరి వ్యాపారం వారు చేసుకున్నారు.

ఆలోచిస్తున్న శాస్త్రికి ఆవరణలో అలికిడి అయితే ఉలిక్కిపడి ద్వారంవైపు చూశాడు. ప్రతి చిన్న విషయానికి, ప్రతి చిన్న శబ్దానికి భయపడవలసి వచ్చింది. ఎప్పుడు పోలీసులు వచ్చి అరెస్ట్ చేసి మానమర్యాదలు మంటగలుపుతారోనని భయం. వాళ్లు రాకముందే ఏ బావిలోనో పడి చస్తే పీడా పోతుందని కూడా అప్పుడప్పుడు అనుకుంటూనే ఉన్నాడు.

తలుపు దాటి అప్పుడే ఆవరణలో ప్రవేశించింది సీత. శాస్త్రిగారి పెద్దమ్మాయి. రజస్వల అయి మూడు సంవత్సరా

లయినా పెళ్ళిచేయలేకపోయాడు. ఇక ఈ అవకాశం ఉపయోగించుకుని చేద్దామను కున్నంతలో నెత్తిన బండలా వచ్చి ఈ పరిస్థితులు చుట్టుకున్నాయి.

"ఇక్కడే ఉన్నావా నాన్నా? ఊరిలోనే ఉన్నావేమో దీపారాధన చేసి వెళ్దామని వచ్చాను" అంది పైట సవ రించుకుంటూ. బంగారుబొమ్మలాగున్న ఆమె ముఖంవైపు చూసి తల తిప్పు కున్నాడు.

"మధ్యాహ్నమనగా వచ్చానమ్మా! సరిగా లేక ఇక్కడే ఉన్నాను" అన్నాడు శాస్త్రి. సీత ఆయన దగ్గరకు వచ్చింది. చేయిపట్టి చూసింది. ఒళ్లు వెచ్చగా ఉంది. "జ్వరం వచ్చినట్లుంది. నాన్నా!" అంది ఆత్రుతగా.

"అదే పోతుందిలే" అన్నాడు శాస్త్రి నిరాసక్తిగా.

"దీపారాధన చేసి వస్తాను. తాళం చెవులివ్వు" అంది. శాస్త్రి తాళంచెవులు ఆమె చేతికి అందించాడు. అటుఇటు తిప్పిచూసి, "రెండే ఉన్నాయేం నాన్నా? మిగిలినవి ఏవి?" అంది.

"ఇంట్లో ఉంచి వచ్చాను. వాటితో ఇప్పుడు అవసరం లేదుకదా!"

శాస్త్రి ముఖంలోనికి చూసింది సీత. అతని ముఖం మ్లానంగా ఉంది. ఏదో జరిగి ఉంటుందనుకుంది. ఎన్నోసార్లు తండ్రికి తెలియకుండా ఆ గదులు తెరచి చూసింది. అందులో పెట్టెలు చూసింది. అవి ఏమిటో తెలియకున్నా తండ్రిని అడగలేదు. వాటి తాళంచెవులు ఇందులో లేవు. అవి మధ్యాహ్నం ఆయన ఇంటి నుండి బయలుదేరేవేళ ఆయన వద్దే ఉన్నాయి. ఇప్పుడేమో ఇంటిదగ్గర పెట్టానని ఆయన అంటున్నాడు. ఇది నిజం కాదని తనకు తెలుసు. అయినా అడుగదలచుకోలేదు. మూడురోజులుగా మనిషి డీలాపడిపోయాడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటాడు. మల్లారెడ్డి చని పోయినప్పటినుండి పోలీసులు రావడం పోవడం, ప్రెసిడెంటు పారిపోవడం, కొండయ్య అరెస్ట్... ఈ వివరాలన్నీ ఆ అమ్మాయికి తెలుసు. ఇందులో ఏదైనా తండ్రి కూడా ఇరుక్కున్నాడేమోనన్న అనుమానం కూడా ఆమెకు ఉంది. అయితే ధైర్యంచేసి అడుగలేదు. తల్లి పోయి నప్పటినుండి తండ్రి దగ్గర తనకెంత చనువున్నా కొన్ని హద్దులవరకే ఉంది. ఆ హద్దులు దాటి తండ్రితో కలిసిపోలేక పోయింది.

"చీకటిపడుతున్నది. ఇంటికి వెళ్దాం పద నాన్నా!" అంది ఆమె అతడి ముఖంలోనికి చూస్తూ. శాస్త్రి కూడా లేచాడు. చీకట్లు కమ్ముకుంటున్నాయి. ఎంత ఆలోచించినా ఇంతేననుకుని నిట్టూర్చి బయటకువచ్చాడు. ఆమెకూడా బయటకువచ్చి, తలుపులాగి తాళం వేసింది. ఇద్దరూ రోడ్డు ఎక్కి గ్రామం లోనికి సాగారు. వెళ్తున్నవారిని చూస్తూ "పిల్ల మజామజాగా ఉందయ్యోయ్!" అన్నాడు ఒకడు చిటికవేస్తూ.

"దానికేంరా? తేరతిండితిని ఒళ్ళు కండలు పెంచుకుంది. దీనికి ఇప్పుడప్పుడే పెళ్లి అయ్యేట్లులేదు" అన్నాడు ఆదెయ్య ఆ దేచూస్తూ.

"దానికి పెళ్లెందుకు? నీవు తగులు కోవయ్యా! పంచదారలా ఉంటుంది" అన్నాడు మరొకడు. అందరూ పకపక నవ్వారు. ఆదెయ్య ముసిముసినవ్వులు నవ్వుకున్నాడు. కానీ చూపు మరల్చ లేదు.





# 6

మరుసటిరోజు మునసబు ఆ సరుకును స్వాధీనం చేసుకున్నాడు. అతనికి అది తేరగా వచ్చినట్లే. దానిమీద పాతికవేలు పెట్టుబడి పెట్టాడు. రెండున్నర లక్షలు రాబట్టుతున్నాడు. అతనికి ఇప్పుడు చాలా సంతోషంగా ఉంది. తన నాశనానికి పునాదులు వేస్తున్న ప్రెసిడెంటు, అతనికి అన్నివిధాలా సహకారం అందించి పైకి తనతో మంచిగా ఉంటున్న శాస్త్రిసోదిలో లేకుండా పడిపోవడమేగాక వారి ఆస్తి తనదయింది. మంత్రగాడు మల్లారెడ్డి ద్వారా, వాడి మంత్రాలతో తనను నాశనం చేయ ప్రయత్నించి అందులో వాడినే పోగొట్టుకున్నారు. అంతకుముందే బుచ్చి మొగుణ్ణి కూడా పోగొట్టుకున్నారు.

అసలు ఇద్దరికీ వచ్చిన వ్యతిరేకత సరకు అమ్ముకోవడంలోనే, భాగ పరిష్కారాల్లోనే! అంతకుముందు ఇద్దరూ కలిసే పనిచేశారు. డాక్టరు రాకతో వ్యతిరేకతలు వచ్చాయి.డాక్టరును ప్రెసిడెంటు ఆకట్టుకుని, తనలో భాగం కలుపుకుని, అంతవరకూ చలాకీగాతిరిగిన మునసబును పక్కకు తోసివేశాడు. అది మునసబుకు కంటగింపుగా తయారయింది. డాక్టరును ప్రెసిడెంటు నుండి లాగడానికి విశ్వప్రయత్నంచేసినా కుదరలేదు. ఇట్లాకాదని అతని భార్యమీద బాణం ప్రయోగించాడు మునసబు! నయానకాక భయాన బలాత్కారంగానే ఆమెను మొదట ఆక్రమించుకున్నాడు. ఆ తర్వాత మంచిగానే ఆమెతో తిరుగుతూ, ఆమెకు ఆశచూపి, తన వ్యాపారంలో భాగం కలిపాడు. క్రమక్రమంగా ఆమెద్వారా డాక్టరును ప్రెసిడెంటు ఉచ్చునుండి తప్పించి తనతో కలుపుకున్నాడు. డబ్బు ఖర్చు మునసబుదయితే దానిని తీసుకురావడం, అమ్మడం డాక్టరుదే. ఆవిధంగా పైకి మంచి డాక్టరుగా కనిపించేవ్యక్తి, లోపల అక్రమ రవాణాకు పాల్పడ్డాడు. డబ్బు పుష్కలంగా వచ్చే అవకాశాలున్నప్పుడు, బాధలు లెక్కచేయకుండా ముమ్మరంగా దిగి సంపాదించడానికే ప్రయత్నం చేస్తాడు మనిషి! డాక్టరు కూడా అదే చేశాడు. నెలకు వేలసంఖ్యలో వస్తున్న డబ్బును వదులుకోలేకపోవడమేగాక, మునసబుకు మధ్యమధ్య కొర్రుపెట్టి నష్టాలు చూపించడం అలవాటయింది.

మునసబు అది అర్థం చేసుకున్నాడు. తనను దెబ్బతీసి డబ్బులు మూటకట్టాలని ప్రయత్నం చేస్తున్నాడని అర్థం చేసుకున్న తర్వాత బుచ్చికి డబ్బుచూపి ఆకట్టుకున్నాడు. ఆవిధంగా కూడా తనకు ద్రోహం జరుగుతుందేమోనన్న భయం పీడించడంతో, మరింత పకడ్బందీగా ఉండాలని బుచ్చితో శారీరకంగాపొందు కలుపుకున్నాడు. ఆతర్వాత బుచ్చిని డాక్టరుమీదకు ప్రయోగించాడు. మంత్ర తంత్రాలమీద అంతగా నమ్మకం లేని మునసబు ఏ పుట్టలో ఏముందోనన్న ఆశతో బుచ్చిద్వారా చేతబడి చేయించి, డాక్టరును హతమార్చడానికి ప్రయత్నం చేశాడు. చివరకు డాక్టర్ ఆ కాళరాత్రి

సంజీవయ్య బావివద్దపడి ప్రాణాలు పోగొట్టుకున్నాడు. అది తన ప్రతాపమే నని బుచ్చి చెప్పింది. దానితో కొంత నమ్మకం ఏర్పడింది మునసబుకు మంత్రాలమీద. ఈ సమయంలోనే ప్రెసిడెంటు బుచ్చిని ఆహ్వానించాడు తనవేపు. బుచ్చి మొగుణ్ని సిద్దాక్షిణ్యంగా రాళ్ళతో కొట్టిపంపించాడు మునసబు. ఆ కక్ష ఆమెలో తప్పకుండా ఉంటుంది. పైగా మల్లారెడ్డి, బుచ్చి ఇద్దరుకలసి చేత బళ్లు చేస్తున్నారు. మల్లారెడ్డిద్వారా బుచ్చిని ఆకట్టుకుని మునసబుపీడ వదిలించుకుంటే గానీ బాగుపడమని ప్రెసిడెంటు, శాస్త్రిని నిర్ణయించుకున్నారు.

అయితే అప్పటికే బుచ్చి మునసబు వలలో ఉందన్న విషయం వారికి తెలియదు. తెలియకపోవడంవల్ల బుచ్చినే ఉపయోగించారు. ముందుగానే బుచ్చి ఈ వివరాలన్నీ మునసబుకు చెప్పింది. మునసబు ఆలోచించాడు. బుచ్చి తనకు ఈ విషయాలు చెబుతున్నదంటే తనమీద ఆమెకు విశ్వాసముంది. ఇక ఈ ఊరిలో తనకు వ్యతిరేకమయిన మంత్రగాడు మల్లారెడ్డి ఒక్కడే. వాడిని ఒకడినీ నాశనం చేస్తే ఈ మంత్రాలు తన జోలికి రావు. బుచ్చిద్వారా ప్రెసిడెంటునే నాశనం చేయవచ్చు.

ఈ ఆలోచనతోనే బుచ్చికి ముందే చెప్పాడు మల్లారెడ్డిని అవకాశంచూసి పూర్తిచెయ్యమని! బుచ్చి అవకాశం చూసుకుంది. చేతిలో ఉన్న ఖడ్గంతో పీరాంగం తొక్కుతూ మల్లారెడ్డిని నరికివేసింది. అవకాశం కొరకు వసారాలోనే పడుకున్న ఇద్దరు తలుపు తెరుస్తూనే లోపలకు జొరబడి మల్లారెడ్డి కాళ్లు చేతులు నరికి, మంత్రదేవతకు బలిఇచ్చి బుచ్చితోసహా పారిపోయారు. శీను వివరాలు చెబుతాడేమో నన్న భయంతో ఊరిలో లేకుండాచేసి చాలాదూరంలో ఉంచాడు ప్రెసిడెంటు. అందువల్ల ఆరోజు ఏం జరిగిందో జనం ఊహించడమేగానీ మల్లారెడ్డి ఎట్లా చంపబడ్డాడో ఎవరూ తెలుసుకోలేదు.

ఆయింటిలోనేఅంతవరకూ అక్రమసరకు పెడుతున్నారన్న విషయం మునసబుకు తెలియదు. ఈరోజు ఇంత సరుకు బయట పడిందంటే ఇంకాఉంటుందనే అనుమానం! ఆ అనుమానం శాస్త్రిమీద పడింది. ఏమీ తెలియకున్నా శాస్త్రిని బెదరించి అతని దగ్గర ఉండనిపించుకున్నాడు. శాస్త్రి పెడితే దేవస్థానంలోనే పెడతాడని తెలుసు. రాత్రి ప్రహరీ దాటి లోపలకుఎక్కి తాళాలు తెరిపించి చూశాడు. అక్కడ వస్తువు బయటపడింది. అప్పటినుండి జాగ్రత్తగా కాపలా కాస్తున్నాడు.

శాస్త్రిమీద కసిగా ఉంది మునసబుకు. తనను చంపడానికి సిద్ధపడ్డాడంటే తనమీద అతడికి ఎంత ద్వేషం ఉండాలి? ఎంతో ద్వేషం లేనిది ఒకవ్యక్తిని చంపడానికి ఎవరూ ప్రయత్నించరు. ప్రెసిడెంటూ, తనూ కలిసి తన అడ్డు తొలగించుకుంటే ఊరిలో ఇష్టారాజ్యంగా ప్రవర్తించవచ్చనుకున్నట్లుంది. ప్రెసిడెంటు ఇప్పట్లో ఎలాగూ రాలేడు. శాస్త్రిని కూడా జైలుకు తోయించాలి. ఆవిధంగా బుద్ధి చెప్పాలి అనుకున్నాడు. పోలీసులు ఇప్పుడు తనకు సహకారం చేస్తారు. తన డబ్బు తిన్నారు;తింటున్నారు కూడా!

ఆ తలపు వస్తూనే చిన్నగా నవ్వుకున్నాడు. చెక్కపెట్టెలన్నింటినీ బయట నున్న బండ్లమీదకు చేర్పించాడు. ఆ బండ్లను తోలుకెళ్లి పొలంలోని మోటారు

చిన్న గదిలో చేర్పించాడు. ఉదయమే పట్నం వెళ్ళాడు. అక్కడ ఈ అక్రమ సరుకును కొనగల వ్యక్తులూ, అమ్మగల వ్యక్తులు కూడా మునసబుకు తెలుసు. తన సరుకును వదిలించుకోడానికి బేరాలు సాగించాడు. అంత సరుకు ఒకేసారి కొనడానికి ఎవరూ ముందుకు రాలేదు. బెంగుళూరు వెళ్ళమని కొందరు సలహా ఇచ్చారు. ఆ సరుకు చాలా రోజులు తనవద్ద ఉంచుకోడానికి సిద్ధంగా లేడు. బెంగుళూరు వెళ్ళి వచ్చేటప్పటికి సమయం



గడిచిపోతుంది ఆలోగా ప్రెసిడెంటు తిరిగి వస్తే అతడితో పేచీ! సరుకు సాగకుండా అతడు కాపలాలు ఏర్పాటు చేస్తాడు. అతడు ఏ సమయంలోనైనా రావచ్చు. పరారీలో ఉన్న వ్యక్తి కోర్టుకు హాజరయి బెయిల్ తీసుకుని రావడమే! అందువల్లనే తొందరపడదలచుకున్నాడు. అతితక్కువ రేటుకు మూలరేటులో నాలుగింట మూడు పంతులకే స్థానికులకు అమ్మేశాడు. అంత కారుచౌకగా రావడంతో నలుగురు కలిసి మొత్తం సరకు తీసుకున్నారు. ఆవిధంగా ఇన్‌స్పెక్టరుకు ఇచ్చినది, తన



ఖర్చులుపోను రెండులక్షలు జేబులో వేసుకున్నాడు. ఈవిధంగా నెలకోసారి అవకాశం దొరికితే తాను కోటీశ్వరుడు కావచ్చనుకున్నాడు. సంవత్సరానికో సారయినా ఎవరూ దొరుకరని అతనికి తెలుసు.

సరుకు వ్యాపారులకు అందించి డబ్బు బాంకులో వేసుకుని మనషుల్ని ఇంటికి పంపి తాను పోలీస్ స్టేషనుకు వెళ్లాడు.

పోలీసుస్టేషన్ బయటనే కానిస్టేబుల్ యాదగిరి కన్పించి నమస్కారం చేశాడు.

"చాలా రోజులకు దయచేశారు" అన్నాడు నవ్వుతూ. అప్పటికి నాలుగు రోజులే అయిందన్న విషయం ఇద్దరికీ తెలుసు.

"పని ఉండి వచ్చాను. ఇన్‌స్పెక్టరు గారున్నారా?" అన్నాడు మునసబు.

"ఊర్లోనే ఉన్నారు. ఇంకా రాలేదు. వస్తాడు. ఏమిటి పని?"

"కొంచెం మాట్లాడాలి" అన్నాడు మునసబు నవ్వి కండువాతో ముఖం తుడుచుకుని, విదిలించి భుజంమీద వేసుకున్నాడు.

"మీలాంటివారికి కొంచెం పనిగాక పెద్దది ఎప్పుడూ ఉండదు గదా! కాఫీ తాగి వద్దాం పదండి" అన్నాడు యాదగిరి బెల్టు సరిచేసుకుంటూ.

ఇద్దరూ కాఫీ హోటల్‌కు వచ్చారు. యాదగిరి ఆర్డరిస్తుంటే మునసబు అటు ఇటు చూస్తూ కూర్చున్నాడు

"చెప్ప ్గూడని పనా?" అన్నాడు యాదగిరి

"మీకు చెప్పగూడని పనులు ఏమిటయ్యా" అని నవ్వి "మొన్న జరిగిన విషయాల గురించే మాట్లాడుదామను కున్నాను. మరో అక్రమ వ్యాపారి గురించి తెలిసింది. వాడిని పట్టిస్తే ఊరిలో నాకు అడ్డులేకుండా పోతుంది"

నవ్వాడు యాదగిరి! ఇటువంటి స్మగ్లర్లను ఎందరినో అతడు చూశాడు. పైకి మేడిపండులాగా ఉంటారు. లోపలా మేడిపండేనని అతడికి తెసులు. డబ్బు లాగాలంటే తమకు వీళ్లే నిక్షేపాలని తెలుసు.

ఇద్దరూ కావలసినంత తిని బయటకు వచ్చారు. స్టేషన్ ఆవరణలో చెట్టుకింద కూర్చున్నారు. అవీ ఇవీ మాట్లాడు కుంటూండగా ఇన్‌స్పెక్టర్ మోటార్ సైకిల్ మీద వచ్చాడు. అతన్ని చూసి లేచి నిలబడ్డారు. యాదగిరి అటెన్షన్‌లో నిలిచి శాల్యూట్ చేశాడు. వీరిని చూసి తల పంకించి లోనికి వెళ్ళాడతను.

"మునసబుగారూ! మా అబ్బాయి హాస్పటల్‌లో ఉన్నాడు. ఒక వంద రూపాయలుంటే ఇవ్వండి. తర్వాత మీకు సర్దుతాను" అన్నాడు యాదగిరి. డబ్బుల కొరకు పెళ్ళాం, పిల్లల్ని చచ్చినట్లు చెప్పగల సామర్థ్యంగలవారన్నారని మునసబుకు తెలుసు. మురికిగుంటలో పడ్డవయినా ముక్కు మూసుకుని వెతికి సంపాదించుకోవచ్చు గానీ, పోలీసులకు ఇచ్చేది తిరిగి రాదని కూడా తెలుసు. యాభైరూపాయల కాగితంతీసి ఇచ్చాడు. యాదగిరి వెళూనే మునసబు లోపలకు వెళ్లాడు. మరోసారి నమస్కరించి నిలబడ్డాడు.

"కూర్చోవయ్యా! ఎప్పుడు రావడం?" అన్నాడు ఫైల్లు చూసుకుంటూ.

"ఉదయమే వచ్చానండి! తమరు రాలేదని తెలిసి బయట కూర్చున్నాను" అన్నాడు కూర్చుంటూ. ఎదురుస్టాండులో తుపాకులు, వాటిమొనలు తళతళలాడు




తున్నాయి. గోడపైన గాంధీ మహాత్ముడి బొమ్మ బోసినోటితో నవ్వుతున్నది.

ఇన్‌స్పెక్టరు తలెత్తి "ఏమిటి విశేషాలు?" అన్నాడు.

"మీకో కేసు వివరాలు అందిద్దామని వచ్చాను" అన్నాడు మునసబు.

"ఏమిటది?" ఫైలు మూసి కండ్లు ఎగరేసి అడిగాడు. మోచెయ్యి టేబుల్‌పై మోపి అరచేతిలో గడ్డం పెట్టుకున్నాడు.

"శాస్త్రి అని దేవాలయం పూజారి ఒకడు ఉన్నాడు మావూర్లో! వాడికీ, ప్రసిడెంటుకూ వ్యాపారంలో సంబంధం ఉందని తెలిసింది. సరుకు దేవాలయంలో చాలా ఉందని తెలిసింది కూడా! ఆ విషయం మీకు తెలుపుదామని వచ్చాను" అన్నాడు మునసబు. అతని కళ్ళలోనికి దీర్ఘంగా చూశాడు ఇన్‌స్పెక్టర్. దొంగ మరో దొంగను పట్టించినట్లుంది వీరి కథ అనుకున్నాడు. ఎలాగయితే ఏం మరి కొంత డబ్బులు లాగొచ్చు అనుకున్నాడు.

"సరే! వాడి పని చూస్తాను" అన్నాడు లేస్తూ.

"ప్రెసిడెంట్ దొరికాడా?" అన్నాడు మునసబు కూడా లేస్తూ.

"లేదు. వాడెక్కడ దొరుకుతాడు? యం.యల్.ఎ. వెంటపడి వాడు అక్కడే కాపురం చేస్తున్నాడు. వాడిమీద దాడి చెయ్యాలంటే పైన మంత్రుల మద్దతు" విస్సుగా అని "వాడి సంగతి తర్వాత చూద్దాం....పద" అన్నాడు బయటకు నడుస్తూ. ఆవరణలోని వ్యానును సిద్ధం చేయమని చెప్పాడు. హెడ్‌కానిస్టేబుల్, మరో ఆరుగురు కానిస్టేబుల్స్ దాడికి సిద్ధపడుతున్నారు. తుపాకులు తీసి తుడుచుకుంటున్నారు.

మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో దేవస్థానం వద్దకు వచ్చారు పోలీసులు. తలుపు తాళం వేయబడి ఉంది. ఇంటికి పోలీసును పంపించి శాస్త్రినీ, తాళం చెవులను లాక్కొచ్చారు. తలుపులు తెరచి గదుల తలుపులు కూడా తెరిచారు. సరుకు మాత్రం ఎక్కడా కన్పించలేదు. కానీ రాలిపోయిన కొంత సరుకు నేలమీదపడి ఉంది. గదులన్నీ వాసనతో నిండి ఉన్నాయి.

శాస్త్రిని చూసి "ఏరా దొంగముండా కొడకా! గుడిలో పూజ చేసుకోక నీకెం దుకురా ఈ అక్రమ వ్యాపారం" అన్నాడు గాండ్రిస్తూ ఇన్‌స్పెక్టర్. "ఏదీ సరుకు? ఎక్కడకు తరలించావు?"

శాస్త్రి వణికిపోతూ మునసబు వైపు చూశాడు. మునసబు ఇన్‌స్పెక్టర్ వైపు చూస్తున్నాడు. జనం ఒక్కరొక్కరే వచ్చి చేరుతున్నారు. దేవాలయ ఆవరణలో మత్తుమందు దొరికిందన్న వార్త తెలియ దంతో జనం పరుగెత్తుకుంటూ వస్తున్నారు. గత పదిహేను రోజులుగా ఈ ఊరిలో హత్యలు, దెయ్యాలు, చావులు, మత్తుమందులు అన్నీ ఒకదానికొకటి బయటపడుతుంటే జనానికి ఆశ్చర్యం వేస్తున్నది. వర్షంలో పొలం పనులు చేయలేనివారికి, పనీ పాటా చేయకుండా తిరిగేవారికి వినోదంగా ఉంటున్నది.

"పలుకవేరా?" గద్దించాడు ఇన్‌స్పెక్టరు.

"నాకేం తెలియదుబాబూ!"

ఇన్‌స్పెక్టర్ గర్భగుడి ఆవరణలోకి వచ్చాడు. శాస్త్రినికూడా అక్కడకుచేర్చారు పోలీసులు. సరుకు దొరకకపోవడంవల్ల మహామంటగా ఉంది ఇన్‌స్పెక్టర్‌కు. శాస్త్రిని పట్టుకుని కేసు పెట్టవచ్చు. అందులో ఆధారం కొరకు కొంత కొట్టుకు

అప్పగించి, మిగిలింది మునసబు ముఖం మీద పారేస్తే డబ్బు ఇస్తాడు. ఆ ఉద్దేశంతోనే పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఇదంతా మునసబే స్వాహా చేశాడని, దీనిని స్వాహా చేయడానికే తనకు పాతిక వేలిచ్చా ఇచ్చాడని అతనికి తెలియదు. తన దగ్గరున్న సరుకు అమ్మకోడానికిచ్చాడని ఇంకా భ్రమపడుతున్నాడు.

పలుకని శాస్త్రిని లాఠీతో బాదాడు. బూటుకాలితో తొడమీద తన్నాడు. సరుకు దొరకని మంట అతడిలో బాగా కన్పిస్తున్నది. శాస్త్రి కూతురు సీత, చిన్నకూతురు రమ వచ్చి ఏడుస్తూ ఒక మూల నిలబడ్డారు. శాస్త్రి కొడుకులు ముగ్గురూ చదువుకుంటూ ఇతర ప్రాంతాలలో ఉంటున్నారు.

పోలీసులు మూడు గదుల్లో రాలిపోయిన మందును చేతులతో ఊడ్చి ప్లాస్టిక్ కాగితంలో పొట్లం కట్టారు. మునసబు పెట్టిన అన్నం సుష్టుగా తిని తిరుగు ప్రయాణమయ్యారు. పోతూపోతూ వెయ్యిరూపాయలు మునసబు దగ్గర పిండుకొని మరీ వెళ్లాడు ఇన్‌స్పెక్టర్.

తండ్రిని పోలీసులు వ్యానులో ఎక్కిస్తుంటే ఆడపిల్లలిద్దరూ ఏడుస్తూ వచ్చారు. పోలీసులు వారిని దూరంగా తరిమి వ్యాను కదిలించారు. జనం ఒక్కొక్కరే సాగిపోతున్నారు. ఆవరణలో కూర్చున్న మునసబు వద్దకు ఇద్దరూ వచ్చారు.

సీత ఏడుస్తూ "మా నాన్నను విడిపించేదానికి ప్రయత్నం చేయండి. ఈ విషయాలేమీ మా నాన్నకు తెలియవు" అంది.

"తెలియకుంటే ఆ రూములో సరుకు ఎక్కడిది? సరుకు ఉన్నట్లు ఆధారాలు కూడా కన్పిస్తున్నాయికదా!" అన్నాడు మునసబు సీత ముఖం చూస్తూ.

"లేదండి! ఆయనకేమీ తెలియదు. గిట్టనివాళ్లు ఎవరో ఈ పని చేశారు" అంది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ. జనం ఏ ఒకరిద్దరో తప్ప మిగిలినవాళ్లు వెళ్లిపోయారు. అంతవరకూ రణగొణధ్వనిగా నున్న దేవాలయ ప్రాంతంలో నిశ్శబ్దత ఆవరించింది.

సీత అతనికెదురుగా నిల్చుంది. పక్కన రమ కూడా స్థంభంకు ఆనుకుని గోళ్లు గిల్లుకుంటూ నిలబడింది. ఏడ్చి ఏడ్చి ఆ అమ్మాయి కళ్ళు వాచిఉన్నాయి. బుగ్గలమీద ధారగా నీటిచార కట్టింది.

మునసబు అంగరక్షకులు ఒకరిద్దరు ఆ ప్రాంతాలలోనే కూర్చుని ఉన్నారు. మునసబు లేచాడు.

"సరే! ప్రయత్నం చేద్దాం. మీరేమీ భయపడకండి" అన్నాడు ఆమె ముఖం లోనికి, ఉటికిన వక్షాల వైపు చూస్తూ. అతనిలో కోరికలు రగులుతున్నాయి. ఆశ ఊపిరి తీసుకుంటున్నది. బయటకు నడిచాడు.

తలుపు తాళం వేసింది సీత. చెల్లెలి చెయ్యిపట్టుకుని తల వంచుకుని ఇంటి వైపు నడిచింది. జనం పిల్లల గురించి చెప్పుకుంటున్నారు.

"పిల్లల గతి ఏమిటి? ఇద్దరూ ఆడపిల్లలేనాయె" అంటున్నది ఒకామె.

"ఆ! ఎవరిఖర్మకు ఎవరేంచేస్తారు. తండ్రి ఆ నిర్వాకం చేస్తాడని వాళ్లు మాత్రం అనుకుంటారా!" మరో ఆమె మెటికలు విరిచింది.

"అయినా వాడికేం పోగాలం! ఎవరో డబ్బున్న మారాజులు చేసే దొంగ వ్యాపారం కూడూ, గుడ్డాలేని ఈ జందెపు పోగోడు చేస్తే చెల్లుతుందా?





మక్కెలిరగ తన్నాల్సిందే" ఒకాయన ఈసడింపుగా అన్నాడు.

మునసబు అక్కడినుండి రమణమ్మ ఇంటివద్దకు వచ్చాడు. రమణమ్మ మంచంలో పడుకుని లేవటంలేదు.

"ఎలా ఉంది?" అన్నాడు చెయ్యి పట్టిచూస్తూ

ఆమె తల ఊపింది. "ఎవడో మంత్ర గాన్ని తెస్తామని మీరు పదిరోజులనుండీ చెబుతున్నారు. ఇంతవరకూ అతీగతీ లేదు"

"పనుల మూలంగా తిరుగవలసి వస్తున్నది. రేపు తప్పకుండా పిలిపిస్తాను. లక్ష్మి ఏది?"

"ఇంట్లో వంట చేసుకుంటున్నది. ఈమధ్య రెండు రోజులనుండీ శరీరం ముందుకూ, వెనుకకూ ఊగుతున్నది. ఆపటం సాధ్యం కావటంలేదు. ఇది దెయ్యపుచేష్టేనని అందరూ అంటున్నారు. ఆ ముండాకొడుకు బతికున్నంతవరకూ బాగుంది, చచ్చి సాధిస్తున్నాడు" విసుక్కుంది రమణమ్మ.

మునసబు నవ్వుకున్నాడు. "దెయ్యం ఎట్లా ఉంటుందో, ఏవిధంగా మనిషిని ఆవహిస్తుందో ఒక్కొక్కరు ఒక్కొ విధంగా చెప్పేవారేగాని, ఏ ఇద్దరూ ఒకే రకంగా చెప్పటంలేదు. ఆ చెప్పేవారికి కూడా ఉందన్న పూర్తి విశ్వాసం ఉంది నట్లులేదు. అందువల్లే వాటిని గురించి అభినయిస్తూ చెప్పినవారే చివర 'ఏం దెయ్యాలోనమ్మా! ఉన్నాయని మాత్రం ఏం నమ్మకం?' అంటారు. ఇది అలవాటయింది. తన శక్తిమీద తనకు నమ్మకం లేని మనిషి సృష్టించుకున్న దేవతలూ, దెయ్యాలూ, చివరకు మనిషి గుండెలమీద బండల్లా తయారయ్యాయి"

ఆలోచిస్తూ కూర్చున్నాడు మునసబు.

లక్ష్మి కాఫీ తెచ్చి ఇచ్చింది. ఆ ఇంటికి ఇక పెద్దదిక్కు అతడేనని ఆమెకు తెలుసు. మునసబు చేయి విడిచిపెడితే తమ గతి బజారుపాలేననీ, అతన్ని తన వదినె ఆకట్టుకున్నంత వరకే తానూ, తన అన్నా బాగుండగలమని లక్ష్మికి బాగా తెలుసు. అందువల్లే అతడికి గౌరవం ఇవ్వక తప్పటం లేదు. తనకే మరో విధంగా నిలబడే అవకాశం ఉంటే, తన వదిన అతడికి లొంగి ఉండటం అసహ్యించుకునేది, ఎద్దేవా చేసేది, ఇంటి నుండి తరిమి కొట్టేదే కానీ తన బతుకు ఆమె మీద, ఆమె బతుకు అతడి మీద ఆధారపడటంతో చేసేదేమీ లేదు. ఇది తలంచుకున్నప్పుడల్లా ఆమె గుండె పగిలి పోతుంది. భవిష్యత్తేమిటి? తన అన్న చదువు పూర్తయి ఉద్యోగం సంపాదించుకుంటే గానీ,తనకో దారి అంటూ ఏర్పడదు. అంతవరకూ తాను ఇక్కడ నోరు మూసుకొని పడి ఉండాల్సిందే! తన జీవితం తలచుకుంటే తనకే అసహ్యం ఏర్పడి, 'ఎందుకు చావ లేక పోతున్నా నా' అనిపిస్తుంది.

మునసబు పంచాయతీ ఆఫీసు వద్దకు వచ్చాడు. అక్కడే కూర్చొని ఉన్న మనుషులతో శాస్త్రి విషయం చెప్పాడు.

"పాపం! ఆయనను విడిపించకూడదూ ఏదో తెలియక చేసి ఉంటాడు. పెద్దవాడు" అన్నారు వాళ్ళు సానుభూతి చూపిస్తూ.

"చూద్దాం! అతడి తెలివితక్కువ అతన్నే తినేసింది. అయినా ప్రయత్నిద్దాం! కేసు బలంగా ఉంది"

చీకటి బాగా పడింది. జనం పొలాల నుండి ఇళ్ళకు చేరి పనులు చూసుకుంటున్నారు. ఎనిమిది గంటల దాకా పంచాయతీ ఆఫీసు వద్దే కూర్చున్నాడు.

•జనంపొలాలనుండి అలిసిపోయి వచ్చిన వారు భోజనాలు చేస్తున్నారు. అక్కడినుండి లేచి శాస్త్రిగారింటి వద్దకు వచ్చాడు. ప్రహరీ గేటుదాటి వసారాలోనికి వచ్చాడు. అలికిడి విని పడుకున్న సీత దిగ్గున లేచి నిలబడింది. "కూర్చోండి" అంది అతడిని చూస్తూ. మంచంమీద రమ నిద్రపోతోంది.

"అన్నం తిన్నావా?" అన్నాడు ఆమెను చూస్తూ. సీత తలూపింది. కళ్ల నీళ్లు కారుతున్నాయి. "మా నాన్నను విడిపించండి. మీకు జీవితాంతం ఋణపడి ఉంటాము. మా నాన్న లేకుండే మేము బతుకలేము" అంది విలపిస్తూ.

"చాలా డబ్బు ఖర్చవుతుంది సీతా! పోలీసుల వద్ద నుండి ఒక వ్యక్తిని బయటకు తీయాలంటే వందలు చాలవు. మరి మీ నాన్న డబ్బేమైనా దాచిపెట్టాడా? ప్రయత్నం చేద్దాం!" అన్నాడు నెమ్మదిగా. సీత తల అడ్డంగా తిప్పింది.

"ఎక్కడిదండీ ! ఆ పొలం మీద వచ్చేది ముగ్గురు పట్టణాల్లో చదవడానికి, ముగ్గురం ఇంటివద్ద తినడానికే చాలడం లేదు"

మునసబు మాట్లాడలేదు. బయటకు చూస్తున్నాడు. వీధిలైటు కాంతివంతంగా వెలుగుతున్నది. ఎండిపోయిన మట్టి గడ్డలు లైటు వెలుతురున మిలమిల మెరుస్తున్నాయి.

"ఒక పని చేద్దాం" అన్నాడు మునసబు సీతను చూస్తూ.

ఏమిటన్నట్లు సీత తల పైకెత్తి చూసింది.

"మీ నాన్నను బెయిల్ మీద తీసుకు వచ్చే భారం నాది. రేపు సాయంత్రానికే తెస్తాను. అందుకు నాకు ప్రతిఫలం కావాలి"

"మా దగ్గర ఏమున్నా ఇస్తానండీ! మా నాన్న రావడమే నాకు కావాలి"

"నువ్వు కావాలి నాకు"

మునసబు సూటి ప్రశ్నకు మాట్లాడలేకపోయింది. మునసబు ఆవిధంగా అడుగుతాడని ఆలోచించలేదు. స్త్రీకి మానం ముఖ్యం. దాన్ని అతడు కోరుతున్నాడు. వ్యతిరేకిస్తే తండ్రి గతి అధోగతి.... అంగీకరిస్తే తన గతి అధోగతి.

ఆమె మౌనం అంగీకారంగా భావించిన మునసబు లేచి ఆమె నడుంచుట్టూ చెయ్యి చాపాడు. కళ్ళనుండి ధారగా నీళ్ళు కారుతున్నా నీటినికానీ, మునసబునుకానీ ఆపలేకపోయింది. ఆపినా అతడు ఈ ఒంటరి అవకాశం విడిచిపెట్టడు. ఎలా అయితే అలాగే కానీ అనుకుంటూ నిశ్చలంగా రాయిలాగా మనస్సు గట్టిపరచుకుంది.

* * *

మరుసటి రోజు మంత్రగాడిని పిలిపించాడు మునసబు. మధ్యాహ్నం పన్నెండు గంటలకు వచ్చాడు మంత్రగాడు రాజయ్య. ఆ చుట్టుపట్ల ప్రాంతాలలో దెయ్యాలు వదలించడం లోనూ, దేవతలను కదలించడంలోనూ, పాము కాట్లతో సహా విష జ్వరాలకు కూడా మంత్రాలు, యంత్రాలు వేయడంలోనూ ఆరితేరినదిట్ట. పిల్లవాడు కింద పడ్డాడన్నా, కాలుబెణికిందన్నా అతడి మంత్రంతోనే పోవాలి. తన మంత్ర తంత్రాలు చూసి తనకే గర్వంగా ఉంటుంది. మనిషి కూడా ఆకారం అలాగే కనిపిస్తాడు. పొడువు జుట్టు ముడివేస్తాడు. ఆరంగుళాలు పెరిగిన గుబురు మీసాలు వేలాడుతుంటాయి. కాశకోక పోసి పంచ కడతాడు. చేతులకు, భుజాలకు, రొమ్మున, వీపున,

నుదుట, బుగ్గలకు కూడా విభూది,కుంకుమ, పసుపు రాస్తారు. బుగ్గన ఏమరకుండా తమలపాకులు ఉంటాయి.

వసారాలో పీట మీద కూర్చున్నాడు రాజయ్య. అతని ముందు చాప పరచి, చాప మీద రమణమ్మను కూర్చోబెట్టారు. ఆమెకు పట్టుకోక కట్టబెడితే జొన్న దంటుకు చుట్టినట్లుంది. సన్నగా తయారయిందామె! ఆమెను పరీక్షగా నఖశిఖ పర్యంతం అనేకసార్లు చూశాడు రాజయ్య. తర్వాత మునసబుతో మాట్లాడుతూ "ఈమెకు చేతబడి ప్రయోగించారండీ" అన్నాడు నెమ్మదిగా.

ఆ ప్రాంతమంతా జనం గుమికూడి ఉన్నారు. వసారా నిండా జనమే! చుట్టుపట్ల ఇండ్ల వద్ద కూర్చున్న జనం కొందరు ఈ తతంగం గురించి అవహేళనగా చర్చిస్తున్నారు.

"ముందు పీడే ఓ దెయ్యంలాగున్నాడురా" అన్నాడు ఒకతను.

"మునసబు మొనగాడేనోయ్! ఇంత వరకూ చేతబళ్లు చేయడం అయింది. ఇప్పుడు పిశాచాల్ని వదిలించే కార్యక్రమం ఆరంభించాడు"

"ఈ ఊరికి పీడే ఓ పిశాచంరా బాబూ! మరో పిశాచం ఎక్కడుంది? ఈ పిశాచం పట్టిన తర్వాతే ఆమెగారు సన్నబడిపోయింది"

ఇలా పలువురు పలురకాలుగా అనుకుంటున్నారు. ఈ సమయంలో బుచ్చి లేసందుకు కొందరు నొచ్చుకున్నారు. బుచ్చి ఉండి ఉంటే, వచ్చిన మంత్రగాడి భరతం పట్టించేది. జనానికి వినోదంగా కూడా ఉండేది.

"చేతబడి అని ఎలా చెప్పగలుగుతున్నారు?" అన్నాడు మునసబు అతన్ని చూస్తూ.

"కళ్ళు లోపలకు వెళ్లాయి. కనురెప్పలు నిముషానికోసారి అదురుతున్నాయి. కనురెప్పల కింద నల్లరంగులోనూ, పసుపురంగులోనూ చారలు పడ్డాయి. ముక్కునుండి గాలి సరిగా ప్రసారం కావడంలేదు. మూతి సన్నపడింది. శరీరం అలసటగా ఉంది. కళ్ళు తిరుగుతూ ఉంటాయి. నడవవలెనన్న కోరిక ఉన్నా నడవలేకపోవడం, ఎప్పుడూ ఏదో ఒకటితినాలన్న కోరికవున్నా తినలేకపోవడం, వెంట్రుకలు క్రమక్రమంగా రాలిపోవడం, నడుం నొప్పులు, తొడల నొప్పులు, కీళ్ల నొప్పులు, ఆయాసం, ఎగ ఊపిరి, భయం–ఇవన్నీ దాని లక్షణాలే. కనీసం వారం రోజులయింది ఈమె మీదకు చేతబడి ప్రయోగించి. అందువల్లే చాలా నీరసంగా ఉంది"

"చేతబడి చేస్తే, చేసిన వెంటనే మనిషి చనిపోతాడంటారు కదా?" సందేహంగా అడిగాడు మునసబు.

"చేతబడిలో అనేక రకాలున్నాయి. వెంటనే చంపవచ్చు. లేదా బాధ పెట్టి, అతడి బాధ చూసి ఆనందిస్తూ నిదానంగా రోజుల తరబడి చంపవచ్చు. చంపకూడదంటే శరీరాన్ని హింసించవచ్చు. లేదా ఏ కాలో, చెయ్యో, మూతో, కీళో విరిచి వేయనూవచ్చు. ఈమె మీద ప్రయోగించిన చేతబడి పదిహేనురోజులు మంచంలో పడి కుళ్ళి కుళ్ళి చచ్చే పద్ధతి" అన్నాడు రాజయ్య. మునసబు మనస్సులో బుచ్చి మెదలింది. మల్లారెడ్డి చనిపోయిన తర్వాత ఇంతవరకూ తన్ను కలవలేదు. కలవకపోవడానికి కారణం తెలియదు. రాజోలులో ఉందని మాత్రం విన్నాడు. ఒకవేళ ఆమె ప్రయోగించిఉంటుందా?

రాజయ్య చెబుతున్నాడు "చేతబడి ప్రయోగం చేసేముందు ఒకమట్టిబొమ్మను తయారుచేస్తారు. ఆ బొమ్మకు స్నానపానాదులు పూర్తి చేసిన తరువాత,పూజలు చేసి రక్తపు కూడు మధ్య నిలుపుతారు. మంత్రాలు చదివిన తర్వాత ఆ వ్యక్తిని ఎలా చేయాలనుకున్నారో ఆ బొమ్మకు చేస్తారు. ప్రయోగింపబడిన వ్యక్తి ఆ విధంగానే చస్తాడు. లేదా హింస అనుభవిస్తాడు"

"ఈమెకు రాత్రి కలలో భర్త కన్పిస్తాడట. తనతో రమ్మని పిలుస్తాడట. అతడు పిశాచమయి రావచ్చు కదా"

"రావచ్చు. కానీ ఇది పిశాచం ఆవహించడం కాదని ఖచ్చితంగా చెప్పగలను. వాటి లక్షణాలు వేరు. పిశాచం ఆవహించినవారు ఎప్పుడూ తమ శరీరాన్ని తాము హింసించుకునే స్థితిలో ఉంటారు. పూనకం వస్తుంది, మైకం వస్తుంది. ఆ పూనకం, మైకంలో ఏం చేస్తుంటారో వారికి తెలియదు. ఆ పూనకంలో పిశాచం ఆవహించి, తన ఇష్టం వచ్చినట్లు ఆ శరీరాన్ని ఆడించి, తర్వాత తాత్కాలికంగా వదలిపోతుంది. వదలిపోయినతరువాత నిర్జీవ స్థితిలో మనిషి పడిఉంటాడు.



అప్పుడు చచ్చి బతికిన మనిషితో సమానమే"

"ఇప్పుడు ఏం చేద్దామంటారు?"

"చేతబడికి విరుగుడు చేయాలి. అందుకు చాలా ఖర్చు అవుతుంది. ఈ చేతబడిని మరోవేపు మళ్ళించడమే ఆ విరుగుడు"

మునసబు నొసలు రుద్దుకున్నాడు. అటు ఇటు చూశాడు. జనం వందల సంఖ్యలో ఉన్నారు. ఆమెకూ, తనకూ ఉన్న సంబంధం అందరికీ తెలుసు. తనను ఎందరు వేళాకోళంగా మాట్లాడుతుంటారో ఊహిస్తున్నాడు. నిండా మునిగినవాడికి చలేమిటి? తనను గురించి జనానికి ఇంతకుముందే తెలుసుగనుక, ఇప్పుడు సిగ్గుపడవలసిన పనేంలేదు.

"ఎప్పుడు విరుగుడు ప్రారంభిస్తారు?"

"ఎప్పుడో అయితే ఈమె బతకడం అసంభవం! ఇప్పటికే సమయం మించింది. పదిహేను రోజులలో చచ్చేవిధంగా చేశారు. ఇప్పటికే ఏడురోజులు గడచిపోయింది. సగంరోజులు దాటితే ఇక చచ్చినట్లే లెక్క! మరో నాలుగు గంటల్లో ఆరంభిస్తాను. వస్తువులు తెప్పించే కార్యక్రమం చేయండి" అంటూ కాగితంమీద వస్తువులు లిస్టు రాశాడు.

మునసబు ఆ పట్టీ తీసుకుని ఒక మనిషిని పిలిచి, రెండు వందరూపాయల నోట్లు చేతికిచ్చి "వెంటనే రావాలి" అన్నాడు.

ఆ మనిషి సైకిల్ తీసుకొని వెళ్ళాడు. జనం పలుచబడుతున్నారు. పిశాచాల్ని విడిపించడం జనం ఇంతకు ముందు చూశారు. అప్పటిలాగే మంత్రగాడు హోం, హీం అంటూ వేపమండలు తీసుకుని ఎగురుతాడేమో తమాషా చూడవచ్చని జనం చాలామంది వచ్చారు. కానీ, ఆ తంతు ఇప్పుడు జరగడంలేదు. సరుకు వచ్చేదాకా జరిగేలాలేదని ఇళ్ళకు బయలుదేరారు.

లక్ష్మిని కాఫీ తీసుకురమ్మన్నాడు మునసబు. కాఫీ స్టౌమీద పెట్టడానికి లోపలకు వెళ్ళింది. రమణమ్మ వెంట ఉన్న ఇద్దరు మనుషులు ఎత్తి ఆమెను మంచం మీద పడుకోబెట్టారు.

రాత్రి ఏడుగంటల సమయంలో నడి ఇంటిలో ముగ్గు వేశారు. ముగ్గు మధ్య మంత్రం నీటితో తడిపిన అన్నం రాశిగా పోశారు. రాశిపైన కోడి రక్తం పోశారు. దానిపైన రెండు కందిపుల్లలు నిలిపారు. రాశికి ఒకవేపు ఆమెను కూర్చోబెట్టారు. మరోవేపు రాజయ్య కూర్చున్నాడు. ఇంటిలోనికి ఎవరినీ రానివ్వలేదు. మునసబు, లక్ష్మి, మరో నలుగురు అక్కడ ఉన్నారు. రాజయ్య మంత్రాలు చదువుతున్నాడు. అవి మంత్రాలో, తిట్లో అక్కడున్నవారికి తెలియవు. ఏదో గబగబా పదరుతున్నాడు. ఆ ప్రదేశంలో అతడి మాటలుతప్ప వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. రోగి ముఖంమీద పడేలా అగరుబత్తీలు వెలిగించారు. అప్పుడప్పుడు ఏవో మందులు నీళ్ళలోకలిపి ఆమె నెత్తిపైన విసురుతున్నాడు. రోగిముఖం కళ వళపడుతున్నది. నీరసం లోనికి జారుతున్నది. కళ్ళు మూస్తూ, తెరుస్తూ చికిలిస్తున్నది. నోరు వికృతంగాపెట్టి ఏదో అరవబోయినట్లు నోరుతెరుస్తోంది. తిరిగి మూస్తోంది. ఈ తతంగం చూస్తుండే చుట్టూ వున్న జనానికి భయంగా ఉంది. అక్కడినుండి వెళ్తే ఏమంటారోనని పోలేకపోతున్నారు.

దాదాపు గంటసేపు రాజయ్యమంత్రాల హోరు అయిన తరువాత రోగి సుషుప్తి





వస్థలోనికి జారిపోయింది. మెల్లగా నేల మీదకు ఒరిగి, సర్జీవాస్థలో పడిపోయింది. రాజయ్య లేచివచ్చి ముక్కువద్ద వేలు పెట్టి చూశాడు. సంతృప్తిగా తల ఆడించి రాశిపైనున్న రెండు కంది పుల్లలను చేతికి తీసుకున్నాడు. మధ్యకు విరిచి రాశిలో మూర్చాడు.

"ఆమెమీద ప్రయోగించిన చేతబడి కంది పుల్లల్లోనికి ఆవాహం చేశాను. ఇక భయంలేదు. ఈ అన్నం రాశిమొత్తం శ్మశానం తీసుకెళ్ళి గుంటతీసి పూడ్చి పెట్టండి" అన్నాడు రాజయ్య.

అక్కడే ఉన్న మనిషితో వెట్టివాళ్ళను పిలుచుకురమ్మన్నాడు. వెట్టివాళ్ళు అర్థ రాత్రి మంత్రగాణ్ణీ, ఆమెనూ, మునసబునూ తిట్టుకుంటూ వచ్చారు. వారికి పని పురమాయించాడు మునసబు.

మరోగంటలో ఆ ప్రాంతం కడిగి యధాప్రకారంగా చేశారు.

"తొందరలో బాగయ్యే అవకాశం ఉందా?"

"రెండురోజుల్లోనే కోలుకుంటుంది" అన్నాడు రాజయ్య. "చేతబడి చేసినవాడు ఎందుకు చేశానా అని ఏడ్వాలి చివరకు" అన్నాడు మీసాలు మెలేసి.

ఐదువందల రూపాయలు ఫీజు తీసుకుని రాత్రికి రాత్రే వెళ్ళిపోయాడు మంత్రగాడు. మిగిలినవారు కూడా వెళ్ళిపోయారు. మునసబు, లక్ష్మి అక్కడ మిగిలారు. సర్జీవావస్థలో ఉన్న రమణమ్మను మంచంమీద పడుకోబెట్టారు. ఆమె ముఖంమీదకు వంగి చూశాడు మునసబు. తలమీద విదిలించిన వస్తువులవల్ల ఏదో వాసనగా ఉంది. అక్కడినుండి పక్కకు వచ్చాడు. లక్ష్మి దగ్గరగా వచ్చి రమణమ్మ గొంతువరకూ దుప్పటికప్పింది. ఫ్యాను ఆన్‌చేసింది. చల్లటిగాలి గది అంతా ఆవరిస్తున్నది.

మునసబు లక్ష్మినే చూస్తున్నాడు. 'ఒంటరిగ స్త్రీ ఉంచే ఓర్చుకోనెలేదు మనసా' అన్న పాట అతడికి గుర్తు వస్తున్నది. 'అవును. అందాన్ని అనుభవించడమే తన ఉద్దేశం! అది ఎవరిదయినా, ఎక్కడిదయినా, ఎట్లాఉన్నా సుఖం కావాలి' అనుకున్నాడు. తన ఉప్పుతో బతుకుతున్న మనిషి లక్ష్మి! తాను లేకుంటే ఈపాటికి చిప్ప తీసుకోవాలి మరి. ఆమె శరీరాన్ని తాను కోరడంలో తప్పేమిటి? ఇది దౌర్జన్యం కాదు. వస్తువుకు ప్రతిఫలం వస్తువు. అనుకున్నాడు. లక్ష్మి ఇప్పుడిప్పుడే గట్టిపడుతున్న వంపులతో వుంది. పెళ్ళి చేయాలని ఆలోచిస్తుండగా డాక్టరు పోవడంతో ఆ ప్రయత్నాలు నిలబడ్డాయి. ఇప్పుడు తను అవసరానికి వాడుకోవడంలో తప్పులేదు.

"లక్ష్మి... ఇటురా" అన్నాడు. లక్ష్మి లోపలకు వెళ్ళబోతూ తిరిగి చూసి "ఏమిటి అన్నయ్యా" అంది.

"ఇటురా!" అన్నాడు తిరిగి. అతని దగ్గరగా వచ్చి నిలబడింది ఏమిటన్నట్లు. లేచి ఆమె నడుంచుట్టూ చేతులు బిగించాడు. ఆమె భయంగా, "అన్నయ్యా!" అంది.

"నేను నీ అన్నయ్యను కాను. నీవు కావాలి నాకు"

మునసబు మాటలు ఆమెకు భయం కలిగించాయి. ఏడుస్తూ "వద్దన్నయ్యా! నేను నీ చెల్లెల్ని. విడిచిపెట్టు" అంది.

అతడు విడువలేదు. ఏడవడం మినహా ఆమె ఏమీ చేయలేకపోయింది. బయటి నుండి ఎవరూ రారు; తలుపు వేశారు. లోపల చచ్చిపడి ఉన్న స్థితిలో రమణమ్మ

ఉంది. ఆ ఇంటిలో ఒంటరిగా ఆరోజు మరేం చేయలేక అతడికి లొంగిపోయింది. మునసబు ఆమెను ఆక్రమించుకున్నాడు. అతడి జీవితంలో ఆమె ఎన్నవదో అతడికే తెలియదు. అవకాశం దొరికితే ఎవర్నయినా అనుభవించడానికి వెను దీయడు. పలుకుబడి, డబ్బు, అధికారం అతడికి తోడయింది. పైకి అతిమంచి వాడిగా కనిపించేవాడిలో ఏం దా గి ఉంటుందో మునసబుసుచూస్తే తెలుస్తుంది.

తెల్లవారుఝామున లేచి బయటకు వెళ్లాడు మునసబు. మొదటి బస్సుకు అందాలి. కనీసం ఐదుగంటలనుడి తోవ పడితే గానీ రోడ్డుమీదకు పోలేదు.

అతడు లేచివెళ్ళిన తరువాత నగ్నంగా ఉన్న తన శరీరాన్ని చూసుకుంది లక్ష్మి! శరీరం నిండా కొరుకుడు గాట్లు, గిచ్చిన గాట్లు ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి. నూలుపోగు కూడా శరీరం మీద లేదు. తన దుస్థితిని తలుచుకుంటూ రెండు చేతులతో ముఖం కప్పుకుని ఏడుస్తూ కూర్చుంది. తన జీవితం ఇంతటితో కలుషిత వాతావరణంలోనికి నెట్టివేయ బడింది. ఇక అతడు రోజూ తనమీద అధికారం చలాయిస్తాడు. తన వదినెమీద ఎలా చలాయించాడో కళ్లతో చూసింది. ఇక తనకు పెళ్లీ పెటాకులు ఏవీ ఉండవు. అతగాడి కాళ్ల కింద పడి బతుకక తప్పదు. ఈ బతుకు బతుకడం కంటే చావే అన్నివిధాలా ఉత్తమం అనుకుంది. లేచి వదినవద్దకు వచ్చింది.తన నాశనానికి ఈమె కారకురాలుఅనుకుంది. అసహ్యంగా చూసి ముఖాన తుపుక్కున ఉమ్మి చరచరా దొడ్డివైపు వెళ్ళింది. దొడ్డి తలుపు తీసి, బావివైపు చకచక సాగి బావి గోడ ఎక్కింది.

* * *

రమణమ్మ ఉదయం ఏడుగంటలకు గానీ లేవలేదు. రాత్రంతా శారీరకంగా, మానసికంగా విసుగుపుట్టింది. ఎప్పుడు మగతలో పడిందో ఆమెకు తెలియదు. పిశాచాల పేరిట తనకు జరిగిన హింస, నలుగురిలో ఏవిధంగా తల వంచుకుని కూర్చోవలసి వచ్చిందో అనుభవమైన తరువాత గుండెల్లో బాధ పు ట్టిం ది. ఉదయం లేచేటప్పటికి బాగా నీరసంగా వుంది. ముందు తలుపు వేసి గొళ్ళెం పెట్టబడి ఉంది. దొడ్డి తలుపు తెరిచి ఉంది.

"లక్ష్మీ..." అంటూ పిలిచింది. పలుక లేదు. వంటింటిలో ఉందేమోనని రెండు మూడుసార్లు పిలిచింది. జవాబులేదు. ఆశ్చర్యంగా లేచి కూర్చుంది. ఎక్కడికి వెళ్లి ఉంటుంది? ముందు తలుపు లోపల నుండి వేసుందంటే లోపలే ఉండాలి! లోపల ఉంటే ఎందుకు పలుకదు? చిన్నగా మంచందిగి నిలబడింది. చాలా నీరసంగా ఉంది. నడిచే ఓపికలేదు. అయినా గోడ పట్టుకుని చిన్నగా వంటింటి లోనికి సాగింది. వంటింటిలో ఎవరూ లేరు. కనీసం వంటచేస్తున్నట్లు కూడా కన్పించలేదు. విసుగ్గా దొడ్డిలోనికివెళ్ళింది. అక్కడా లేదు. బావివద్దనున్న బకెట్టుతో నీళ్ళు ఎప్పుడో చేదినట్లు, తడి ఆరి పోయింది. ఏమయిపోయిందా అన్న ఆశ్చర్యంతో తిరిగి లోనికి వచ్చి లక్ష్మి మంచం వద్ద నిలబడింది. లక్ష్మి లంగా, ఓణీ, జాకెట్ మంచంమీద పడిఉన్నాయి. మంచంమీద అలా విడిచిన గుడ్డలు కూడా వేయదు లక్ష్మి. ఆ గుడ్డలు నిన్న సాయంత్రం స్నానంచేసి వేసుకున్నవి. తెల్లారకముందేవిడిచి అక్కడ పడవేయడ




మేమిటి?

ఆమె గుండెలు అదురుతున్నాయి. అనుమానంగా అటూ ఇటూ చూసి తలుపువైపు సాగింది. తలుపు తీసి వసారా లోనికి వచ్చి "పిన్నీ... పిన్నీ" అంటూ పిలిచింది.

పక్కింటావిడ అక్కడికి వచ్చింది. "ఇంకా నిద్రపోతున్నారనుకున్నాం రమణమ్మా... ఎలాఉంది ఒంట్లో" అంది ఆమె.

"నీరసంగా ఉంది పిన్నీ! లక్ష్మి ఏమైనా కన్పించిందా?"

"లక్ష్మా? ఉదయం నుండీ తలుపు తీయకుండా ఉంటే ఇంకా నిద్రపోతున్నా రనుకున్నామే? రోజు తెల్లారగట్ల లేచి కళ్లాపిచల్లే లక్ష్మి కూడా రాత్రి పొద్దు పోయేవరకు మేలుకున్నారు గనుక నిద్రలో ఉన్నారనుకున్నాం. తలుపు కూడా తీయలేదే! ఎక్కడికెళ్ళుంటుం దబ్బా?"అంది తులశమ్మ ఆశ్చర్యంగా.

గుడ్డల విషయం చెప్పి "నాకు అనుమానంగా ఉంది పిన్నీ" అంది ఏడ్పుకంఠంతో. తులశమ్మ ఆశ్చర్యంగా కొడుకును పిలిచింది. ఈ మాటలకు మరి నలుగురైదుగురు తోడయ్యారు. అందరూ బావి వద్దకు చేరారు. ఏమీ కన్పించలేదు. అయినాఅనుమానం ఉందిగనుక, వెదురగడ తెచ్చిబావిలోనికి దించి చుట్టూ తిప్పారు. అడుగున ఏదో తగులుతున్నట్లు ఉంది. ఆ విషయమే చెప్పాడు తులశమ్మ కొడుకు నారాయణ!

రమణమ్మ కండ్లనుండి నీళ్లు కారు తున్నాయి. ఈ వార్త గ్రామం పాకి పోయింది. జనం వస్తున్నారు. ముగ్గురు యువకులు బావిలోనికి తాడు విడిచి లోపలకు దిగారు. నీళ్ళలో మునిగి లక్ష్మి శరీరాన్ని పైకి తేల్చారు. తాడు కట్టి పైకి లాగమన్నారు. వాళ్ళు కూడా పైకి ఎక్కారు. లక్ష్మి మృతదేహం చూసి రమణమ్మ కుప్పలా కూలిపోయింది. ఆమెను తీసుకొనివెళ్ళి మంచంలో పడేశారు. శవాన్ని వసారాలోనికి తెచ్చి చాపమీద పడుకోబెట్టారు. శవాన్ని చూడ టానికి జనం మూగుతున్నారు. జనాన్ని రాకుండా దూరంగా నిలిపి శరీరాన్ని పరీక్షగా చూశారు. అక్కడక్కడ గాట్లు కన్పిస్తున్నాయి. అవి చేపల గాట్లు అనుకునేదానికి ఆధారంలేదు. బావిలో ఎన్ని చేపలుంటాయి? మనిషి గాట్లుగానే వాళ్ళు భావించారు. ఆమె చెరచబడి ఉండ వచ్చని వాళ్ళకు అనుమానం వచ్చింది. ఆ పనికి దిగదలచుకుంటే మునసబుకే ఆ అవకాశం ఉందని వారికి తెలుసు! యువకులు కొందరు కూడి ఏదయితే అదవుతుంది పోలీసు రిపోర్టు ఇవ్వాలని నిర్ణయించుకున్నారు. మునసబు కొరకు ఎంక్వయిరీ చేస్తే లేడని తెలిసింది. కరణం ద్వారా రిపోర్టు రాయించి పంపించారు. ఆమె అన్నకు కర్నూలుకు ఫోన్ చేసి పరిస్థితి తెల్పి వెంటనే రమ్మని తెల్పారు.

"ఇది మునసబు పనే! ఆ ఇంట్లోకి అతడు తప్ప మరెవరూ వెళ్ళరు. పైగా రాత్రంతా అతడే ఈ ఇంట్లో ఉన్నాడు. తెల్లవారుజామున ఎప్పుడో వెళ్ళుంటాడు". అన్నాడు నారాయణ.

"మునసబు పనేనని తెలుస్తూనే ఉంది. అయితే అతడే బావిలో వేశాడా, ఆ అమ్మాయి పడిందా మనకు తెలియడం లేదు" అన్నాడు సిద్దయ్య. అతడు ఈమధ్యనే బి.ఏ.చదివి ఉద్యోగం దొరకక ఊళ్లోనే ఉంటున్నాడు.

"వాడు తోస్తేనేం, ఆ పిల్ల పడి చస్తే



ఏం? దాని మానం నాశనం చేసిన తరవాత ఎలాగయినా ఒకటే కదా! ఈ ఉసురు వాడికే తగలాలి" అంది తులశమ్మ అక్కసుగా.

"మునసబు నిర్వాకం అందరికీ తెలుసు. గ్రామంలో చేతబడి పేరుతో జనాల్ని బెదరించి లొంగించుకుని వారిష్టం వచ్చినట్లు చేస్తున్నారు. ఈరోజు ఈ పాప, రేపు మన పాప కాదని నమ్మకమేమిటి? ఏడి అంతు తేల్చుకోవాలి" అన్నాడు నరసయ్య పిడికిలి బిగించి.

"చేతబళ్లేమిట్రా వెధవాయిల్లారా! అవన్నీ మన భ్రమలురా! మనిషి క్షణం క్షణం వైజ్ఞానికంగా పెరిగిపోతున్న ఈ ప్రపంచంలో చేతబళ్లు, పిశాచాలు అనే మూఢబుద్ధులేమిట్రా? పిశాచాలంటే ఎవరు? మన మునసబే! ఈ అమ్మాయిని చెరచి చంపినవాడు పిశాచంగాక మరేమిటి? పిశాచాలు మానవుని శరీరంలోనే దాగి ఉన్నాయి" అన్నాడు సిద్దయ్య. వాతావరణం ఉద్రిక్తంగా ఉంది. జనంలో అంతర్గతంగా దాగిన ఆవేశాలు ఇప్పుడు పెరుగుతున్నాయి. మునసబును చూసి భయపడ్డ ఊరిలో కొందరు ఎదిరించి మాట్లాడగలుగుతున్నారు.

రమణమ్మలో చైతన్యం వచ్చిన తరువాత లేచి వచ్చి శవం ముందు కూర్చుని విలపిస్తున్నది. "దీనంతటికీ కారణం నువ్వే రమణమ్మా!" అంది తులశమ్మ. రమణమ్మ గోడకు తల కొట్టుకుంటూ "నిజం పిన్నీ! వాడు మా పాలిట కర్కోటకుడు. నరరూప పిశాచంగా తయారవుతాడనుకోలేదు. మా కుటుంబాన్ని నిలువునా నాశనం చేశాడు. వాడి పీనుగ ఎప్పుడు నేలన రాలుతుందో" అంటూ ఏడుస్తున్నది రమణమ్మ. తల పగిలిపోతుందన్న భయంతో ఇద్దరు ఆడవాళ్ళు ఆమె తల పట్టుకున్నారు.

పోలీసులకంటే ముందు లక్ష్మి అన్న రాము వచ్చాడు. పరిస్థితి కళ్లతో చూసి, శవంమీద పడి వల వల ఏడ్చాడు. చాలామంది ఆ దుర్భర పరిస్థితి చూడలేక కళ్ళకు గుడ్డలు అడ్డు పెట్టుకున్నారు. అతన్ని పక్కకు లాగారు.

"ఏం జరిగింది అసలు?" అన్నాడు రాము సముదాయించుకుంటూ. ఏం జరిగిందో ఊహించి చెప్పాడు నారాయణ. "అయినా పోలీసులు వస్తే అన్నీ బయట పడతాయి"

మరోగంటలో పోలీసులు వచ్చారు. వాగు వరకూ బస్సులో వచ్చి అక్కడి నుండి నడిచి వచ్చేసరికి ఆ సమయమయింది. వచ్చి వివరాలు రాసుకున్నారు. పీనుగను తీయడం తప్పన్నారు. వివరాలన్నీ సేకరించి, పీనుగను బాడుగ బండి కట్టించి పోస్టుమార్టంకు ఆళ్ళగడ్డకు తీసుకుపోయారు.

సాయంత్రం ఐదుగంటలకు మునసబు వచ్చాడు. ఇంటికి రాకముందే దేవాలయం వద్దే సీత ఎదురయి చెప్పింది మునసబుతో. "మా నాన్న విషయం ఏంచేశావు?" అంది.

"తొందరలోనే ఇంటికి వస్తాడు" అన్నాడు. నిజానికి ఆ విషయం గురించి ఇంతవరకూ ఏమీ విచారించలేదు. వాడుకోవడానికి ఆమెకేదో చెప్పి లొంగించుకున్నాడు. శాస్త్రి బయటకు వస్తే తనకే ప్రమాదమని మునసబుకు తెలుసు. సీత మాత్రం అమాయకంగా నమ్మింది అతన్ని.

త్వరత్వరగా ఇంటివైపు సాగిపోతున్న మునసబును సీత వెనుక నుండి చూస్తూ 'పిదు నన్నూ నాశనం చేశాడు. ఆ పిల్ల




తెగించింది. నేను తెగింపు చేయలేనిదాన్ని' అనుకుంది. కారుతున్న కన్నీటిని తుడుచుకుని దేవాలయంలోనికి కదిలింది.

మునసబును బజారులో యువకులు నిలేశారు. జరిగింది చెప్పి "ఆరాత్రి నీవు ఆ ఇంటిలోనే ఉన్నావు. నీవు తప్ప మరొకడు చేసి ఉండడు" అన్నాడు సిద్దయ్య.

మునసబు మండిపడ్డాడు. "కండ్లు మూసుకుని మాట్లాడకండి. ఎవరు చేశారో, ఎట్లా జరిగిందో రుజువు కాకుండా బజార్లో నిలబెట్టి మాట్లాడితే తోలు ఒలిచేస్తాను" అన్నాడు ఆగ్రహంగా.

"నీ తోలు వలిపింపులకు ఎవడూ జడవడోయ్ మునసబూ! నీ పిశాచపు చేష్టలు నీ కంఠానికే తగులుకుంటాయి. అమాయకుల్ని బెదిరించినట్లు మమ్మల్ని బెదిరిస్తే నిన్ను తొక్కేది నీ పిశాచాల దగ్గరికే" అంటూ మీదకొచ్చాడు నారాయణ.

పరిస్థితి మారిందనుకున్నాడు మునసబు. పెద్దలు వచ్చి సర్ది పంపించారు. మునసబు వెళ్ళిన తరువాత "అదేదో రిపోర్టు రానివ్వండి. తొందర పడతారెందుకు?" అన్నారు.

"తొందరేముంది? వీడి స్మగ్లింగ్ అంతా జనానికి తెలియక కాదు ఊరకున్నది? వాడి బతుకు వాడు బతక నిమ్మనుకున్నాము. వాడి పిశాచాలు, చేతబళ్లు, మంత్రమందులు...వాడి చావేదో చావక ఆడపిల్లల్ని కూడా చెరపడం జరిగితే, ఈరోజు వారికయింది రేపు మీకు కాదని నమ్మకమే లేదు" అన్నాడు సిద్దయ్య.

పెద్దలు మాట్లాడలేదు.

మునసబు తన ఇంటివద్దకు వెళ్ళాడు. భార్య చూసి కూడా పలకరించలేదు. ముభావంగా నీళ్ళు తెచ్చి అందించింది.

"ఊర్లో ఏమిటి పరిస్థితి" అన్నాడు ఇంట్లోనికి వస్తూ.

"ఏముంది? చివరకు బలిపశువును నేనవుతున్నాను"

"ఎవరేమన్నారు నిన్ను చెప్పు. వాడి తోలు వలుస్తాను"

"ఎందుకూ? నా తోలే వలిచేయండి. మీరు ముండల మురాకోరులని పెళ్లి కాక ముందే తెలిసింది. మావాళ్లు నన్ను మీ మెడకు కట్టారనుకున్నాను. నా మెడకే మీరు తగులుకున్నారు. రోజుకొక ఆడపిల్లను ఊరిలో అడ్డులేదని చెరచివేయడమేనా? మనిషై పుట్టిన తర్వాత కనీస ఇంగిత జ్ఞానం లేకపోతే ఎలా?"

ఆమె చీదరింపు మాటలకు మరో స్థితిలో అయితే మీదపడి బాదేవాడే! కాని ప్రస్తుతం ఆ స్థితిలో లేడు. జనం ఏమనుకుంటున్నారో చూచాయగా తెలిసింది. పూర్తిగా తెలియడంలేదు. చెంబు అక్కడ పెట్టి తిరిగి రమణమ్మ ఇంటి వద్దకు సాగాడు. భార్య వెనుకనుండి తుపుక్కున ఉమ్మి తలపట్టుకుని కూర్చుంది.

రమణమ్మ ఇంటి ముందుకు వచ్చేసరికి రాము వసారాలో మంచంలో పడుకున్నాడు. రమణమ్మ లోపల మంచంలో పడుకుని ఉంది. ఆమె మంచం దగ్గరకు వెళ్ళి లేపాడు. తల తిప్పి చూసి శివంగిలా చర్రున పైకి లేచింది. ఆమెలో ఉన్న నీరసం ఏమయిందో ఆమెకే తెలియదు. అతని మెడ కరచుకొని కంఠం పిసికింది. ఆమె చేతులు పక్కకు తోసి ఆమెను మంచంలోనికి తోశాడు.

"వెళ్ళు! నీ మొఖం నాకు చూపించకు. బంగారంలాంటి నా బిడ్డ బతుకు నాశనం

ఛీ! నీలాంటి నీచుని ముఖం చూడాలన్నా నాకు అసహ్యంగా ఉంది" అంది తుప్పున ముఖంమీద ఊస్తూ.

అలికిడికి జనం పోగయ్యారు. రాము వచ్చి మునసబు దగ్గరకు వచ్చాడు. అతనిపై కలబడపోయేంతలో జనం వచ్చి పక్కకు లాగారు. రాము బూతులు కూయడం ఆరంభించాడు. అంతమందిలో మునసబుకు తల కొట్టేసినట్లయింది. అక్కడికి [illegible]కున్నా బాగుండేదేమోననుకున్నాడు. [illegible]ణమ్మ తనను అనుమానపడదని ఆలోచించాడు. అక్కడ చేరిన జనంలో మునసబును తిట్టేవాళ్లు, విమర్శించేవాళ్లు, సమర్థించేవాళ్ళూ ఉన్నారు.

మునసబు ఏమీ మాట్లాడలేదు. అక్కడినుండి ఇంటికి వచ్చాడు. మంచంమీదపడి ఆలోచిస్తున్నాడు.

* * *

ప్రెసిడెంటు గోవర్ధనం కోర్టుకు హాజరయ్యాడు. మాదకద్రవ్యాలు అక్రమంగా నిల్వచేసినందుకు ఆయనమీద కేసు మోపారు. పదిహేనురోజులుగా తప్పించుకు తిరిగి అరెస్ట్ అయినవెంటనే



బెయిల్ మీద బయటకు రావడానికి అన్ని ఏర్పాట్లు పూర్తిచేసుకున్న తర్వాతే కోర్టుకు సరెండర్ అయ్యాడు. వెంటనే ఆయన తరపున న్యాయవాదులు బెయిల్ అప్లికేషన్ దాఖలుచేశారు. హాజరయిన రెండు గంటలకే బయటకు వచ్చాడు. గ్రామంనుండి వచ్చిన తన అనుచరుల ద్వారా శాస్త్రి సబ్‌జైలులో ఉన్నారని తెలిసి సబ్‌జైలు వద్దకు వెళ్ళాడు. అక్కడి ఇన్‌ఛార్జితో పరిచయం ఉండటంవల్ల పది రూపాయలు చేతిలోపెట్టి శాస్త్రి ఉన్న సెల్‌వద్దకు వెళ్ళాడు.

గోవర్ధనంను చూసి తలుపువద్దకు పరుగెత్తుకుంటూ వచ్చాడు శాస్త్రి. కండ్ల నీరు కారుస్తూ "ఏమయింది" అన్నాడు.

ప్రెసిడెంటు పకపక నవ్వాడు. "ఏమవుతుంది ? బెయిల్ మీద బయటికి వచ్చాను. ఇంతకుముందే నీ గురించి తెలిసింది. సబ్‌జైలుకు ఎప్పుడు తరలించారు?"

"మూడు రోజుల కిందట అరెస్ట్ చేశారు. మొన్న, నిన్న స్టేషన్‌లోనే ఉంచి నానా హింసలూ పెట్టి రహస్యాలు లాగడానికి ప్రయత్నంచేసి నిన్న సాయంత్రం కోర్టుకు హాజరు పరచారు. గ్రామం వెళ్లావా?" అన్నాడు శాస్త్రి ప్రెసిడెంటు ముఖం చూస్తూ.

అతనిముఖం పీక్కుపోయిన జాడ కన్పించడంలేదు. హుషారుగానే ఉన్నాడు.

"నా పిల్లల గురించి ఏమయినా తెలిసిందా? ఆడపిల్లలు... ఏమయ్యారో భగవంతుడా!" అన్నాడు చేతులు పైకెత్తి బాధపడుతూ.

"ఇంతవరకూ నేను గ్రామంవెళ్ళలేదు. దేవాలయంలోని నగలకు ఏమైంది? అది కూడా పోలీసులు ఆక్రమించారట కదా?

"చాలా పెద్ద కథ అది! ఇక్కడ చెప్పాలంటే సాధ్యం కాదు. నన్ను బయటకు తీసే మార్గం చూడు ముందు. తర్వాత అన్నీ అర్థం అవుతాయి"

"ఈరోజే బెయిల్ ఇప్పిస్తాను" అన్నాడు ప్రెసిడెంటు. లాయరువద్దకు వెళ్ళి తిరిగి కోర్టుకు తీసుకు వచ్చాడు. బెయిల్ అప్లికేషన్ పెట్టించి శాస్త్రిని కూడా బయటకు తెచ్చాడు. ఇద్దరూ కలిసి గోపల్లె చేరారు. పగలు రావడానికి ముఖం చెల్లక రాత్రి చీకటిపోయిన తర్వాత ఇళ్లు చేరారు. శాస్త్రితోపాటు ప్రెసిడెంటు కూడా శాస్త్రి ఇంటివద్దకే వెళ్లాడు. తండ్రిని చూసిసీత, రమ వల వల ఏడుస్తూ కాళ్ళకు చుట్టుకున్నారు. వారిద్దరినీ కౌగిలించుకు శాస్త్రి కన్నీరు విడిచాడు.

"ఏవిధంగా ఉంటున్నారు?" అడిగాడు శాస్త్రి ను వీపు నిమురుతూ.

"పిన్నమ్మ గారి వద్ద రాత్రి ఇక్కడ పడుకుంటోంది" అంది రమ.

సీత మంత్రయత్నంలో పడింది. మునసబు తన శీలం హరించి మోసం చేశాడు. తన్ని ఇక రాలేదేమో అనుకుంది. ప్రెసిడెంటు బయటకు తెచ్చాడు. ప్రెసిడెంటుమీద ఆమెకు గౌరవం కలిగింది.

"అంతా మునసబుగాడు మన ఆస్తి ఆక్రమించుకున్నాడన్న మాట" అన్నాడు ప్రెసిడెంటు ముఖం తుడుచుకుంటూ.

"అంతంతా వాడేనయ్యా! నన్నేం చేయాలని మాయమాటలు చెప్పి ఇరికించేశాడు. ఇంతకూ మల్లారెడ్డి ద్వారా వాడ్ని మనం చంపడానికి ప్రయత్నించిన సంగతి ఎట్లా వాడికి తెలిసింది? మన




ముగ్గురికీ తప్ప ఎవరికీ తెలియదు కదా?" అన్నాడు శాస్త్రి.

ప్రెసిడెంటు తల ఊపాడు. "ఆ విషయం గురించి దీర్ఘంగా ఆలోచించాను. నాలుగో వ్యక్తి బుచ్చి. చేతబడి చేసే టప్పుడు ఎందుకు చేస్తున్నదీ దానికి వాడు చెప్పిఉంటాడు. అదే మునసబుకు చెప్పి ఉంటుంది. మల్లారెడ్డిని ఎట్లా చంపిందీ కూడా. దాన్ని పడితేకాని బయటపడదు. ఎక్కడుందది?"

"రాజోలులో ఉన్నట్లు తెలిసింది"

ఉదయం కలుస్తానని చెప్పి ప్రెసిడెంటు ఇంటికి వెళ్లాడు. ఏడుస్తూ పెళ్ళాం ఎదురు వచ్చింది. ఓదార్చి పాలేరు శీనును పిలిచాడు. "శీనూ! వెంటనే వెళ్లి మాదిగపల్లెలో రామున్ని పిలుచుకురా" అన్నాడు.

మరో పది నిముషాల్లో రాముడు వచ్చాడు. "ఒరేయ్ రామూ! పదిమంది మనుషులు కావాలి. మంత్రగత్తె బుచ్చి రాజోలులో ఉంది. దాన్ని ట్రాక్టరులో వేసుకు రావాలి"

రాముడు తలూపాడు.

ప్రెసిడెంటు అన్నం తిని సిద్ధపడే టప్పటికి పదిమందితో రాముడు ఎద్దుల కొట్టం వద్ద ఉన్నాడు. ప్రెసిడెంటు అక్కడికి వచ్చాడు. ట్రాక్టరును తీసుకు రమ్మని డ్రైవరుకు చెప్పాడు.

రాజోలు చేరేసరికి అర్ధరాత్రిదాటింది. అక్కడ యాభైకంటే మించి ఇళ్లు లేవు. బుచ్చి ఎవరి ఇంటివద్ద ఉందో ముందే తెలుసుకున్నారు గనుక, ట్రాక్టరు అక్కడికే తెచ్చి నిలిపారు. అందరూ దిగాక ఒక వ్యక్తి తలుపువద్దకు వచ్చి "ఏసూ" అంటూ పిలిచాడు. రెండుసార్లు పిలిచిన తర్వాత లోపల పలికాడు. మరో నిముషంలో తలుపు తెరిచాడు. బయట చిమ్మచీకటి. ఏమున్నదీ అగు పించడం లేదు.

బయట నిలబడ్డ వ్యక్తి "మా జీత గాడికి పాము కుట్టింది. బుచ్చమ్మను తీసుకెళ్లాలి. పిలువు" అన్నాడు. బయట ఇద్దరు ముగ్గురే కన్పించారు. పైగా ఆమెను ఎత్తుకెళ్ళడానికి వస్తారని అతడు అనుకోడానికి ఆస్కారంలేదు. ఆమెకొరకు ఎప్పుడంటే అప్పుడే జనం వస్తుంటారు. అందువల్ల లోపలికి అడుగులేసి "వదినా! నీకొరకు వచ్చారు" అన్నాడు.

బుచ్చి లేచింది. కళ్ళు నులుముకుంటూ "ఎవరూ" అంటూ తలుపు దగ్గరకు వచ్చింది. వెంటనే ఇద్దరు మనుషులుమీద పడి లాక్కొచ్చి ట్రాక్టర్లో పడేశారు. ఆమె అరుస్తున్నా, గింజుకుంటున్నా విడువకుండా పట్టుకుని కూర్చున్నారు. జనం అందరూ ఎక్కుతూనే ట్రాక్టరు కాలవకట్ట వెంట పరుగుతీసింది. ఇంటి వ్యక్తి వారిని, వీరిని లేపేసరికే ట్రాక్టర్ చాలాదూరం వెళ్ళిపోయింది.

ట్రాక్టర్ దేవాలయం వద్దకు తెచ్చారు. దేవాలయం తాళంచెవులు తెప్పించి, తలుపులు తీసి ఆమెను లోపలకు తీసు కెళ్లారు. గర్భగుడి వసారాలో స్థంభానికి కట్టేశారు. ట్రాక్టరు ఇంటికి తీసుకెళ్ళారు. శాస్త్రి కూడా అక్కడకు వచ్చాడు. తెల్లవారుజాము కావస్తున్నది. పాల కేంద్రంవాళ్లు పాల డ్రమ్ములు కడుగు తున్నారు. ఒకరిద్దరు జనం లేచి పసులు చూసుకుంటున్నారు.

"ఏమే! మునసబుగాడిని చంపమని నిన్ను పెడితే, మా రహస్యాలు తీసు కెళ్ళి వాడికి తెల్పుతావా?" హూంకరిం చాడు ప్రెసిడెంటు.

"నాకేం తెలియదు బాబూ!" అంది చేతులు జోడించి.

కాలిచెప్పు తీసుకుని తలమీద ఫెళ ఫెళ బాదాడు. "రండదానా! నా దగ్గర వేషాలేయకు. చెప్పు....చెప్పు" ఫెళ ఫెళ బాదుతున్నాడు.

"చెబుతాను. కొట్టకండి" అంది ఏడుస్తూ. మాడు పగిలి రక్తం కారుతున్నది. ఆ రక్తంతో వెంట్రుకలు తడిసి అట్టకడుతున్నాయి. నోటిలో నుండి నురగ వచ్చింది. చంపుతారని భయపడుతున్నది.

"మర్యాదగాచెప్పుసిన్నేంచేయము.లేదా దేవాలయం పక్కగుంటలో జీవసమాధే నీకు గతి... చెప్పు. మునసబుకు వాడిని చంపడానికి మేం ప్రయత్నంచేసిన విషయం నువ్వేకదా చెప్పింది"

"నేనే బాబూ... తప్పయింది" అంది ఏడుస్తూ.

"మల్లారెడ్డిని ఎవరు చంపారు?"

"నేనే చంపాను"

"ఎందుకు?"

"మునసబుగారు చంపమన్నారు. మల్లారెడ్డి ఉంటే ఏనాడయినా తనకు గండమేనని"

"ఎట్లా చంపావు?"

"మంత్రాలు బాగా చదువుతున్నాడు. బాగా శివమెక్కింది. మీ పాలేరు భయపడుతున్నాడు. ఆ సమయంలోనే పటం కిందపడింది. ఎలా పడిందో తెలియదు. పటం పగిలి కిందపడేసరికి భయపడుతున్న పాలేరు బయటకు పారిపోయాడు. వెంటనే నేను అతడి తల నరికాను. కింద పడి కొట్టుకుంటున్నవాడి కాళ్ళూ, చేతులూ నరికి దేవికి బలిపెట్టాను. అక్కడినుండి పారిపోయాను. ఉపయం ఎవరయినా చూసినా దేవికి సరయిన బలి ఇవ్వక పోవడంవల్ల ఇతడిని బలి తీసుకుందని అనుకుంటారని ఆలోచించాను"

"ఈ దేవాలయంలో నల్లమందు ఉన్నట్లు కూడా నువ్వే చెప్పావా?"

తలూపింది బుచ్చి.

"నాకు మల్లారెడ్డి తాగిన సమయంలో ఒకసారి చెప్పాడు. ఆ విషయం మునసబుకు చెప్పాను"

మునసబుకు తెలిసిన ప్రతి విషయం మల్లారెడ్డి ద్వారా బుచ్చికి అందినట్లు తెలుస్తున్నది. మల్లారెడ్డి బతికి లేడు. పైగా అతడు కావాలని ఇవ్వలేదు. బుచ్చి వ్యామోహంతో చెప్పి ఉంటాడు. బుచ్చి మునసబుకు చేరవేసింది. మల్లారెడ్డితో పాటు బుచ్చి తమ మనిషేనని ప్రెసిడెంటు భావించాడు.కాని బుచ్చి పైకి వీరికి మంచిగా ఉంటూనే మునసబుకు పనిచేసింది. ప్రెసిడెంటు నరనరానా రక్తం ఉప్పొంగుతున్నది. కనీసం ఐదు లక్షల రూపాయల విలువచేసే సరుకు నాశనం; అన్ని విధాలా సహకరించే మంత్రగాని మరణం; తానూ, శాస్త్రి జైళ్ళపాలు, ఇకకోర్టులవెంటతిరుగవలసిన పని ఏర్పడటం... దీనికంతటికి కారణం బుచ్చి! బుచ్చి చేసిన పనిని మునసబు ఉపయోగించుకున్నాడు. తమను తొక్కి తాను ముందుకు రావడానికి ప్రయత్నం చేసి సఫలీకృతుడయ్యాడు.

"దీన్ని విడిచిపెట్టగూడదు. బయటికి వెళ్ళి తిరిగి మనమీదే ఇది చేతబడి చేయవచ్చు" అన్నాడు శాస్త్రిగారు.

"చేతబడా దీని ముఖమా ? ఇదో బజారు గాడిద ! జనాన్ని మంత్రాల పేరుతో నమ్మించి అందరినీ నాశనం చేస్తున్నది. ఇంత ద్రోహం చేసిన దీనిని




ప్రాణాలతో మాత్రం ఎందుకు విడుస్తాము?" అన్నాడు ప్రెసిడెంటు.

బుచ్చి చేతులెత్తి నమస్కారం చేసింది.

"ఊపిరి ఉంటే ఉప్పు అమ్ముకుని అయినా బతుకుతాను బాబూ! మీ జోలికి ఇక ఎన్నడూ రాను" అంది ఏడుస్తూ.

"మా జీవితాలు సగం నాశనం చేశావు; బజార్లలో అల్లరిపాలు చేశావు. నిన్ను ఇంకా ప్రాణాలతో తిప్పడమంటే మేము వెర్రివెంగళప్పలం కావలసిందే!"

"మీరేం చేయమంటే అది చేస్తాను బాబూ! మునసబుమీద చేతబడి చేయమంటే ఇక్కడే ఉండి చేస్తాను" అంది బుచ్చి.

ప్రెసిడెంటు పకపక నవ్వి కాలితో పొట్టలో తన్నాడు. బుచ్చి మెలికలు తిరిగి అరచింది.

"నీ చేతబడి, మంత్రాలు అన్నీ పట్టివే! చేతబడి అనేది లేనేలేదని నాకు బాగా తెలుసు. దానివల్ల ఎవరికీ ఎలాంటి అపాయం లేదని కూడా కనుక్కున్నాను. ఇంతవరకూ ఈ నమ్మకంతో భయపడుతూ మల్లారెడ్డిగాడికి లొంగి నా డబ్బు ఎంతో తగలేశాను. ఇంకా ఈ మాటలు నమ్ముతానా?" అన్నాడు ప్రెసిడెంటు.

"రాముడూ! దేవళం వెనుక గుంటతీసి తెల్లారేలోగా దీన్ని సమాధిచేయండి" అన్నాడు ప్రెసిడెంటు. రాముడుతోపాటు నలుగురు మనుషులు దేవళం వెనుకకు పరుగెత్తారు. అర్థగంటలో గుంటతీసి వచ్చారు. నోటిలో గుడ్డతోసి కాళ్ళు, చేతులు కట్టి బుచ్చిని గుంటదగ్గరకు మోసుకెళ్ళారు. గుంటలో వేసి పూడ్చి, దేవాలయం ఆవరణలోని ఒక మల్లె అంటు తీసుకెళ్ళి దానిమీద పాతారు. నీళ్ళు చేదుకొని వెళ్ళి పోశారు.ఎవరయినా చూస్తే మల్లె అంటు నాటారనుకుంటారు గాని మనిషిని పూడ్చారనుకోరు.

ప్రెసిడెంటు ఇంటికి వచ్చాడు. శాస్త్రి కూడా ఇంటికి వచ్చాడు. మసక చీకట్లు విచ్చుకుంటున్నాయి. దేవాలయం ముందున్న రోడ్డు వెంట పొలాలలోనికి ఎడ్లు, మనుషులు వెళ్తున్నారు. రాత్రి అంత భయంకర సంఘటన జరిగినట్లు అక్కడ దాఖలాలు ఏమీలేవు.

శాస్త్రి ఇంటికి వచ్చేసరికి సీత కళ్ళాపి చల్లి ముగ్గు వేస్తున్నది. తండ్రిని చూసి "ఇంత పొద్దున్నే ఎక్కడికెళ్ళావు నాన్నా?" అంది.

"ప్రెసిడెంటు ఇంటివద్దకు వెళ్లానమ్మా! పాప లేచిందా?"

"ఇంకా లేవలేదు" అంది లోపలకు వెళ్తూ.

శాస్త్రి పాపపరిహారం చేసుకోడానికి తులసి చుట్టూ చేతులు కట్టుకుని మూడు సార్లు తిరిగాడు. ఏదైనా పాపపుపనిగా భావిస్తేనే ఆయన అలా తిరుగుతాడని సీతకు తెలుసు. ఇంత పొద్దున్నే ఆయన చేసిన పాపపు పనేమిటో ఆమెకు తెలియదు. తొట్టిపడ్డ కాళ్ళు కడుక్కుంటున్న తండ్రి వీపువైపు తదేకంగా చూస్తూ నిలబడింది సీత!




ఉదయమే కాలకృత్యాలు తీర్చుకుని

డాక్టర్ ఇంటివైపు సాగాడు శాస్త్రి. రమణమ్మ మంచంమీద నుండి లేవలేదు. రాము లైటుముందు కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాడు.

"రమణమ్మా!" పిలిచాడు శాస్త్రి రమణమ్మ మగతగా కళ్లు తెరిచి చూసి నీరసంగా లేచికూర్చుంది. "కూర్చోండి శాస్త్రిగారూ! రామూ....కుర్చీ పట్రా" అంది. రాము కుర్చీ తెచ్చి వేశాడు. ఆగంతకుడెవరో అతడికి తెలియదు.

శాస్త్రి కూర్చుంటూ "ఈ అబ్బాయేనా నీ మరది?" అన్నాడు రామును చూస్తూ. రమణమ్మ తల ఊపింది.

''ఆరోగ్యం ఎలా వుంది?"

"బతుకుతాననే నమ్మకం లేదండీ! నా తర్వాత ఈ అబ్బాయి ఏమవుతాడో నన్న బెంగ. నాకు మిగిలింది ఈ అబ్బాయే" అంది ఏడుస్తూ.

'చేసుకున్నవాళ్లకు చేసుకున్నంత మహాదేవ' అనుకున్నాడు మనసులోనే. తాను వచ్చిన కార్యాన్ని దృష్టిలో పెట్టుకుని "లక్ష్మి సంగతి ఏంచేశావు? కేసు పెట్టావా? నేను నిన్ననే వచ్చాను. వచ్చిన వెంటనే వద్దామనుకున్నాను. వీలు లేకపోయింది. అందువల్లే ఇంత పొద్దున్నే వచ్చాను. డాక్టరుండగా నాతో ఎంతో స్నేహంగా ఉండేవారు. రోజుకు ఒకసారి అయినా దేవాలయం వద్దకు రాకుండా ఉండేవాడు కాదు. ధర్మరాజులాంటి డాక్టరు జీవితాన్ని నాశనంచేసి గొంతు పిసికి చంపారు"

శాస్త్రివైపు తలెత్తి చూసింది రమణమ్మ. చలిగా ఉండటంవల్ల దుప్పటి మెడవరకూ కప్పుకుంది.

"డాక్టరు రిపోర్టు ప్రకారం మన డాక్టరు మెడ పిసకడంవల్ల చనిపోయినట్లు రుజువవుతూనే కేసు పెట్టివుంటే ఈరోజు లక్ష్మి గతి ఇలా అయ్యేది కాదు"

"నిజమేనండీ! నేను నమ్మాను. ఎండ మావిని సెలయేరులా భావించి బంగారం లాంటి పాపను,భర్తను పోగొట్టుకున్నాను. దానికి ఫలితం అనుభవిస్తున్నాను" ఊపిరి పీల్చి భారంగా విడుస్తూ బయటకు చూస్తున్నది. ఇంకా పొద్దు పొడవలేదు. కానీ బాగా తెల్లారింది.

"ఇప్పటికయినా మించిందిలేదు. నీకు ఇంకా మునసబు మీద నమ్మకం, ఆపేక్ష ఉంటే చెప్పనుగాని లేనిపక్షంలో లక్ష్మి మనశ్శాంతికొరకయినా కేసు పెట్టి వాణ్ని జైలుకు పంపించాలి. ఆవిధంగా నయినా లక్ష్మి ఆత్మ శాంతిస్తుంది"

"నాకెవరు సహాయం చేస్తారు శాస్త్రి గారూ? డాక్టరు ఉండగా ఆయన మీదున్న గౌరవంతో నాకూ గౌరవం ఇచ్చారు. ఆయనతోనే నా గౌరవాలు పోయాయి. నా ముఖం చూడటానికి కూడా ఎవరూ సిద్ధంగా లేరంటే మునసబుగాడికి ఎదురు నిల్చి ఈ ఊరిలో నాకు సహాయం ఎవరు చేస్తారు?"

"నీకెందుకమ్మా! నీవు రిపోర్టుమీద సంతకం పెడతానంటే అందుకు సహకారం చేసేవాళ్ళను నేను చూస్తాను. ప్రెసిడెంటుతో అనవసరంగా తగవు వచ్చింది గానీ ప్రెసిడెంటు తలుచుకుంటే ఈ కేసులో మునసబును మూడు లోకాలు తిప్పివేస్తాడు. ప్రెసిడెంటుతో నేను మాట్లాడుతాను"

"ప్రెసిడెంటు సహాయం చేస్తానంటే తప్పకుండా కేసు పెడదాము శాస్త్రిగారూ! మా అన్ననీ, చెల్లెల్నీ నాశనంచేసిన వాడిని నాశనం చేయడమే నా లక్ష్యం. ఎలాగూ ఈ ఊరిలో మేము కాపురం




చేసేదిలేదు. ఆతర్వాత అదుక్కు తిన్నా ఫర్వాలేదు. మునసబుగాడిని నాశనం చేయడమే నా ఉద్దేశం" అన్నాడు రాము ఆవేశంగా.

వదినెకూ, మునసబుకూ ఉన్న అక్రమ సంబంధం తెలుసు. ఆ సంబంధం వల్లే చొరవగా లక్ష్మిని నాశనం చేశాడనీ అతడికి తెలుసు. మునసబును పొడిచి చంపి అయినా పోవాలన్న ఆవేశంతో ఉన్నాడు. తన అక్రమ సంబంధం దృష్టిలో పెట్టుకుని వదిన కేసు పెట్టవద్దం టుందేమోనని అతడి భయం.

శాస్త్రి రమణమ్మ వైపు చూశాడు. రమణమ్మ రాము వైపు చూస్తున్నది.

"ఆ అబ్బాయి రిపోర్టిచ్చినా సరిపో తుంది. నీ ఉద్దేశం చెప్పు. రేపు మరో లక్ష్మి జీవితం కూడా ఇలాగే కావచ్చు. నీ మొగుణ్ని చంపినవాడిమీద నీకు ప్రేమ ఉందా?" సూటిగా అన్నాడు శాస్త్రి.

"ఆయనను మునసబు చంపాడని ఆధారమేమిటి?"

"అన్నీ బయటపడతాయి. తీగ లాగితే డొంక కదలకుండా ఎలా ఉంటుంది? మునసబు ప్రియురాలు బుచ్చి...మంత్ర గత్తె బుచ్చి తెలుసుగదా నీకు. అది అన్ని విషయాలూ చెప్పింది. అటువంటి నీచుడిని ఇంకా గ్రామంలో ఉంచాలన్నా సిగ్గుచేటుగానే ఉంటుంది. నీవు కాబట్టి ఇంకా క్షమిస్తున్నావుగానీ మరొకరయితే ఈపాటికి వాడిని కంచపీకి తినేవారు"

శాస్త్రి రెచ్చగొట్టేమాటలకు రమణమ్మ వణికిపోతూ కూర్చుంది. మునసబుమీద ఆమెకు ఏ ప్రేమా లేదిప్పుడు. తన భర్తను చంపించింది అతడేనని అతడి మాటల సందర్భంలోనే ఎప్పుడో గ్రహించింది. రెండోది లక్ష్మిని చెరచి చంపడం. మునసబే బావిలో పడవేశాడని ఆమె నమ్ముతున్నది. ఈ కారణాలవల్ల అతన్ని పూర్తిగా ద్వేషిస్తున్నది. అయితే అతన్ని ఎదిరించి గ్రామంలో తమకు సహకారం చేసేవాళ్ళు లేరు. లక్ష్మి చావువల్ల, ఆమె చెరచబడటంవల్ల కొంతమంది యువకు లకు ఆవేశం వచ్చిందేగానీ, వాళ్ళు రేపు మునసబును ఎదిరించి నిలబడేవారు కాదు. ఆవేశం చల్లారిన తర్వాత ఇళ్ళనుండి బయటకు రారు. ఆ యువకులకు వారి ఆవేశానికి తగిన ధైర్యం, నిజాయితీ ఉంటే గ్రామంలో ఇంత బాహాటంగామత్తుమందు స్థావరం కూడా ఉండదు; చేతబడులూ జరగవని ఆమె ఉద్దేశం. అందువల్ల వారిని నమ్మి కేసు పెట్టలేక మానుకుంది. ఇప్పుడు ప్రెసిడెంటుతో పనులు చేయిస్తానంటు న్నాడు శాస్త్రి. నిజమే! ప్రెసిడెంటు పని పడితే తాడో పేడో తేలాలి. కాని అతడు ఒకనాడు తనచేత చెప్పుదెబ్బ తిన్నవ్యక్తి, తనను కోరిన వ్యక్తి! ఈరోజు ఆ అవమా నం గుర్తుంచుకోకుండా ఎలా ఉంటాడు? ఏవిధంగా సహకారం చేస్తాడు? శాస్త్రికీ, ప్రెసిడెంటుకూ దగ్గరసంబంధాలున్నాయని తెలుసు రమణమ్మకు. అందువల్లే కొంత ఆశకలిగింది. చివరకు తల వంచుకుని అంది—

"గతం మీకు తెలుసుకదా! ప్రెసి డెంటుగారు నాకు సహాయం చేస్తాడన్న నమ్మకమేమిటి? ఆయన కూడా మధ్యలో ముంచితే....?"

"గతం గతః! పాత విషయాలు ఆయన ఎప్పుడో మరచి ఉంటాడు. ఎంత యినా ఆయన, డాక్టరు ఒకనాడు ప్రాణ స్నేహితులే కదా! తప్పకుండా నీకు సహ కారం చేస్తాడు. స్వయంగా నువ్వే కలిసి మాట్లాడు. మధ్యవర్తులతో పనిలేదు"

అన్నాడు శాస్త్రి.

"నేను లేచి వెళ్ళలేను శాస్త్రిగారూ! నా తరపున మీరే ప్రయత్నించి సహకారం చేయండి. అలాగే ఈ ఇల్లు అమ్మి పెట్టండి. ఈ డబ్బుతో ఆ అబ్బాయి చదువు సాగాలి. ఆ అబ్బాయికయినా ఓ దారి ఏర్పడితే నా దారి సంగతి చూద్దాం"

సరేనన్నాడు శాస్త్రి. "నీ ఆరోగ్యాన్ని కాపాడుకో! పట్నంవెళ్ళి హాస్పిటల్‌లో చూపించు. ఈ మంత్రాలవల్ల రోగాలు పోవు. దెయ్యాలు, పిశాచాలు అనుకుంటూ దిగులుతో కృంగిపోవడంకంటే, హాస్పి







టల్‌కు వెళ్ళి చూపిస్తే అసలు జబ్బేమిటో అర్థం అవుతుంది."

"నాదగ్గర ఏమీలేదు శాస్త్రిగారూ! ఉన్న బంగారు నగలు అమ్మేసి చూపించుకుందా మంటే నడిచేస్థితిలోలేను."

"డబ్బును గురించి కంగారుపడకు. ప్రెసిడెంటుగారితో ఏర్పాటు చేయిస్తాగా!" అన్నాడు శాస్త్రి లేచివెళ్తూ. వెళ్తున్న శాస్త్రిని చూస్తూ కూర్చుంది రమణమ్మ.

శాస్త్రికి కావలసింది మునసబును ఇరికించడం! లక్ష్మి హత్యకింద, డాక్టర్ హత్యకింద మునసబును ఇరికిస్తే, ఉరి శిక్ష కాకున్నా యావజ్జీవితం తప్పదు.

అతడి వల్ల తనకు రావలసిన ఎంతో ఆదాయం పోయింది. ఆ ఆదాయంతో పిల్ల పెళ్లి చేద్దామన్న కలలు కల్లగా అయింది. జైలుపాలు కావలసి వచ్చింది. శాస్త్రి నరనరం భగభగ మండుతున్నది. ఇంత వరకూ లోపాయికారిగా మునసబు అంటే వ్యతిరేకించేవాడు. ఇప్పుడు బహిరంగం గానే సాధించడానికి కత్తిగట్టాడు.

ఇదంతా రమణమ్మ అర్థం చేసుకో గలదు. శాస్త్రి అవసరం అటుంచి, మునసబును సాధించడానికి ఆమె కూడా సిద్ధపడుతున్నది. మునసబును మంచి వాడుగా భావించింది. భర్తతో అతడి కున్న వ్యాపార లావాదేవీల వల్ల ఇంటికి వస్తూ పోతున్న అతనికి ఇష్టపూర్వకం గానే లొంగిపోయింది. కాని, అతడు నీతి వంతుడు కాడని తొందర్లోనే గ్రహించింది. పైకి ఎంత మంచివాడుగా కనిపిస్తాడో, అంతటి విషపు పురుగేనని గ్రహించింది. అతనినుండి ఏవిధంగా విడివడాలో ఆలో చిస్తుండగానే డాక్టరు చనిపోయాడు. ఆ మరణం గొంతు పిసకడం ద్వారానని పోస్టుమార్టంలో వెల్లడయింది. మునసబు మీదనే తన అనుమానం. గత కొంత కాలంగా అక్రమ వ్యాపారంలో ఇద్దరూ ఒకరినొకరు మోసం చేసుకోడానికే ప్రయత్నిస్తున్నారని భర్త మాటల వల్ల తెలిసింది. దాని ఫలితంగా మునసబే చేయించి, పిశాచాల మీద తోసి ఉంటా డని ఆమె భావన. ఆ తర్వాత కూడా అతడి మాటల్నిబట్టి నిర్ధారణకు వచ్చింది. తాను ఏ కారణాల వల్లనయినా స్థిమితం కోల్పోయి మంచం పాలు కావలసి వచ్చింది. మంత్ర తంత్రాల పేరుతో తన మనోస్థయిర్యం మరింత దెబ్బతీసి నీరసించేలా చేశాడు. 'అన్నయ్యా!' అని పిలుస్తూ తమ సంబంధం తెలిసికూడా పట్టించుకోని లక్ష్మి జీవితాన్ని అంతం చేశాడు. తను ఇప్పుడు నిలువ నీడలేక అతడి కాళ్లదగ్గర ఉంది. ఈ బంగారు నగలుకూడా తన అవసరానికి ఎప్పుడు లాక్కెళ్తాడోనన్న భయంగా ఉంది. ఇక ఇల్లు అతడు అడ్డుపడితే కొనే నాథుడే ఉండడు. ఆవిధంగా తాను అతని అండ విడిచిపెడితే బజారుపాలు కావలసిన స్థితి సృష్టించి, కుక్కలా చేసుకున్నాడు. ఈ పరిస్థితిలో గ్రామంలో మునసబుతో పోటీకి నిలబడేవ్యక్తి ప్రెసిడెంటు ఒక్కడే! అతడి సహాయం దొరికితే కనీసం ఈ ఊరు దాటి మర్యాదగా పోవడానికయినా అవకాశముంటుందని ఆమె ఉద్దేశం.

తొమ్మిది గంటల సమయంలో ప్రెసిడెంటు, శాస్త్రి, మరో ఇద్దరు యువకులూ రమణమ్మ ఇంటికి వచ్చారు. వారినిచూసి రమణమ్మ మెల్లిగా కిందకు దిగి గోడనానుకుని కూర్చుంది.

"ఎలా ఉంది రమణమ్మా?" అంటూ పలుకరించాడు ప్రెసిడెంటు, పాతదంతా మరచిపోయినట్లు పూర్వంలాగే చిరు నవ్వుతో!

"ఆరోగ్యం బాగా దెబ్బతిన్నదండీ! బతుకుతానన్న నమ్మకం లేదు" అంది తల వంచుకుని, చేతితో బండమీద రాస్తూ.

"మనోరోగానికి మందే లేదంటారు పెద్దలు! ధైర్యం తెచ్చుకోవాలి. డాక్టరుకు చూపిద్దాం పద. అంతేగానీ తంత్రాలూ, యంత్రాలు లాభంలేదు" అన్నాడు శాస్త్రి మళ్ళీ.

"లక్ష్మి దారుణంగా చనిపోయిందిట గదా?" అన్నాడు ప్రెసిడెంటు.

"అవునండీ! దాని జీవితం అలా ముగుస్తుందనుకోలేదు. దాని జీవితం పాడు

 

చేసింది మునసబే! మా జీవితాలకు విషంలా తయారయ్యాడు. కేసు పెడదామన్నా భయంగా ఉంది" అంది రమణమ్మ.

"నీకేం భయంలేదు. ఏం చేయదలచుకున్నా నిర్భయంగా చెయ్యి. మంచిపనికి నా సహకారం ఎల్లప్పుడూ ఉంటుంది" అన్నాడు ప్రెసిడెంటు.

"మీరా మాట ఇస్తే తప్పకుండా కేసు పెడతామండీ" అన్నాడు రాము ప్రెసిడెంటు దగ్గరకు వస్తూ.

"తప్పకుండా! చీడపురుగు చెట్టు మీదున్నంతవరకూ తొలుస్తూనే ఉంటుంది. దాని పనే అది! దాన్ని అంతమొందిస్తే గానీ చెట్టు బాగుపడదు. మీరు కేసు పెడతామంటే, సరాసరి డి.యస్.పి. దగ్గరికే తీసుకెళ్తాను. మధ్యనున్న పోలీసులు,ఇన్‌స్పెక్టర్లు దళారీలు.డబ్బుతిని కేసు మాఫీ చేస్తారు"

రమణమ్మ, రాము అంతకుముందే ఒక నిర్ణయానికి వచ్చారు గనుక తల ఊపారు. అన్నం తిని పన్నెండు గంటలకు వెళ్లడానికి నిర్ణయించుకుని బయటకు వచ్చారు.

"దీని ద్వారానే వాడిని తొక్కాలి" అన్నాడు శాస్త్రి పిలక ఊపుతూ.

ప్రెసిడెంటు పలకలేదు. ఆలోచిస్తూ ముందుకు సాగాడు. అవకాశం దొరికించుకోవాలన్న అతడి తాపత్రయం ఈరోజుకు పూర్తయింది. ఇక లక్షరూపాయలు ఖర్చుపెట్టి అయినా మునసబును పరిసమాప్తం చేసుకోవడమే అతని ధ్యేయం. అతడివల్ల దాదాపు ఆరు లక్షల రూపాయల వస్తువు పాడయింది. అతనివల్లనే రమణమ్మ చేత చెప్పుదెబ్బలుతినవలసి వచ్చింది.అతడివల్లనే డాక్టరుకూ, తనకూ పొరపొచ్చాలు వచ్చి వ్యతిరేకత ఏర్పడింది. అతడివల్లనే తాను ఆస్తి పోగొట్టుకోవడమేగాక కేసులో కూడా ఇరుక్కోవలసిన పరిస్థితి సృష్టించబడింది. అతడు ఉన్నంతవరకూ తనకు ప్రమాదమే! కేసుద్వారా లోపలకు పంపడమో, లేకుంటే అసలు లేకుండా చేయడమో చేయాలన్న దృఢనిర్ణయానికి వచ్చాడు. ఇది మంచి అవకాశం! రెండు హత్య కేసులు అతడిమీద మోపడానికి అవకాశం ఉంది. డబ్బు గుమ్మరించగలిగితే లోపలనుంచి బయటకు రాకుండా చేయవచ్చు. ఆతర్వాత ఎదురులేని గ్రామంలో పోయిన ఆరులక్షల బదులు ఆరవయి లక్షలు ఆదాయం సంపాదించవచ్చు.

ఇదీ ప్రెసిడెంటు ఆలోచన!

ప్రెసిడెంటు, శాస్త్రి రమణమ్మ ఇంటికి వెళ్ళివచ్చిన సంగతి తెలిసిన మునసబు పరుగెత్తినట్టుగా ఆ ఇంటికి వెళ్ళాడు. ఆపాటికి రమణమ్మ ముసుగు కప్పుకుని పడుకుని ఉంది. రాము వంట ప్రయత్నంలో ఉన్నాడు. రమణమ్మ ముసుగులాగి "ప్రెసిడెంటుగాడు ఇంటికి వచ్చాడట గదా!" అన్నాడు కోపంగా చూస్తూ.

రమణమ్మ లేచి కూర్చుంది.

"వచ్చివెళితే ఏం? మీరు వచ్చినట్లే ఆయనా వచ్చాడు"

"వాడికీ, నాకూ పోటీ పెడుతున్నావా? కేసు పెడతానన్నావట కదా!"

"అవును. పెట్టదలచుకున్నాను. నిజాన్ని నిజంగా మాట్లాడితే ఏం?"

ఆమె చెంప పగులగొట్టాడు మునసబు. "ముండ కానా! నీకింత సహాయం చేసినా నాకే ద్రోహం చేయడానికి పూనుకుంటున్నావు. నిన్ను నడిబజారులో నిల్చి తోలుతీసి ఊరేగిస్తాను" ఆగ్రహంగా

అన్నాడు.

కండ్లనీరు కారుస్తూ, ఏడుస్తూ ఎగిరి పడుతున్న ఆయాసంతో విడిపోయిన జుట్టు ముడివేసుకుంటూ అంది. "నువ్వు నీచుడివి. నా జీవితంతోనే కాదు మా కుటుంబంతోనే చెలగాటమాడావు. మా ప్రాణాలు తీస్తున్నావు. మిగిలిన మా ప్రాణాలు కాపాడుకోడానికయినా నిన్ను నాశనం చేయాలి'' ఊపిరిపీల్చి గట్టిగా విడిచి అంది.

ఆమె జుట్టుపట్టి మంచంమీదనుండి కిందికి పడతోశాడు. వీపుమీద కాలితో తన్నాడు. ఆమె అరుస్తున్నది. ఆ అరుపులకు రాము ఇంటిలోనుండివచ్చి మునసబు మీద కలియబడ్డాడు. రామును కూడా జుట్టుపట్టి ఆమెమీదకు ఈడ్చాడు.

ఈ రణగొణధ్వనికి జనం పోగవుతున్నారు. పక్కఇంటి నారాయణ వచ్చి మునసబు చెయ్యిపట్టి పక్కకు లాగాడు. మరికొందరు ఆడవాళ్లు, మగవారు పోగు కావడంతో అక్కడ ఉంటే తాను అభాసుపాలు కావలసివస్తుందని బయటికి వెళ్ళాడు మునసబు. రమణమ్మ ఇంతగా తెగిస్తుందని అతడు భావించలేదు. అలా భావించిఉంటే ఆమెను వదిలించుకునే వాడే! లక్ష్మిమీద పడటం తన తప్పని ఆలోచిస్తున్నాడు.

లక్ష్మి సమస్య లేకపోతే ఈ రాద్ధాంతం అవసరంలేదు. అందిన అవకాశాన్ని విని యోగించుకోవాలనుకున్నాడు. బావిలోపడి చస్తుందనుకోలేదు. ప్రెసిడెంటును ఇంత వరకూ తాను సాధించాడు. అతడి దొంగ సొత్తు తాను అమ్మకు తిన్నాడు. శాస్త్రి బతుకు బజారుపాలు చేశాడు. వాళ్ళిద్దరు తనమీద కత్తిగట్టి సాధించడానికి సిద్ధపడతారు. మెడికల్ రిపోర్టు ప్రకారమైతే తానే ఇరుక్కోవలసి వస్తుంది. ముందుగానే ఇన్స్పెక్టరును ఆకట్టుకోవాలని పట్నం ప్రయాణమయ్యాడు.

* * *

పన్నెండు గంటలకు ట్రాక్టరు వచ్చింది. రమణమ్మ, రాము ఇంటికి తాళంవేసి ట్రాక్టరు ఎక్కారు. దేవాలయంవద్ద శాస్త్రి, ప్రెసిడెంటు, మరి కొందరు ఎక్కారు. ఒంటిగంటకు పట్నం చేరింది. సరాసరి డి.యస్.పి. ఆఫీసు వద్దకు తీసుకువెళ్లారు. గల్లంతయిన కేసులో డి.యస్.పి.కి లంచంకట్టి సరాసరి సంబంధాలు ఏర్పరచుకున్నాడు ప్రెసిడెంటు. పోలీసులతో ఒకసారి సంబంధం ఏర్పరచుకుంటే తర్వాత ఎన్నిసార్లయినా నిరభ్యంతరంగా పోవచ్చు. ఎప్పుడు వచ్చినా డబ్బులు ముడతాయన్న ధ్యాస వారిది; డబ్బుఇస్తే పని అవుతుందన్న నమ్మకం వీరిది.

ప్రెసిడెంటు ముందు లోనికివెళ్ళి డి.యస్.పి.తో మాట్లాడి బయటకు వచ్చి వారిని లోనికితీసుకెళ్ళాడు. అందరినీ కూర్చోమన్నాడు డి.యస్.పి.

ముందుగానే తయారుచేసిన రిపోర్టు కాపీలు ఆమె అందించింది.

''డాక్టరు చనిపోయికూడా పదిహేను రోజులయింది కదా..ఇంతవరకూ ఎందుకు ఊరుకున్నావమ్మా? ఈ అమ్మాయి చనిపోయి కూడా మూడురోజులయింది'' అన్నాడు కాగితాలు పరిశీలిస్తూ.

"రిపోర్టు ఇచ్చే ధైర్యంలేకనే ఊరుకున్నానండీ! దీనికి కారకుడు గ్రామంలో బలమయిన వ్యక్తి. రిపోర్టుఇస్తే మమ్మల్ని కూడా చంపుతాడన్న భయం. అనుకున్నట్లుగానే ఈరోజు రిపోర్టు ఇస్తున్నానన్న విషయం తెలిసి ఉదయం వచ్చి

 

నన్ను మంచంమీదనుండి కిందికి ఈడ్చి, తన్ని అంతుచూస్తానంటూ బెదిరించి వెళ్ళాడు. మంచంమీదినుండి కిందికిలాగి నప్పుడు తగిలిన దెబ్బలు చూడండి" అంటూ మోచేతులు, కాళ్ళమీద దెబ్బలు చూపింది. రాము తనకు తగిలిన దెబ్బ చూపాడు.

డి.యస్.పి. ఇన్‌స్పెక్టరుకు ఫోన్ చేసి ఆ రెండు కేసులకు చెందిన పోస్టుమార్టం రిపోర్టులు తీసుకురావలసిందిగా ఆదేశించాడు.

మరో పావుగంటలో ఇన్‌స్పెక్టర్ వచ్చి శాల్యూట్ చేసి కాగితాలు అందించాడు.

"డాక్టర్ గొంతు పిసకడంద్వారానే మరణించాడనీ, మరణం ముందు భయంకర మైన వేదన అనుభవించాడనీ, అతడిగుండె తీవ్రమైన చలనానికి లోనయిందనీ, అక్కడక్కడ శరీరంనలిగినట్లు కనిపించిందనీ, ఆ నలగడం మనిషి కింద పడటం ద్వారా జరిగి ఉంటుందనీ రిపోర్టు రాశారు.

రెండవది : లక్ష్మి అనే ఆ అమ్మాయి మరణించడానికి సుమారు రెండుగంటల ముందు మానభంగం చేయబడి ఉంది. మానభంగం చేసే ముందు కొరకడం ద్వారా, గిచ్చడం ద్వారా అనేక గాయాలు ఉన్నాయి. ఆ తర్వాత నీరు ఎక్కువ పీల్చడం వల్ల, నీటిలో ఊపిరాడకపోవడం వల్ల చనిపోయింది"

రెండు రిపోర్టుల సారాంశం ఇది. అవి చదివిన తర్వాత "వీటి గురించి మీరేం చర్య తీసుకున్నారు?" అన్నాడు డి.యస్.పి.

"మాకు ఈ మరణాల గురించి ఎవరయినా చంపినట్లుగానీ, కనీసం అనుమానమున్నట్లుగానీరిపోర్టు చేయలేదు సార్! అందువల్ల మేము ఏమీ చర్యలు తీసుకోలేకపోయాము "

"కనీసం హతుల బంధువులతో ఈ విషయం మాట్లాడారా? హతులిద్దరూ అన్నా, చెల్లెళ్ళని అయినా మీకు తెలిసిందా?"

తెలియదన్నట్లు తలూపాడు ఇన్‌స్పెక్టర్.

"మునసబు రిపోర్టు ఆవిధంగా ఇవ్వలేదా?"

"డాక్టర్ మృతిసమయంలో మునసబు, ఆ అమ్మాయి మృతి సమయంలో కరణం రిపోర్టులు ఇచ్చారు. అందువల్ల వారికున్న సంబంధం ఆ రిపోర్టులలో ఎక్కడా లేదుసార్!"

డాక్టరు భార్యను చూపిస్తూ "ఆ డాక్టరు భార్య ఈమె. ఈరోజు ఆ రెండు మరణాల గురించి రిపోర్టు ఇస్తున్నది. ఇంతవరకూ ఆమె రిపోర్టు ఇవ్వలేకపోవడానికి కారణం గ్రామంలో బెదిరింపులే! తక్షణం చర్యలు తీసుకోనండి" అంటూ రిపోర్టులు ఇన్‌స్పెక్టర్‌కు అందించాడు

ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయాడు.

"సరే.... వెళ్ళండి! వెంటనే చర్య తీసుకుంటాను"

అందరూ లేచారు. డి.యస్.పి.కి నమస్కారం చేసి బయటకు వచ్చారు. ప్రెసిడెంటు మరి కొంతసేపు తర్వాత బయటకు వచ్చాడు. ట్రాక్టర్ ఎక్కి హాస్పటల్ వద్దకు వెళ్ళాడు.

ప్రెసిడెంటు నమస్కారం చేసి వచ్చినపని చెప్పాడు. ఆమెను తీసుకువచ్చి డాక్టర్ ముందు కూర్చోబెట్టాడు. డాక్టరు ఆమెను కిందనుండి మీదవరకూ చూసి పడుకోబెట్టి స్టెతస్కోపుతో పరీక్షించాడు. కళ్ళు [illegible]చి, లైటువేసి చూశాడు.

పొట్ట తడిమి చూశాడు. బి.పి. చూశాడు.

"భయంకరమైన సంఘటనలేమైనా ఈమధ్య చూశావా?" అన్నాడు డాక్టర్. ప్రెసిడెంటు ఆమె కథ వివరంగా చెప్పాడు. ఆ తర్వాత ఆమెకు పిశాచం పట్టించన్న పేరుతో యంత్రాలు, చేతబడి విరుగుడు చేయడం వివరాలు చెప్పాడు. అంతా విని నవ్వి అన్నాడు డాక్టర్–

"ఆమె మానసికంగా బాధపడుతున్నది. మీరు చెప్పారు కదా...అలాంటి భ్రమలవల్ల కూడా ఆమెలో విపరీతమైన భయం చోటుచేసుకుంది. వీటికితోడు భర్త మరణం, కలలు రావడం లాంటివల్ల కూడా ఆమె భయపడిపోయింది. ఆ భయంతో ఏర్పడ్డ మానసిక వేదన తప్ప ఆమెలో శారీరకంగా ఏ లోపమూ లేదు. ఆమె మానసికంగా విశ్రాంతి పొందాలి. అందే ఈ భయాలకు దూరంగా నిశ్చింతగా ఉండాలి. అప్పుడే ఆమె పూర్వస్థితికి వస్తుంది" అన్నాడు డాక్టర్ ఆమెవైపు చూస్తూ. ఎర్రటి శరీరచ్ఛాయ పేలవంగా ఉంది.

"మందులేమైనా వాడమంటారా?"

"వాడవచ్చు. కానీ వాటికంటే కూడా మానసికంగానే విశ్రాంతి, ఉల్లాసం, ఒంటరితనం లేకుండటం, ఎప్పుడూ ఏదో మాట్లాడుతూ, ఏదో వ్యాపకం కల్పించుకోవడం, పాతస్మృతులు మరచిపోయే విధంగా ఉండాలి. ఉదాహరణకు ఉదయం ఆరుగంటలకు లేచిందనుకోండి_ఆరునుండి రాత్రి పదిగంటల వరకూ ఏదోపని, ఏదో మాట ఉల్లాసపూరితంగా మాట్లాడే స్థితి చుట్టూ ఉండాలి. ఆమె అందులో లీనం కాగలిగితే ఏ మందులూ అవసరం లేదు. ఆ పని చేయండి. శరీర నీరసానికి మందులు రాసి ఇస్తాను" అంటూ డాక్టర్ కాగితం మీద మందులు రాశాడు. చీటీ చూసి మడిచి జేబులో పెట్టుకున్నాడు ప్రెసిడెంటు. ఆమెను తీసుకొని బయటకు వచ్చాడు. ట్రాక్టర్ ఎక్కి గ్రామం చేరాడు.

"ఒంటరిగా ఉంటే ఏం జరుగుతుందో తెలుసుకదా! శాస్త్రిగారి ఇంటిలో ఉంటే పిల్లలతో పొద్దుపోతుంది. ఉండగలిగితే చూడు" అన్నాడు ప్రెసిడెంటు. శాస్త్రి కూడా ఆమెను తన ఇంటిలో ఉంచుకోవాసికి అంగీకరించాడు. ఆమెను ఒంటరిగా పెడితే మునసబు ఆమెను ఏమైనా చేయవచ్చనీ, ఆవిధంగా కేసు రూపులేకుండా చేస్తాడన్న భయం ఉంది. మునసబు పీడ పోవాలంటే రమణమ్మ అనే భూతం బతికే ఉండాలి. ఆమె ఒంటరిగా ఉండే కష్టం! అందుకొరకు ఒప్పుకున్నాడు.

"సరే.... మీ ఇష్టమండీ" అంది రమణమ్మ. అంతకుమించి ఆమె అనగల స్థితిలో లేదు. తనకు రక్షణ కావాలి, ఆరోగ్యం బాగుకావాలి, తనను నాశనం చేసినవాడిని నాశనం చేయాలి. వీటిని మరొకరికి దాసోహం అనకుండా తాను సాధించలేదు. శత్రువు శత్రువు మిత్రుడన్న సామెత ఆమె నెమరు వేసుకుంది నిట్టూరుస్తూ!

మునసబు పట్నం చేరేసరికి చాలా ఆలస్యమయింది. రోడ్డుమీద బస్సు సమయానికి అందలేదు. బస్సు అంది పట్నం చేరేసరికి దాదాపు రెండు గంటలు కావస్తున్నది. బజారులో కనీసం కాఫీ కూడా తాగకుండా రిక్షా ఎక్కి పోలీసు స్టేషన్ చేరాడు. పోలీసులతో చాలా సందడిగా ఉంది స్టేషన్! ఎక్కడికో ప్రయాణమవుతున్నట్లున్నారు. బూట్లు, లాఠీలు,

టోపీలు వెతుక్కుంటున్నారు. బెల్టులు కొందరికి ఉన్నాయి. మరికొందరికి లేవు.

ఇన్‌స్పెక్టరు ముందుకువచ్చి సమస్కారం చేసి నిలబడ్డాడు.

మునసబును చూస్తూనే తల ఊపాడు ఇన్‌స్పెక్టర్. "రావయ్యారా! నీ కోసమే మీ వూరు బయలుదేరుతున్నాం. రెండు హత్య కేసులు నీమీదకు వచ్చాయి" అన్నాడు.

"నాకేం తెలియదు సార్! కావాలని ఆ ప్రెసిడెంటు నన్ను ఇరికిస్తున్నాడు. వాడు చేసే తప్పుడు పనులను నేను బయటపెడుతున్నానని వాడి కక్ష. నన్ను అడ్డులేకుండా చేయడానికి అతడి ప్రయత్నం" అన్నాడు ఆందోళనగా.

"అదంతా నాకేం తెలియదు. రెండు శవాలను పరీక్షించిన డాక్టర్లు హత్య జరిగినట్లే అభిప్రాయపడేవిధంగా రిపోర్టులు ఇచ్చారు. అందువల్ల తప్పనిసరిగా నమ్మవలసిఉంది. వాటికి కారణం తార్కికంగా ఆలోచించినా, రిపోర్టు ఇచ్చిన వ్యక్తి ఉద్దేశమైనా నువ్వే! నిన్ను అరెస్టు చేసి తీసుకరమ్మని దొరగారి ఆర్డరు. అందుకే ఇదుగో పోలీసులు కూడా తయారవుతున్నారు కదలడానికి"

మునసబు ముఖం ఆందోళనతో పాలిపోయింది. జేబులో చెయ్యిపెట్టి నోట్ల కట్ట బయటకు లాగాడు. ఈ సమయంలో అవి మాత్రమే కాపాడుతాయని అతని ఉద్దేశం.

"ఎంత ?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కట్టను చూస్తూ.

"పదివేలు"

"పదివేలకొరకు నిన్ను కాపాడాలంటే నా చేతకాదయ్యా! ఇంత బలంగా కేసు ఉంటే ఈ సమయంలో నా చేతిలో ఏమీ లేదు. అంతా దొరగారే చూసుకుంటున్నారు" ముఖం గంటుపెట్టి అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ప్రస్తుతం ఇది ఉంది. మళ్ళీ ఇచ్చుకుంటాను సార్" అన్నాడు మునసబు దీనంగా ముఖంపెట్టి.

ఇన్‌స్పెక్టర్ బెదిరింపు కూడా అదే! ఎంత దొరకడానికి వీలుందో అంత రాబట్టాలనే అతడు ఆలోచిస్తున్నాడు. ఇటువంటివారితో కాకుంటే ఇంకెవరితో రాబడతాడు? పిక్‌పాకెట్‌గాళ్లు, జేబుదొంగలు ఇచ్చే డబ్బు కానిస్టేబుళ్లకే చాలదు. పెద్ద కేసులయితేనే కొంత చెయ్యి తడుస్తుంది. అందువల్ల వస్తూనే బెదిరించే కార్యక్రమానికి దిగాడు. మునసబు అవసరంకాబట్టి దిగిరాక తప్పలేదు.

"మీ ఊరికి బయలుదేరుతున్నాం! ఆ ముండ ఉంది చూడూ...దాని పేరు రమణమ్మట! రిపోర్టు ఇచ్చి వెళ్ళింది. దానివెంట మీ ఊరి ప్రెసిడెంటుగాడు, మత్తుమందు కేసులో ఇరికించిన శాస్త్రి గాడు కూడా ఉన్నారు. వెంటనే ఎంక్వయిరీ చేయమని దొరగారు ఆదేశించారు"

"శాస్త్రిని నేను పట్టించానని నామీద కారాలు నూరుతున్నాడు సార్! ఈ కేసులో నన్ను తోసి, లోపలకు నెడితే అడ్డుండదని వాళ్ళ ఆలోచన. సమయానికి ఆ ముండ కూడా వారి వలలో పడింది"

"అదిసరే! ఈరోజు ఉదయం దాన్ని కొట్టావట ఎందుకు?"

జరిగిందంతా చెప్పాడు మునసబు. ఇన్‌స్పెక్టర్ తల ఊపి "సరే! ఊర్లోనికి నువ్వెందుకు? ఇక్కడే ఉండు. నేను వెళ్ళివస్తాను" అంటూ లేచాడు. మునసబు వెళ్ళిపోయాడు. నలుగురు పోలీసులను



తీసుకొని వ్యానులో బయలుదేరాడు ఇన్‌స్పెక్టర్.

సాయంత్రం నాలుగుగంటలకు గోపల్లె చేరారు. సమయానికి శాస్త్రి, ప్రెసిడెంటు సిద్ధంగా ఉన్నారు. వ్యాను పంచాయతి ఆఫీసువద్ద నిలిపి అక్కడి నుండి [illegible] బావిలోపర్ల ఇంటివద్దకు వచ్చారు. పోలీసులతోపాటు ఊరి పిల్లలు కూడా చెంకలు కొట్టుకుంటూ వచ్చారు. జనం ఆ ఇంటివద్ద గుమిగూడుతున్నారు. తలుపు తెరచి బావివద్దకు వచ్చి చూశారు.

ప్రెసిడెంటు కూడా అక్కడికి వచ్చాడు. అతన్ని చూసి తల ఊపి "ఆమె ఎక్కడుంది?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"శాస్త్రిగారి ఇంటివద్ద ఉంది సార్! ఇక్కడ ఒంటరిగా ఉండాలంటే భయపడుతున్నది. అందువల్ల అక్కడికి చేర్చాము. ఉదయం జరిగిన రగడఅంతా ఈ చుట్టుపట్ల చాలామంది విన్నారు" అన్నాడు.

"ఎవరో పిలిపించు"

నారాయణను, తులశమ్మను మరి కొందర్ని అక్కడికి తెచ్చాడు ప్రె



డెంటు.

"ఏమమ్మా ! ఉదయం మునసబు ఇక్కడికి వచ్చాడా?"

"వచ్చాడండీ! తొమ్మిది గంటల ప్రాంతంలో వచ్చాడు"

"వచ్చి ఏం చేశాడు?"

"ఇంటిలోనికి వెళ్ళడం చూశాను. కొంచెంసేపటిలో రమణమ్మ ఏడ్పువిని లోపలికి వెళ్లాను. మునసబు ఆమె జుట్టు పట్టుకుని కాలితో తన్నుతున్నాడు. అడ్డువచ్చిన రాముడు కూడా జుట్టుపట్టి ఆమెమీద పడేశాడు"

"అతడు ఇద్దర్నీ జుట్టుపట్టి కొట్టేదాకా నువ్వు చూస్తూనే నిలుచున్నావా? అడ్డు పోలేదా ఏం?"

"ఆడదాన్ని నేనేం చేస్తాను? అంత లోనే నా కొడుకు నారాయణ వచ్చి మున సబును పక్కకులాగాడు. జనం చాలా మంది గుమికూడారు. మునసబు తల వంచుకుని ఇక్కడినుండి వెళ్ళిపోయాడు"

ఆమె చెప్పింది నోట్సులో రాసు కున్నాడు. అక్కడినుండి శాస్త్రి ఇంటి వద్దకు వచ్చి రమణమ్మతో మాట్లాడాడు.

"అతడు ఆ సమయంలో ఎందుకు నిన్ను కొట్టాడో చెబుతావా?"

"కేసు పెట్టడానికి నిర్ణయించుకుని ఈరోజు బయలుదేరాలనుకుంటున్నాను. నా దగ్గరకువచ్చి కేసు పెట్టవద్దనీ, పెడితే నన్నూ బతుకనివ్వనన్నాడు"

రాసుకున్నాడు. "నీ భర్తను చంపింది అతడేనని రిపోర్టు ఇచ్చావుకదా? అందుకు ఆధారాలేమిటి? అతడిని చంపుతుంటే మునసబును చూసినవారున్నారా?"

"ఎవరయినా చూశారో నాకు తెలి యదు. కాని ఆ అవసరం మునసబుకు





తప్ప ఎవరికీలేదు. వాళ్లిద్దరూ మత్తుమందు దొంగవ్యాపారంలో భాగస్వాములని మీకూ తెలుసు. వారిద్దరిమధ్యా వ్యవహారం బెడిసిందని నా భర్త నాకు చెప్పాడు. ఆ విషయం చెప్పిన రెండవరోజే చని పోయాడు''

''అతన్ని దయ్యం చంపిందనీ, పిశా చాలు అక్కడున్నాయని కదా అందరూ అనుకున్నది, మరి మునసబు ఎట్లా చంపాడు?''

"ఆ పిశాచం మునసబే! మరో పిశాచం అక్కడలేదు. పిశాచాలదంతా వట్టికథ! హత్యను మాఫీచేయడానికి చేసిన ప్రయత్నమే అది''

"పోనీ అతన్ని చంపుతుంటే చూసిన వారున్నారా?''

"నా అనుమానం నేను చెప్పాను. ఆ తర్వాత దాన్నిగురించి పరిశోధించాల్సి నది మీరు. మునసబే చంపాడో, మరొకరు చంపారో మొత్తానికి చంపబడ్డాడన్న సంగతి మీకూ తెలుసు''

ప్రెసిడెంటు అక్కడికి వచ్చాడు. అతడివెంట కాఫీకప్పులు పట్టుకుని మనిషి వచ్చాడు. ఆమెకు, అతడికి కాఫీఇచ్చారు. కాఫీతాగి ఇన్‌స్పెక్టరు బయటకు వచ్చాడు.

''మునసబు గ్రామంలోనే ఉన్నాడా?'' అన్నాడు.

"ఉదయం ఆమెను కొట్టిన తర్వాత రోడ్డుమీదకు వెళ్లాడని తెలిసిందండీ! ఊరిలో మాత్రం కనిపించలేదు''

వ్యాసువద్దకు వచ్చారు. అతన్ని అరెస్టు చేసే ఏర్పాటుచేస్తామని చెప్పాడు ఇన్ స్పెక్టరు.

''నాకు రక్షణ కావాలండీ! నామీద తిరిగి దాడిచేస్తాడేమోనని భయంగా ఉంది. ఉదయం సంఘటన తర్వాత మరింతగా భయం వేస్తున్నది'' అన్నది

రమణమ్మ.

"ఎందుకూ? వాడిని రేపటిలోగా అరెస్టు చేయకుండా విడిచిపెట్టం! తప్ప కుండా అరెస్టు చేయిస్తాను. ప్రెసిడెంటు గారు నీకు అండగా ఉన్నాడు కదా!" అన్నాడు వ్యాసు ఎక్కుతూ.

వ్యాసు కదలిపోయింది.

ప్రెసిడెంటు, రమణమ్మ, శాస్త్రి తిరుగు ముఖం పట్టారు. జనం వినోదంగా చూసి చూసి, విసుగుపుట్టి ఇళ్ళకు సాగారు.

"మరికొంత పీళ్ళకు చేతులు తడిపితే గానీ తొందరగా వాడిని పట్టుకోరు. నా దగ్గరకూడా డబ్బులేదు సమయానికి" అన్నాడు ప్రెసిడెంటు చేతులు పిసుక్కుంటూ.

"రమణమ్మ బంగారు నగలున్నాయిగా! ప్రస్తుతం అవి తాకట్టుపెట్టి కొంత డబ్బుసర్దితే తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు శాస్త్రి.

ఆ మాటకొరకే ప్రెసిడెంటు ఎదురు చూస్తున్నాడు. తన ఉద్దేశం శాస్త్రి బాగా పసికట్టగలిగాడనుకున్నాడు. రమణమ్మ పరిస్థితి కత్తెరమధ్య ఇరుక్కున్న గుడ్డ ముక్కలా అయింది. "ఇంతవరకూ అతడు యాభై వేలు ఖర్చుపెట్టినా తన కొరకు కాదు. తన శత్రువును సాధించ డానికి! ఇప్పుడు తాను వారిమధ్య ఇరుక్కుంది. ఎలాగూ తప్పించుకోలేనని వారి ఉద్దేశం. మెల్లగా తనదగ్గరున్న బంగారు వస్తువులకు ఎసరుపెడుతున్నారు. ఇవ్వకుంటే తన బతుకు బజారుపాలు! ఇస్తేపీధిపాలు! ఎలాగయినా తాను భ్రష్టు పట్టక తప్పదు. బంగారు నగలైన తర్వాత ఇంటిని మాత్రం ఎందుకుంచుతారు? ఆలోచిస్తున్నది.

"రమణమ్మ పలకడంలేదు. తన బంగారం పోతుందని భయంగా ఉన్నట్లుంది" పక్కనున్న వ్యక్తి నవ్వుతూ అన్నాడు ఎగతాళిగా.

"ఎందుకు పలుకదూ? ఆమె బంగారు ఎక్కడికి పోతుంది? తిరిగి వచ్చేదేగా!" అన్నాడు శాస్త్రి ఆమె ముఖంలోనికిచూసి.

"కానివ్వండి శాస్త్రిగారూ! అవసరానికి ఇవ్వకుంటే ఎట్లా?" అంది రమణమ్మ చివరకు. తాను బురదగుంటలోనుండి ఊబిగుంటలోనికి వచ్చాననుకుంది. 'ఒకరినొకరు వాళ్ళు సాధించుకోడానికి మధ్యన తనను ఇరికిస్తున్నారు' అనుకుంది.

ఇంటికివచ్చి సూట్‌కేసు తెరచి, అందులోనున్న నగలు కిందపోసింది. దాదాపు కిలోదాకా ఉంటుందనుకున్నారు. అవన్నీ గుడ్డలోమూటకట్టి చేతిలోకి తీసుకున్నాడు ప్రెసిడెంటు.

అతడు వెళ్ళిపోయిన తర్వాత ఏడుస్తూ పడుకుంది రమణమ్మ!

రాము ఆమె దగ్గరకు వచ్చాడు. "వదినా! నేను కర్నూలు వెళ్ళిపోతాను. ఇక్కడుండి చేసేదేమీలేదు" అన్నాడు నిలబడి.

కళ్ళుతుడుచుకుని అతడివేపు చూసింది. రాము భవిష్యత్తయినా బాగుపడాలి. తానుకూడా తన భర్తలాగే పతనం కావచ్చని పరిస్థితులు తెలుపుతున్నాయి. తన తర్వాత రాము మరింత ఏకాకయిపోతాడు. అతడికి తాను ఇవ్వవలసింది చాలా ఉంది. కానీ తనదగ్గర మిగిలి ఏమీలేదు. "ఉదయమే వెళ్ళవుగానీ" అంది. మరేం మాట్లాడలేదు రాము. ఈ పరిస్థితిలో ఉండదలచుకోలేదు. అయినవాళ్ళు ఎవరూలేరు. ఈమె ఈవిధంగా చెడిపోతున్నది. కనీసం వారాలకూడయినా తిని చదువుకోక తప్పని పరిస్థితి. ఈమెను

అంటిపెట్టుకుని ఉంటే తన చదువూ పాడవుతుంది. ఈమె బాగుపడుతుందన్న నమ్మకంలేదు. నిన్నటిదాకా మునసబు వలలోపడి చేపలా గిలగిలకొట్టుకుంది. ఊపిరి తీసుకోవాలని ప్రెసిడెంటు పంచన చేరుతున్నది. ప్రెసిడెంటు కూడా ఈమెను వాడుకోడానికి ఎక్కువ రోజులు సమయం లేదు. అతడి కాళ్ల కింద పడి తనను తాను రక్షించుకోలేని స్థితికి వస్తుంది. అటువంటప్పుడు తాను ఉండి చేసేదేమిటి?

రాత్రంతా దీర్ఘంగా ఆలోచించింది రమణమ్మ. ఆమె వద్ద మిగిలిన వస్తువులు బంగారు పోగులు, నాలుగు గాజులు, రెండు పేరల గొలుసు. వాటితోపాటు ఇల్లు అతని పేరుతో రాసేస్తే ఎంతో కొంతకు అమ్ముకుంటాడు. తన బతుకు తర్వాత ఆలోచించవచ్చు అనుకుంది.

ఉదయమే రామును పిలిచి ఉన్న బంగారు వస్తువులు అతడి చేతిలో పెట్టింది. అతడి చేతులు పట్టుకుని, కన్నీళ్లుకారుస్తూ– "ఇంతకంటే ఇంకేం ఇవ్వలేను బాబూ! ఇల్లు నీ పేరనే పెడతాను. నేను చచ్చిన తర్వాత అది అమ్ముకో" అంది. రాము కూడా బిగ్గరగానే ఏడ్చాడు. తర్వాత కళ్ళు తుడుచుకొని సూట్ కేస్ తీసుకొని వెళ్లిపోయాడు.

శాస్త్రికి సంతోషంగా ఉంది. రమణమ్మ బతుకు వీధిపాలు అవుతున్నది. మునసబు ఇక జీవితంలో ఊరిలోనికి రాలేడు.

మధ్యాహ్నం ప్రెసిడెంటు ఇంటికి వెళ్లాడు శాస్త్రి. ఉదయం జరిగింది చెప్పాడు. ప్రెసిడెంటు పకపక నవ్వాడు. "నన్ను చెప్పుతో కొట్టింది అది. దాన్ని నేను మరచిపోలేను. వాడిని సాధించాలంటే దీన్ని అడ్డుపెట్టుకోవాలి. అందుకే చేరదీశాను. వాడి పని అయిపోతే, ఇది వీధిపాలు కావలసిందే" అన్నాడు కళ్ళు ఎగరేస్తూ.

"అంత పనెందుకు? కుక్కలా కాళ్ల కింద పడి ఉంటుంది. ఇంట్లో పశువుల వద్ద పనిచేయడానికయినా పనికివస్తుంది కదా. ఆవిధంగా ఒక పాలేరును తగ్గించుకోవచ్చు" అన్నాడు శాస్త్రి వెటకారంగా.

ప్రెసిడెంటు చిరునవ్వునవ్వాడు.

మునసబు ఇన్‌స్పెక్టర్ని రెండోసారి కలిశాడు. అతడిని చూసి చిరునవ్వునవ్వి "నువ్వు తప్పించుకోవడం సాధ్యం కాదయ్యా. చాలా పకడ్బందీగా నిన్ను ఇరికించారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

* * *

మునసబు దిగులుగా ఆయన వైపు చూశాడు. "అసలు ఆ రెండు కేసుల్లోనూ నా ప్రమేయం ఏం లేదండీ" అన్నాడు.

"ఆ పిల్లను చంపిన కేసులో నీ ప్రమేయం లేదంటావా?"

"లేదండీ! అది ఎప్పుడు బావిలో దూకిందో, ఎవరయినా చంపి అందులో వేశారో నాకు తెలియదు. ఆరోజు నేను ఇక్కడే ఉన్నాను"

"ఏమో! మా విచారణ ఇంకా మొదలు కాలేదు. సేకరించిన కొన్ని విషయాలను బట్టి రెండు హత్యలకు నువ్వే ప్రధాన కారకుడిగా అర్థమవుతున్నది. పైగా సాక్ష్యాలు బలంగా ఉన్నాయి. తప్పుకోవడం అసాధ్యం! తప్పించడం నా చేత కూడా కాదు" అన్నాడు పెదవి విరిచి.

"ఎంత డబ్బయినా ఖర్చు పెట్టగలను సర్! ఈ విషయంలో మీరు నాకు సహాయం అందివాలి. లేకుంటే నా గతి అధోగతి అవుతుంది" అన్నాడు మునసబు. ఇన్‌స్పెక్టర్ అతడి వైపు చూశాడు. నిన్నటికి, ఈరోజుకూ

ఎంతో తేజా ఉంది. నెలరోజులుగా మంచంలో పడ్డ రోగిలా ఉన్నాడు.

"మా ద్వారా నిన్ను రక్షించడం ఎంతమాత్రం సాధ్యం కాదు. పైగా కేసు డి.యస్.పి.గారుపర్యవేక్షిస్తున్నారు. మహా అయితే వారం పది రోజులు నిన్ను అరెస్ట్ చేయకుండా ఉండమంటే ఉండ గలను. ఒక పని చెయ్యి. ప్రెసిడెంటు గాడితో రాజీ చేసుకునే వీలుంటేచూడు. తాత్కాలికంగా ఈ కేసులయినా నీ మీద లేకుండాపోతాయి. ఆ తర్వాత మీరు మళ్లీ పోట్లాడుకోవచ్చు" సలహా ఇచ్చాడు ఇన్‌స్పెక్టర్.

"ఈ విషయంలో రాజీకి వెళ్తే తన కయిన నష్టం ఇవ్వాలంటాడు. తన మీదకు వచ్చిన కేసును పరిష్కరించాలంటాడు. శాస్త్రి మీదున్న కేసూ పరిష్కరించాలం టాడు. డబ్బు అయితే చెల్లించగలను గానీ, ఈ కేసులు నా స్వాధీనంలో లేవు కదా...నేనేం చేయగలను?"

"ప్రెసిడెంటుగాడి మీదున్న కేసు ఎలాగూ నిలవదు. వాడు ఇప్పటికే ఎన్నో భూతాల్ని అడ్డుపెట్టి నింపాదిగా కూర్చు న్నాడు. ఇక శాస్త్రి కేసు విషయానికి వస్తే, సాక్ష్యాలు లేకుండా ఏ కేసూ నిలవదు.ఇప్పుడు ఉన్న సాక్షులు అందరూ నీ మనుషులే. వారిని సాక్ష్యం చెప్ప కుండానో, తప్పుడు సాక్ష్యమో చెప్పిస్తే ఆ కేసూ తేలిపోతుంది"

మునసబు మాట్లాడలేదు.

ఇన్‌స్పెక్టర్ మళ్లీ అన్నాడు "నాలుగ యిదు లక్షల రూపాయల కొరకు చూసు కోకు. ఈ కేసులు రెండూ తగులుకున్నా యంటే నీ గొంతుకు తాడు పడ్డట్టే! బతికుంటే ఓ సంవత్సరం వ్యాపారంలో ఈ డబ్బు సంపాదిస్తావ్. చచ్చి సాధించే దేమీ ఉండదు"

మునసబు పలుకలేదు. తాను ప్రెసి డెంటుకు లొంగినట్లవుతుంది. ఈ రాజీకి ప్రెసిడెంటు ఎంతవరకు దిగివస్తాడో తెలియదు. వచ్చినా కనీసం నాలుగు లక్ష లకు నీళ్లు ఒదులుకోవాలి. తిరిగి గ్రామంలో అతడితో ఎప్పుడయినా ఎదురు పోటీయే, పోట్లాటలే. బహిరం గంగా తలపడే స్థితిలో గ్రామస్థులు, నాయకులూ ఎవరూ లేరు. కాని, అవ కాశం ఏదో ఒకటి దొరికించుకుని ఒకరి నొకరు సాధించుకోడానికి, లొంగించు కోడానికి ప్రయత్నిస్తారు. అందువల్ల వాళ్లతో తప్పనిసరి పోరు. మరి ఇప్పుడు రాజీ చేసుకోక పోతే ఇన్‌స్పెక్టర్ అన్నట్లు గొంతు దాకా ఇరుక్కోవలసి వస్తుంది. తన డబ్బు తిన్నాడు కాబట్టి ఇతనీ మాత్రం వివరాలిస్తున్నాడు. అతడు తన వద్ద డబ్బు తీసుకోని పక్షంలో, ఏ రాజ కీయనాయకుని వెంటో తను పడాలి. ఆ నాయకుడు పోలీసులతో మాట్లాడు తున్నట్లు నటించి తనవద్ద డబ్బు లాగి వేస్తాడు. పోలీసులతో సరాసరి సంబంధా లుండడమే మంచిదయింది.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"ప్రెసిడెంటు అంగీకరిస్తాడంటారా?"

"ప్రయత్నం చేద్దాం. నీవు సిద్ధపడితే పిలిపిస్తాను....మాట్లాడదాం! అతని కేసు కూడా నావద్ద ఉంది గనుక నా మాట వినక తప్పదు"

"సరే! ప్రయత్నించండి సార్! మీరు ఎలాగ చెబితే అలాగే చేస్తాను. మీమాట కాదని నేను చేసేదేముంది?" అన్నాడు చివరకు మునసబు.

ఇన్‌స్పెక్టర్ తలూపాడు. "రేపు మాట్లాడదాం! అతన్ని పిలిపిస్తాను.

నువ్వేమీ మాట్లాడకు. మాట్లాడేదేదో నేనే మాట్లాడతాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.




మరుసటిరోజు ఒక కానిస్టేబుల్‌ను గోపల్లెకు పంపి, ప్రెసిడెంటును పిలిపించాడు. ఇన్‌స్పెక్టర్ ఎందుకు పిలుస్తున్నాడో తెలియకపోయినా కేసు ఒకటి ఉందిగనుక ఎందుకయినా మంచిది కలిసి మాట్లాడదామని వచ్చాడు.

అతన్ని చూసి చిరునవ్వు నవ్వి "రావయ్యా! నీకొరకే ఎదురుచూస్తున్నాను" అన్నాడు. వచ్చి ఎదురుగా కూర్చున్నాడు ప్రెసిడెంటు. ఇంటి దగ్గరికి తీసుకురావడమంటే బహుశా లంచం కొరకేమోనని ప్రెసిడెంటు ఉద్దేశం. దేశంలో ఎవడికీ లేనంత ఆశ ఈ ఇన్‌స్పెక్టర్‌కు ఉందని ప్రెసిడెంటు ముందే విచారించి తెలుసుకున్నాడు.

"మునసబు ఊరిలో ఉన్నాడా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఇంతవరకూ కన్పించలేదండీ! బహుశా పరారీలో ఉంటాడు. పోలీసులు వెతుకుతున్నారని తెలుసుకుని ఉంటాడు గదా!"

"అతనిమీద మీరు పెట్టించిన కేసులో పెద్దబలం లేదయ్యా! కాకపోతే డబ్బు ఖర్చవుతుంది. అతనికేకాదు ఇరువైపులా డబ్బు ఖర్చవుతుంది"

"కానివ్వండి! దిగిన తర్వాత ఖర్చును గురించి ఆలోచిస్తే ఎట్లా? అతడు చేసిన ఖర్మకు ప్రతిఫలం అనుభవించక తప్పదు"

ఇన్‌స్పెక్టర్ ప్రెసిడెంటు ముఖంవైపు చూశాడు.

"అనవసర తగవులాటలెందుకు. ఆ రమణమ్మ ఇద్దరికీ బంధువు కాదు. ఆమె కొరకు మీరు పోట్లాడుకోవడమెందుకు? సీత కోసం రాముడూ, రావణాసురుడూ పోట్లాడి కోతుల్ని, రాక్షసుల్ని చంపివేసినట్లు మీరిద్దరూ ఆమె కొరకు పోట్లాడి మధ్యన అనేక మందిని బాధ పెడుతున్నారు. రాజీ చేసుకుంటే మంచిది కదా!"

ప్రెసిడెంటు చిరునవ్వు నవ్వాడు.

"వాడితో రాజీయా! ఈరోజు మంది బిడ్డల్ని చెరచినా నేను రాజీ పేరుతో దాసోహం అంటే, రేపు నా పిల్లల్ని కూడా వీడు చెరచడానికి వెనుకాడడు. డాక్టరును నాశనం చేశాడు. అతడి పెళ్లాన్ని ఆక్రమించాడు. చివరకు ఆ పిల్లనూ చెరచి చంపాడు. వీడో కిరాతకుడు. ఎంతోమంది స్త్రీలను మానభంగంచేసి బతుకుతున్నాడు. మత్తుమందు వ్యాపారం వాడూ చేస్తున్నాడు. కానీ, మేమే చేస్తున్నామని చూపడానికి వాడు తంటాలు పడుతూ మమ్మల్ని ఇరికించాడు. వాడితో రాజీ చేసుకోవడమంటే, మా మెడకు తాడు బిగించుకోవడమే" అన్నాడు క్రోధంగా.

"జరిగినవి తవ్వుకుంటే ఏం లాభం? మీ తప్పులున్నాయి; అతడి తప్పులున్నాయి. అందువల్ల ఉభయులు సర్దుకుని పోవడం మంచిది. అవిధంగా ఇద్దరూ

చిక్కులనుండి బయటపడతారు"

"ఈ రాజీపథకం నాకిష్టంలేదండీ! మాకు రాజీ అవసరం కూడా లేదు" నిక్కచ్చిగా అన్నాడు ప్రెసిడెంటు గోవర్ధనం.

"నీకేసు అతడి చేతిలో ఉంది. అతడు మత్తుమందుల దొంగవ్యాపారిగా గుర్తు పట్టబడలేదు ఇంకా. కాని, నీపేరు లిస్టు లోనికి వచ్చింది. దానివల్ల భవిష్యత్తులో నీ పేరు చెడిపోవచ్చు"

"నాకేం భయంలేదు. నామీద కేసయితే మోపారు గానీ నిరూపించలేదు...నిరూపించనూలేరు"

"అదేం పెద్ద సమస్యగాదు. పోలీసులు తలుచుకుంటే బమ్మిని తిమ్మి చేయగలరు. ఇద్దరూ రాజీపడండి. అతన్ని పిలిపిస్తాను. అతనివల్ల నీవు కొంతసరుకు నష్టపోయావు గనుక, పరిహారం రాబట్టి ఇప్పిస్తాను. కలతలు మానుకోవడం ఇద్దరికీ శ్రేష్టం"

"అది అసాధ్యం! మీరు ఇంకోపని ఏదయినా చెప్పండి; చేసి పెడతాను. ఈ విషయంలో మాత్రం సాధ్యంకాదు. గ్రామంలో వాడో, నేనో ఉండాలి. ఇంత మంచి అవకాశం నాకు భవిష్యత్తులో దొరకకపోవచ్చు. దొరికినదాన్ని విడిచి పెట్టలేను"

పోలీసు అఫీసరు ముందు అంత ఖచ్చితంగా మాట్లాడుతున్న అతని ధైర్యాన్ని మెచ్చుకున్నాడు ఇన్‌స్పెక్టర్ ఆ ఖచ్చితమైన మాటలవెనుక ఉన్నబలం కూడా ఈమధ్యనే చూశాడు గనుక అతడితో పెద్దగా మాట్లాడినా లాభం ఉండదని తెలుస్తూనే ఉంది.

"మీయిష్టం! ఇద్దరిమీదా కేసులున్నాయి గనుక సర్దుతుని పోతారేమోనని పిలిపించాను. మీరు కలుసుకోడానికి ఇష్టపడకపోతే మేము చేసేదేముంది? నువ్వు వెళ్ళొచ్చు"

ప్రెసిడెంటు లేచాడు. బయటకు వచ్చి రిక్షాఎక్కి లాయరుదగ్గరకు వెళ్లాడు. ఇన్‌స్పెక్టర్ చెప్పిన విషయాల్ని, తాను మాట్లాడిన వివరాలు ఆయనకు చెప్పాడు.

"అదేమంచిది. నీమీద కేసుకు బలం లేదు. అది తుస్సున పేలిపోతుంది. కాగా వాడి కంఠానికి ఉరిపడే కేసు. దానిని విత్‌డ్రా చేసుకోకూడదు" అన్నాడు లాయర్.

లాయర్ కూడా తనలాగే మాట్లాడి నందుకు సంతసించి గోపల్లెకు బయలు దేరాడు. తోవలో దేవాలయం వద్దనే శాస్త్రి కలిశాడు. శాస్త్రికి వివరాలుచెప్పి, లాయరు మాట్లడిన మాటలు కూడా చెప్పాడు.

"అయితే మునసబుగాడు ఇన్‌స్పెక్టర్ రక్షణలోనే ఉన్నాడన్న మాట. వాడు వెనుక ఉండి పీడిచేత రాజీ చేయించే పథకం అనుసరిస్తున్నాడు. వాడు తిరిగి గ్రామంలోనికి వస్తే మనల్ని ఊడ్చేస్తాడు" అన్నాడు శాస్త్రి ఆందోళనగా.

"ఎందుకు ఒప్పుకుంటామయ్యా! ఇంత మంచి అవకాశం మళ్ళీ దొరకదు. దొరికిం దాన్ని వదులుకోవడం బుద్ధితక్కువ"

శాస్త్రి నవ్వాడు. అక్కడినుండి శాస్త్రి గారి ఇంటికి వచ్చారు. రమణమ్మ మంచంలో కూర్చుని ప్లాస్టిక్ బుట్టలు అల్లడం సీతకు చూపిస్తున్నది. ఆమె ఆరోగ్యం చాలా బాగుంది. మనోవ్యాధి, పిశాచాల బాధ పోయిన తరువాత దిన దినానికి ఆరోగ్యం మెరుగుపడుతున్నది. ఈ నాలుగు రోజుల్లోనే దాదాపు మామూలు స్థాయికి వచ్చింది. వీరిని చూసి పమిట సర్దుకుని చేతిలోఉన్న బుట్ట సీతకు ఇచ్చి...



"మునసబు రాజీ పథకానికి వచ్చాడు" అంటూ జరిగింది చెప్పాడు ప్రెసిడెంటు. రమణమ్మ తీక్షణంగా చూసి "నన్ను కూడా చంపడానికి వాడు ప్లాన్ వేస్తున్నాడేమో? అందుకే రాజీకి వచ్చి ఉంటాడు" అంది. మునసబు బయటకువస్తే తనకు ప్రమాదమని ఆమె భయం.

"నేను ఎందుకు ఒప్పుకుంటాను? మునసబుగాడు ఈ దెబ్బతో స్వర్గలోకం చేరాలి" అన్నాడు ప్రెసిడెంటు. మరి కొంతసేపు అక్కడే ఉండి ఇంటికి వెళ్లాడు.



ప్రెసిడెంటు అటు ఇంటికి వెళ్లాడో లేదో ఇటు పోలీసు వ్యాను వచ్చి శాస్త్రి ఇంటివద్ద నిలిచింది. వ్యానునుండి బిల బిలమని పోలీసులు, ఇన్‌స్పెక్టర్ దిగారు. సరాసరి రమణమ్మ దగ్గరికి వెళ్ళాడు ఇన్‌స్పెక్టర్. అతన్ని చూసి ఆమె లేచి నిలబడింది.

"నీవు వెంటనే స్టేషన్‌కు రావాలి. కేసు గురించి కొంత సమాచారం కావాలి" అన్నాడు ఎదురుగా నిలబడి. శాస్త్రివైపు

చూసింది ఆమె. శాస్త్రి ఏమీ మాట్లాడలేక పోయాడు. ఈ వార్త విని ప్రెసిడెంటు పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆపాటికి రమణమ్మ వ్యాను వద్దకు వచ్చింది.

"ఏమిటండీ?" అన్నాడు ప్రెసిడెంటు.

"ఆమెతో కేసు గురించి మాట్లాడాల్సి ఉంది. అందువల్ల తీసుకెళ్తున్నాను. ఎక్కమ్మా... వ్యాను ఎక్కు" అన్నాడు. రమణమ్మ వ్యానువద్ద నిలబడిందిగాని ఎక్కలేదు.

"ఆ మాట్లాడవలసినవి ఇక్కడే మాట్లాడవచ్చుకదా! అంత దూరం ఎందుకు?" అన్నాడు ప్రెసిడెంటు అనుమానంగా.

"ఇక్కడ కుదరదు. అయినా కేసు పెట్టింది ఆమె. ఇందులో నీ ప్రమేయ మేమిటి? నీ విషయం కానప్పుడు నీవు మాట్లాడవద్దు" అన్నాడు కోపంగా ఉరిమి చూసి ఇన్‌స్పెక్టర్.

ఈమెను తీసుకెళ్ళి రాజీ చేయడానికి ఇన్‌స్పెక్టర్ ప్రయత్నం చేస్తున్నట్లు భావించాడు ప్రెసిడెంటు. ఈమెను తీసుకెళ్ళి దాచిపెడితే కేసు పూర్తిగా తేలిపోతుంది. ఆవిధంగా మునసబును రక్షించవచ్చు. ఇన్‌స్పెక్టర్ ఎత్తు ఇదే అయితే రమణమ్మను తీసుకెళ్ల కుండా చేయాలనుకున్నాడు. తన మాట విని పోలీసు వ్యాను చుట్టుముట్టేమనుషులు లేరు. అందువల్ల నోరెత్తలేకపోయాడు. రమణమ్మ వ్యానులో కూర్చుంటూనే చూకుడుగా కదిలిపోయింది వ్యాను.

శాస్త్రి బెంబేలు ముఖంతో నిలబడ్డాడు. ట్రాక్టరు తీసుకురమ్మని డ్రైవరును పురమాయించాడు ప్రెసిడెంటు. ట్రాక్టరు వస్తూనే శాస్త్రి, మరికొందరితో కలిసి ఎక్కాడు. ట్రాక్టర్ పట్నం చేరేసరికి రాత్రిఎనిమిదిగంటలయింది.డి.యస్.పి.ని గురించి విచారిస్తే అతడు క్యాంపు వెళ్లాడని తెలిసింది. ఏం చేయాలో అర్థం కాలేదు. తను నాయకుడి ఇంటివద్దకు వెళ్ళారు.

అప్పుడే నిద్రలో పడుతున్నాడు మాజీ లీడర్ నాగయ్య. వీరిని చూసి "ఏమిటి ఇప్పుడు బయలుదేరారు?" అన్నాడు.

విషయం తెలిపాడు ప్రెసిడెంటు.

"పద స్టేషన్‌కు పోదాం" అన్నాడు నాగయ్య. అక్కడినుండి స్టేషన్ చేరే సరికి స్టేషనుముందు వ్యాను ఉంది. ఇన్‌స్పెక్టర్ లేడు. యస్.ఐ. వద్దకు వెళ్ళి వివరాలడిగాడు నాగయ్య.

"స్టేషన్‌కు ఏ స్త్రీనీ తీసుకురాలేదండీ! నేనిప్పుడే వచ్చాను" అన్నాడు ఆయన.

"ఇన్‌స్పెక్టర్‌గారు ఎక్కడికెళ్లారు?" సెంట్రీని పిలిచాడు యస్. ఐ. "ఇన్‌స్పెక్టర్‌గారి గురించి తెలుసా నీకు?" అన్నాడు. సెంట్రీ తల ఊపాడు. "అరగంట క్రితం వచ్చి ఇంటికి వెళ్లాడు బాబూ" అన్నాడు.

"ఎవరినైనా స్త్రీని తెచ్చాడా?"

"లేదు బాబూ! వ్యాను ఎక్కడికో వెళ్ళి గంటసేపయింది. వ్యానులో కానిస్టేబుల్స్, ఆయనా తిరిగి వచ్చారు. వచ్చిన వెంటనే ఇంటికి వెళ్ళారు"

"అవసరమైతే ఇంటికి వెళ్ళి కలుసుకుంటారా?" అన్నాడు యస్.ఐ.

"తప్పకుండా కలుసుకుంటాం. కాస్త ఫోన్ చేసి తెలుసుకుంటారా?" అన్నాడు నాగయ్య.

యస్.ఐ. ఫోన్ ఎత్తి మాట్లాడి, "ఇప్పుడే ఇంటికి వచ్చి వెళ్ళారట! ఎప్పుడొస్తారో చెప్పలేనన్నారు"

నాగయ్య, ఆయాసతో పాటు మిగిలిన వాళ్లు లేచివచ్చారు. "వీడేదో పెద్ద ప్లాన్ వేశాడు. సరే...తెల్లారనీ! ఉదయం వీడి సంగతి తేలుద్దాం" అన్నాడు నాగయ్య ఇంటికి వెళ్తూ.

ఇన్‌స్పెక్టర్ రమణమ్మను అనుకున్న చోట దింపి, వ్యాను పోలీసుస్టేషన్‌లో విడిచి తిరిగివచ్చాడు. మునసబు అద్దెకు తీసుకుని రహస్యంగా దాచిపెట్టుకున్న ఇల్లు అది. ఆమెను అక్కడికే చేర్చాడు. మునసబునుచూసి రమణమ్మ మండి పడింది.

"నా జీవితం నాశనం కావడానికి కారకుడివి నువ్వు. తిరిగి నీదగ్గరికి ఈ ఇన్‌స్పెక్టర్ తెచ్చాడంటే మీఇద్దరిమధ్య ఏదో లావాదేవీ ఉంది. నిన్ను కేసులో నుండి విడిచిపెట్టడం ఎన్నడూ జరుగదు" అంటూ అరచింది.

మునసబు మాట్లాడలేదు. తనంతట తాను మాట్లాడటమంటే రెచ్చిపోవడమే అవుతుంది. దెబ్బతిందే మరింత కావ రంతో ఎవరు చెప్పినా వినిపించుకోదు" అందువల్ల ఇన్‌స్పెక్టర్ వచ్చేంతవరకూ ఓపికతో కూర్చున్నాడు.

ఇన్‌స్పెక్టర్ తిరిగివచ్చేసరికి ఎనిమిది గంటలైంది. ఆమె ఎదురుగా కూర్చుంటూ "ఏమంటున్నది?" అన్నాడు మునసబుతో.

"నేనేమీ మాట్లాడలేదండి" అన్నాడు మునసబు.

"రమణమ్మా! నీ బాగుకోరకే చెబుతున్నాను విను. ఈ కేసును రద్దుచేసుకో. నీకు కావలసిన డబ్బు ఇప్పించే పూచీ నాది. ఎక్కడికి వెళ్ళినా హాయిగా బతుకుతావు" అన్నాడు.

రమణమ్మ ఆగ్రహంతో మండి పడింది. "న్యాయం కాపాడవలసిన మీరే ఇలా అన్యాయంగా ఒక నీచుడికి సహకారంచేస్తే ఎలాగండీ? వీడు నా భర్తను చంపాడు. నా మరదల్ని చంపాడు. నా మానంతో ఆడుకున్నాడు. పిశాచం, చేతబళ్లు అంటూ నా ఆరోగ్యాన్ని కూడా నాశనం చేసాడు. వీడితో ఇంకా నన్ను స్నేహం చేయమంటారా? నా ప్రాణం పోయినాసరే వీడి నాశనంకొరకే పోరాడు తాను"

"నీవు అతివేషాలేస్తే చివర నీవన్నదే అవుతుంది. మర్యాదగా చెబుతున్నాను విను. ఇప్పుడు నేను ఇన్‌స్పెక్టర్‌నుగాను. మునసబు స్నేహితుడిని. అందువల్లే చెబుతున్నాను. నీకు కావలసింది చెప్పు, ఇప్పిస్తాను. సంధిచేసుకో. ఇద్దరూ బాగుపడతారు. ఆ ప్రెసిడెంటుగాడి మాటలు విని మోసపోకు. వాడో నీచుడని నీకూ తెలుసు"

"కావచ్చు. కాని ప్రస్తుతం అతడే మేలనిపిస్తున్నాడు"

"సరే! అవన్నీ విడిచిపెట్టు. రెండు పద్ధతులు చెబుతున్నాను. ఈ రెంటిలో ఏది ఒప్పుకున్నా నీకు మంచిదే! జరిగింది విడిచిపెట్టు. నీకు కావలసినంత డబ్బు లక్షరూపాయలయినా సరే, కేసు విత్‌డ్రా చేసుకుని వెళ్ళిపోతానంటే తెల్లారే ఇచ్చేస్తాడు. అలా కాదంటావా? ఎలాగూ అతడు నిన్ను అనుభవించాడు. నీకు కూడా ప్రస్తుతం 'నా' అన్నవాళ్లు ఎవరూ లేరు. అతను నిన్ను రెండో పెళ్ళి చేసుకుంటాడు. కొంత ఆస్తి నీ పేర రేపు ఉదయమే రాసిస్తాడు. హాయిగా మునసబు భార్యగా ఊరిలో గౌరవంగా జీవించవచ్చు. ఈ రెండూ కాదంటే నీవు బతికి బయట పడలేవని గుర్తుపెట్టుకో! రాత్రంతా ఆలోచించుకో. ఉదయం ఏ విషయం

నాతో చెప్పు. ఆవిధంగానే చేద్దాం"

"ఒకవేళ నన్ను చంపినా కేసు యధాప్రకారం ఉంటుంది. ప్రెసిడెంటు ఎలాగూ విడిచిపెట్టడు. నన్ను చంపితే మాత్రం వచ్చే లాభమేమిటి?" అంది రమణమ్మ కొంత వెటకారం ధ్వనించేలా.

అతను మాట్లాడలేదు. ఆమె చెప్పిందీ నిజమే! తెల్లారి ఈ మెసు తాను తీసుక రాలేదని బుకాయించి, ఆమెను ఏమయినా చేయగలడు. కాని అందువల్ల కేసుపోదు. మరింత బలంగా ఉంటుంది. ఆమెను కూడా చంపినట్లు ఇరికించడానికి, అందులో తనను కూడా ఇరికించడానికి వెనుదీయడు ప్రెసిడెంటు. అందువల్ల ఆమెను చంపితే లాభమేమిటి?

"నిన్ను చంపాలని మా ఉద్దేశం కాదు. నీవూ బాగుపడాలి, మునసబూ బాగు పడాలి. అదే పద్ధతిలో నిన్ను ఆలోచించుకోమంటున్నాను" అంటూ లేచాడు. "ఆలోచించు. ఉదయం చెప్పు"

మునసబుతో కలిసి బయటకు వచ్చాడు. "దాన్ని ఏమీ అనకు. ఆలోచించుకోనీ. కేసు విత్‌డ్రా చేసుకునేదాకా కాళ్ళయినా పట్టుకోవాలి. ఉదయమే వస్తాను" అంటూ రెండడుగులు ముందుకు వేశాడు. వెనుతిరిగి "డబ్బు తెచ్చావా?" అన్నాడు.

మునసబు లోపలకు వెళ్లి కర్చీఫ్‌లో మూటకట్టబడిన కట్టలను బయటకు తీశాడు. "ఎంత?" అన్నాడు వాటిని చూస్తూ సద్గుణరావు.

"యాభై వేలు"

"లక్ష ఇవ్వాలని చెప్పాగా? ఏమైనా జరిగితే నా ఉద్యోగం పోతుంది. ఈ డబ్బుకు గడ్డి తినే ఈ పని చేశాను. మిగిలింది కూడా ఇవ్వు"

"ఉదయం తప్పకుండా ఇస్తాను"

అతను వెళ్లిపోయాడు. మొత్తం లక్ష రూపాయలు అతడికి ఇస్తే రేపు దొరక కుండా తప్పించుకుంటాడేమోనని అతడి భయం. అందువల్ల సగం ఇచ్చి, సగం తన దగ్గిరే ఉంచుకున్నాడు. రమణమ్మ అంగీకరిస్తే, ఈ లక్షతో తన మెడకు ఉరితాడు తప్పుతుంది. అంగీకరించకుంటే చేయవలసింది అప్పుడు ఆలోచించాలి.

మునసబు లోపలకు వచ్చాడు. రమణమ్మ సోఫామీదపడుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది. మునసబును చూసి "నిన్ను నమ్మినందుకు, నమ్మి శరీరాన్ని అర్పించి నందుకు ఎందుకీ గతి తెచ్చావు? నలుగురిలో తలెత్తుకొని తిరక్కుండా చేశావు. రేపు బయటికి వెళ్తే మాత్రం ప్రాణాలతో బయట తిరగ్గలనా ? సంఘంలో ప్రతి నిముషం నన్ను అసహ్యించుకుంటూ చూస్తారు. ఆ చూపులకంటే విషం తిని చావడం మేలు" అంది.

మునసబు పలుకలేదు. ఏమాత్రం మాట్లాడినా రెచ్చిపోవలసి వస్తుందని అతడికి తెలుసు. ఆమె బాధ్యత ముసలమ్మకు అప్పగించి బయట మంచం వేసుకున్నాడు వసారాలో ! అన్నం తినమని ముసలమ్మ బతిమిలాడినా రమణమ్మ పలుకలేదు. చివరకు విసుగు పుట్టి చాప తెచ్చుకుని వేసుకుని పడుకుంది ముసలమ్మ.

* * *

ఎస్పీ సద్గుణరావు ఇంటికి వచ్చి భోజనం చేసి పడుకుందామనుకుంటూ ఉండగానే స్టేషన్‌నుండి ఫోన్ వచ్చింది. డ్రస్ వేసుకుని తొందర తొందరగా బయలు దేరాడు. స్కూటర్ స్టేషన్‌ముందు ఆపి తలెత్తి లోపలకు చూసేసరికి ప్రెసిడెంటు,




లాయరు సుబ్రహ్మణ్యం కూర్చుని ఉన్నారు. ఊపిరి పీల్చి గట్టిగా విడిచి, స్కూటర్‌కు స్టాండు వేసి లోపలకు వెళ్ళాడు.

"మీకు డి.యస్.పి. నుండి అర్జంట్ కాల్ వచ్చింది సార్!" అన్నాడు రైటర్. రిసీవర్ తీసుకున్నాడు.

"రమణమ్మ అనే మనిషిని అరెస్ట్ చేసి తెచ్చావటగదా!" అన్నాడు డి.యస్.పి.

"అరెస్ట్ కాదుసార్! కేవలం విచారణ కని తెచ్చాను"

"కేసు నా స్వాధీనంలో ఉంది. ఎవరు ముద్దాయిలో, కాదో నిర్ధారణ కాలేదు. నిన్ను విచారించమని నేను చెప్పలేదు. నీవు వెళ్ళి ఆమెను తీసుకురావటం ఎందుకు?" గద్దించి అడుగుతున్నాడు డి.యస్.పి.

ఆమెను విడిచిపెట్టాననీ, ఆమె వెళ్ళి పోయిందనీ చెబుదామనుకున్నాడు. ఆ తర్వాత ఎక్కడికెళ్ళిందో తెలియదని బుకాయించవచ్చు. కానీ అది ప్రమాదం! తన ఉద్యోగం పోతుంది. మునసబును కాపాడాలని ప్రయత్నం చేశాడు. నెర వేరనప్పుడు చేసేదేమీలేదు. ఆమెను విడిచిపెడదామనే నిర్ణయించుకున్నాడు.

"విడిచిపెట్టమంటే విడిచేస్తాను సార్! ఇంతకుముందు నేను గోపల్లె వెళ్ళి నప్పుడు తన ప్రాణరక్షణకు సహకారం చేయమని అడిగింది. ప్రస్తుతం ముద్దాయి అనబడే మునసబు బయట తిరుగు తున్నాడు. అతన్ని అరెస్ట్‌చేయలేదు. అతని వల్ల ప్రమాదం జరుగుతుందేమోనని అనుమానించి తెచ్చాను. ఆవిధంగా కొన్ని వివరాలు సేకరించాలనుకున్నాను"

"ఆమెను వెంటనే విడిచిపెట్టు. నేను తిరిగివచ్చేవరకూ ఈ కేసుగురించి నువ్వు ఇంట్రెస్ట్ తీసుకోవలసిన అవసరంలేదు. వెంటనే ఆమెను బయటకు పంపు"

చెమట తుడుచుకుంటూ రిసీవర్ క్రెడిల్‌మీద ఉంచి ప్రెసిడెంటువైపు ఉరుముతూ చూశాడు. 'వీడు ఈ ప్రెసి డెంటు సామాన్యమైనవాడు కాదు. అవు లిస్తే ప్రేవులు లెక్కపెట్టే విధంగా ఉన్నాడు. వీడితో వైరం తన తలకు కొరివిలాగుంది. మునసబు ఎలాపోతే ఏం చేయగలడు? తాను రక్షించే స్థితి దాటిపోయింది' అనుకున్నాడు.

డ్రైవర్‌ను పిలిచి వ్యాను స్టార్ట్ చేయ మన్నాడు. డ్రైవర్ తప్ప మరెవ్వరూ రావద్దనిచెప్పి వ్యాను ఎక్కాడు. యం.వి. నగర్‌లో మునసబు ఇంటివద్ద నిలిపి దిగి వెళ్ళి వసారాలో పడుకున్న మున సబును తట్టిలేపాడు. మునసబు ఉలిక్కి పడి లేచి డ్రెస్‌లో ఉన్న ఇన్‌స్పెక్టర్ని చూసి లేచి నిలబడ్డాడు.

"తలుపు తియ్యి" అన్నాడు ఇన్ స్పెక్టర్.

తాళం తీసి తలుపు తెరచాడు. "నేను నీకు సహాయం చేయడం సాధ్యంకాదు మునసబూ! దొరగారినుండి ఆర్డర్ వచ్చింది - ఆమెను వెంటనే విడువమని! తీసుకరాలేదని చెప్పే అవకాశంలేదు. ప్రెసిడెంటుగాడు స్టేషన్‌లోనే ఉన్నాడు. వాడు చాలా ఒత్తిడి తెచ్చినట్లున్నాడు. అందువల్ల దాన్ని విడిచిపెట్టక తప్పదు"

మునసబు ముఖం వివర్ణమైంది. తిన డానికి నోట్లో పెట్టుకునే ముద్దను కాలితో తన్నితే ఎంత విలవిలలాడుతుందో మునసబు అంత విలవిలలాడుతున్నాడు. కండ్లనీరు కారుతుంటే తుడుచుకునే ప్రయత్నం కూడా చేయకుండా నిల

బడ్డాడు.

అతనివేపు చూడకుండా రమణమ్మ వద్దకు వెళ్ళి పీపునతట్టి లేపాడు. "లే....నీ మిండగాడు వచ్చాడు. వెంటవెళ్ళవుగానీ"

పోలీసు మాటలు ఆమెకు తెలుసు. ఆ జాతికి చెందిన ఇన్‌స్పెక్టర్ నోట అయినా సరైన మాటలురావని తెలుసు. లేచి భుజంచుట్టూ పమిట కప్పుకుంది. ఎక్కడికి తీసుకెళ్తున్నారని అడుగలేదు. ఏం చేస్తారనీ అడుగలేదు. ఏంచేసినా భరించాలనుకుంది. వారికి ఇకలొంగి వారు చెప్పినట్లు వినకూడదని నిర్ణయించుకుంది.

ఇన్‌స్పెక్టర్ ముందు నడుస్తుంటే వెనుక ఆమె నడిచింది. వెళుతున్న ఇద్దరినీ చూస్తూ తలుపు పట్టుకున్నాడు మునసబు. ఇద్దరూ వ్యాను ఎక్కుతూనే వ్యాను కదిలింది. వ్యాను పోలీసుస్టేషన్‌కు వస్తూనే సెంట్రీవచ్చి నిలబడ్డాడు. సెగ చేశాడు ఇన్‌స్పెక్టరు. సెంట్రీ ఆమెవేపు వచ్చి డోర్ తెరిచాడు. వ్యాను దిగి స్టేషన్ లోనికిఅడుగుపెట్టింది. ఆమెను చూస్తూనే ప్రెసిడెంటు "రమణమ్మా" అంటూ అరచాడు గట్టిగా! రమణమ్మ వంచిన తల ఎత్తి అతనివేపు చూసింది. ఆమె ముఖంలో వెలుగు వెలిగింది. "ఎప్పుడు వచ్చావు?" అంది కళ్ళు టపటప కొట్టు కుంటూ ఉండగా.

"వెంటనే బయలుదేరాము. అన్ని పనులూ సరిపెట్టేటప్పటికి ఈ వేళయింది"

అతని దగ్గరగా ఆమె వచ్చింది.

"తీసుకెళ్ళవచ్చు. ఆమెతో ఇక పని లేదు" అన్నాడు తిరిగిచూడకుండానే ఇన్‌స్పెక్టర్. లాయర్ సుబ్రహ్మణ్యంతో కలిసి బయటకు వచ్చారు. రిక్షాఎక్కి సుబ్రహ్మణ్యం ఇంటివద్ద దిగారు.

ట్రాక్టర్, మనుషులు అక్కడే ఉన్నారు. వీరిని చూస్తూనే రిక్షాలదగ్గరికి పరుగెత్తు కొచ్చారు. శాస్త్రి రమణమ్మను చూసి "ఎక్కడున్నావ్?" అన్నాడు.

రమణమ్మ పలుకలేదు. రేపు జనానికి ఏవిధంగా ముఖం చూపించాలా అని మదనపడుతున్నది. ఇప్పటికే గ్రామంలో అల్లరిపట్టింది. ఆ గ్రామంలో మల్లారెడ్డి చనిపోవడం, డాక్టరు చనిపోవడం, లక్ష్మి చనిపోవడం, దొంగసరుకు బయటపడటం, కొందరిమీద కేసులు రావడం.... ఈమధ్య జరిగిన అన్ని సంఘటనలకూ తనే కారణం. ఆ విషయం జనానికి బాగా తెలుసు. ఇప్పటికే తనో వ్యభిచారి కింద జమకట్టి అనేక మంది మాట్లాడక పోవడమటుంచి ముఖం మీదనే అసహ్యకరంగా అనుకుంటున్నారు. వినా లంటేనే సిగ్గుగా ఉంది. అయినా అలాగే కాలం గడుపుతున్నది. ఈమధ్య రెండుసార్లు మునసబు జుట్టుపట్టు కొని వసారాలోనే కాలితో తన్నుతుంటే జనం చూశారు. ఇప్పుడు ప్రెసిడెంటు పంచన పడింది. తిరిగి కావాలని పంతా నికి తీసుకొచ్చాడు. ఇదో అల్లరిగ్రామంలో. ఇన్ని అల్లర్లు పట్టిన ఆ వూరిలో, ఆ జనంలో తాను తిరుగగలదా? తలెత్తుకుని తిరగడానికి తాను బజారు వేశ్యకాదు. ఆలోచిస్తూ ట్రాక్టరు ఎక్కింది.

ట్రాక్టర్ గోపల్లె చేరేసరికి అర్ధరాత్రి కూడా దాటింది. అంతవరకూ ఎవరూ ఒకరినొకరు పలుకరించుకోలేదు. ట్రాక్టర్ శాస్త్రిగారి ఇంటివద్ద ఆగుతూనే శాస్త్రి, రమణమ్మ దిగారు. ఉదయమే వస్తానని చెప్పి ప్రెసిడెంటు ట్రాక్టరు వెంట వెళ్ళాడు.

సీత తలుపు తెరచింది. వసారాలో నిలబడ్డ రమణమ్మను చూసి "లోపలకు

రా అక్కయ్యా" అంది.

"లోపలికెందుకు సీతా ? ఇప్పటికే నిద్ర సమయం మించింది. వసారాలోనే పడుకుంటాను" అంది.

సీత మంచం బయట వేసి పక్క పరచింది. అన్నం తినమని అడుగలేదు. ఆ సమయంలో వండాలన్నా సాధ్యం కాదు. శాస్త్రి మంచం బయట వేసుకున్నాడు. వసారాలో రమ హాయిగా నిద్రపోతున్నది. తలుపు వేసి, తాళంచెవి శాస్త్రిగారికిచ్చింది సీత. తన మంచంలో పడుకుంది.

రమణమ్మకు నిద్ర పట్టడం లేదు. ఉదయం ప్రెసిడెంటు మనుషులు వస్తారు. ఒక్కొక్కరు ఒక్కోరకంగా అడుగుతారు, మాట్లాడతారు. వారికి ఏమని జవాబివ్వాలి? ఇంతవరకూ తాను మునసబు కాళ్ల కింద పడివున్న వ్యక్తినని గ్రామంలో అందరికీ తెలుసు. ఇప్పుడు ప్రెసిడెంటు కాళ్లకింద పడివున్న వ్యక్తిగా భావిస్తున్నారు. జనం సహజంగా అలాగే అనుకుంటారు. నిజం కూడా అదే మరి! ఈ విధంగా ఒకరి కాళ్ల కిందపడి ఉండవలసిన అవసరం ఏమొచ్చింది? తన భర్త పోవడం, తాను ఏకాకి కావడం, అండ ఉన్న పిల్ల కామాంధుడి వాతపడటం, మరది అసహ్యించుకోవటం – ఆవిధంగా ఏకాకిగా తయారయింది. ఇప్పుడే ఇలా ఉంటే ఇక ఎంతో కాలం గడపాలి. 'పాతిక సంవత్సరాల వయస్సులోనే ఇన్ని బాధలు పడ్డాను. ఇంకా ఈ బాధలు పడక తప్పదా?' అనుకుంది. అరచేతితో నొసలు రుద్దుకుంది. కళ్లనుంచి నీరు ధారగా కారుతున్నాయి. ఆపడానికిగానీ, తుడుచుకోడానికి గానీ ప్రయత్నం చేయలేదు.

ఈ ఊరు తన వినాశనానికి కారకురాలు ఈ ఊరికే రాకుంటే తన జీవితం ఎలాగుండేదో? పొద్దున జనం ముఖం తాను చూడలేదు. చూసి, వారి అసహ్యపు చూపులు భరించలేదు, మాటలు విననూ లేదు. ఈ ఊరు విడిచి మరో ఊరువెళ్లే శక్తి సామర్థ్యాలు తనకు లేవు. హీనంగా బతకడంకంటే చావడమే నయం! లక్ష్మి చావగా తాను చావలేదా? లక్ష్మిలాంటి శక్తి తనకు లేదా?

'ఉంది' అనుకుంది దృఢంగా. తెల్లారి ఈ గ్రామం ముఖం తాను చూడకూడదు. కేసులో మునసబు చస్తాడా, బతుకుతాడా తనకనవసరం! ప్రెసిడెంటు గ్రామంలో పట్టు సంపాదించుకుని, తన దొంగ వ్యాపారం నిర్విఘ్నంగా సాగిస్తాడా లేదా తనకనవసరం! ఈ ఊరి జనం ఉదయం తనను చూసి నవ్వుతారా ఏడుస్తారా, జాలి చూపుతారా తన కనవసరం! నాకూ ఆత్మాభిమానం ఉంది. కానీ ఇంతవరకూ సుఖంగా బతకడం కొరకు దాన్ని దాచిపెట్టాను. ఈరోజు దాన్ని తెరుస్తున్నాను అనుకుంది.

మంచంలోనుండి లేచింది. వసారాలో రెండు మంచాల మీద ముగ్గురు ఆదమరచి నిద్రపోతున్నారు. ఎదురుగా చెట్టు మీద కాకులు అప్పుడప్పుడు అరుస్తున్నాయి. ప్రహరీగేటు తెరుచుకొని వీధివెంటసాగింది. వీధి మలుపులోనున్న బావి వద్దకు వచ్చి నిలబడింది. ఒకసారి చుట్టూ చూసింది. గోడ ఎక్కి బావిలోదూకింది.

తొలికోడి కూతలు కర్ణ కఠోరంగా వినిపిస్తున్నాయి అప్పుడే! ఊరి వెలుపలి శివాలయంలో దేవుడు నిద్రపోతున్నాడు.

[కథా సౌలభ్యం కోసం వాడుకోబడిన ఊళ్ల పేర్లూ, పాత్రలు పూర్తిగా కల్పితం]





# మీ నాన్నేం చేస్తాడు?..

"మదన్‌కుమార్ ... మదన్‌కుమార్" ఆఫీస్ ప్యూన్ అక్కడున్న అభ్యర్థులందరినీ చూస్తూ గట్టిగా అరిచాడు.

"నాన్నా .... వెళ్ళొస్తా" తండ్రికేసి చూస్తూ అన్నాడు మదన్ ప్యూన్ పిలుపు విని.

"అలాగే వెళ్ళరా, జవాబులు జాగ్రత్తగా చెప్పు" దీనంగా కొడుకువంక చూస్తూ అన్నాడు తండ్రి.

తల వూపుతూ వెళ్ళి ఇంటర్వ్యూ ఛాంబర్‌లోకి అడుగుపెట్టాడు మదన్.

రౌండ్ టేబుల్ చుట్టూ అయిదుగురు ఆఫీసర్లు కూర్చున్నారు.

"నమస్కారం సార్" అన్నాడు మదన్.

"నమస్కారం"

ఇంటర్వ్యూ ప్రారంభమయింది.

"మీ పేరు?"

"మదన్‌కుమార్"

"ఏం చదివావ్?"

"ఎమ్. ఎ"

"ఏ గ్రూప్?"

"ఎకనామిక్స్"

"ఏ డివిజన్?"

"సెకండ్ డివిజన్"

"ఎన్నాళ్ళయింది పాసయి?"

"నాలుగేళ్ళు"

"ఇన్నాళ్ళేం చేశావ్?"

"ఎంప్లాయ్‌మెంట్ ఎక్చేంజి చుట్టూ తిరుగుతున్నాను"

"నాలుగేళ్ళనుండి మీకే కాల్ రాలేదా?"

"రాలేదు సార్"

"ఏ సినిమాలు ఇష్టం?"

"తెలుగు సినిమాలు"

"ఏ హీరో ఇష్టం?"

"కమలహాసన్"



# కోతలు



తప్ప లోన్ దొరకలేదు సార్"

"మళ్ళీ ఓసారి ట్రై చేయకపోయావా? ప్రభుత్వం మీలాంటివాళ్ళకు ఎంతో సహాయం చేస్తోంది గదా?"

"నేనూ, మా నాన్నా కూడా అలసి పోయేదాకా తిరిగాం సార్ ...కానీ దొరక లేదు"

"మీ నాన్నేం చేస్తాడు?"

"నా తర్వాత ఇంటర్వ్యూకి మీ ముందుకొచ్చే అభ్యర్థి మా నాన్నే సార్...ఆయన్నే అడగండి సార్!"

—సి. హెచ్. సనత్ కుమార్

"ఇవాళ ఏం కూర తిన్నావ్ ?"

"బెండకాయ"

"ఇన్నాళ్ళు ఊరికే వుండక ఏదయినా స్వయంఉపాధి పథకం కింద లోన్ తీసు కొని బిజినెస్ చేయకపోయావా"

"నాలుగు చెప్పుల జతలు అరిగాయి



# ఉపాయం.

రాజారావు ఆఫీసులో అడుగు పెట్టా డన్న మాటే కాని అతని మనసంతా ఇంటిమీదే ఉంది. మనసు పనిమీద లగ్న మవడం లేదు. కుర్చీలో నిలకడగా కూర్చొలేకపోతున్నాడు.

అందుకు మరీ పెద్ద కారణమేమీ లేదు. రాజారావు కొన్నాళ్ళ క్రితం నగర శివార్లలో చౌకగా వచ్చిన భూమి కొని అందులో ఓ చిన్న ఇల్లు కట్టుకున్నాడు. చెదురుమదురుగా తప్ప అక్కడ ఇంకా ఇళ్లు ఏవీ పడలేదు. కాస్త నిర్జన ప్రదేశం లానే వుంటుంది ఆ కొత్త ప్రదేశం. కొత్త ఇంట్లో చేరి వారం రోజులు కూడా కాలేదు. ఆరోజే ఆఫీసుకి వచ్చాడు. వచ్చిన దగ్గరినుంచి భార్య రమణి ఎలా ఉందోనని ఆందోళనగానే ఉంది అతనికి. ఫోన్ చేద్దామన్నా ఇంటికి దరిదాపుల్లో ఆ సౌకర్యం లేదు. అసలే భయస్తురాలు 'ఏం చేస్తోందో ఏమో?' అనుకున్నాడు రాజారావు. వాళ్ళకి పెళ్ళయి ఏడాదే

అయింది. పని చేసుకుంటుండగా అతనికి రకరకాల దొంగతనం జరిగిన సంఘట నలు, పేపర్లో వార్తలు గుర్తుకు వస్తు న్నాయి. పేపర్ బాయ్‌లాగా, కరెంట్ రీడింగ్ చూసేవాళ్ళుగా వచ్చి నగానట్రా ఎత్తుకుపోయిన వార్తలు కళ్ళకుకట్టినట్టు కన్పించాయి.

ఇక సీట్లో కూర్చోలేకపోయాడు. వెంటనే హాఫ్‌డే సెలవుపెట్టి ఇంటికి బయలుదేరాడు.

ఇంటికి చేరేసరికి తలుపు లోపల నుంచి గడియ వేసి వుంది. గుమ్మం ముందు మగవాళ్ళ చెప్పులు ఉన్నాయి.

రాజారావు ఆ చెప్పులను చూసి షాక్ తిన్నాడు. 'నేను లేనపుడు ఎవడన్నా వచ్చివెళ్ళుతున్నాడా కొంప తీసి' అనుకున్నాడు. ఆ క్షణంలో అతనికి రకరకాల ఆలోచనలు వచ్చాయి.

ఆలోచిస్తూనే తలుపుతట్టాడు. కళ్ళు నులుముకుంటూ వచ్చి తలుపు తీసింది రమణి.

రాజారావుని చూసి ''ఏమిటి ఇంత త్వరగా వచ్చేశారే?'' అని ఆశ్చర్య పోయింది.

రాజారావు భార్యకి సమాధానం చెప్ప లేదు. లోపలికి పోయి అన్ని గదుల్లో చూశాడు. ఎవరూ కనిపించలేదు. వెనక తలుపు తెరిచి వుండటం కనిపించింది. వచ్చినవాడు వెనక తలుపుగుండా వెళ్ళి పోయివుంటాలి అనుకున్నాడు.

"వెనక తలుపు తెరచి వుందేమిటి?" అని అడిగాడు భార్యని.

"అదా..కరెంటు పోయింది. ఉక్కగా వుందని తలుపు తెరచి వుంచాను" అంది రమణి. వెంటనే రాజారావు స్విచ్ వేశాడు. లైట్లు వెలిగాయి.

"మీరు రాగానే కరెంటు కూడా వచ్చింది చూశారా!" చిరునవ్వుతో అంది రమణి.



ఎన్ని అబద్ధాలు ఆడుతోంది అను కున్నాడు రాజారావు. కాని ఇప్పుడు ఏమని అడుగుతాడు. నా కళ్లు కప్పి ఎన్నాళ్ళుగా ఇలా చేస్తోందో? సాక్ష్యాధారాలతో రెడ్ హేండెడ్‌గా పట్టుకొని ఇంట్లో నుంచి వెళ్ళగొట్టవచ్చు. అప్పటివరకూ ఓపిక పట్టాలి అనుకున్నాడు రాజారావు.

మర్నాడు...

పర్మిషన్ తీసుకొని తొందరగా ఇల్లు చేరాడు. తలుపు వేసివుంది. యధా ప్రకారం క్రితంరోజు చెప్పులు దర్శన మిచ్చాయి.

తలుపు తట్టగానే రమణి వచ్చి తలుపు తీసింది. ఇంటికి కొన్ని గజాల దూరంలో గొడవ జరగడం వినిపించింది.

"ఏమిటి సంగతి?'' అని అడిగాడు భార్యని.

"ఎవడో దొంగ ఆ దగ్గర్లో వున్న ఇంట్లో దూరి కత్తిచూపి ఇంటావిడను బెదిరించి బంగారం నగలు ఎత్తుకు పోయాడట'' అని చెప్పింది రమణి. కాస్సేపాగి "రోజూ నేను చేసినట్లు చేస్తే వాళ్ళింట్లో దొంగలు పడివుండేవారు కాదు గదా" అంది రమణి, కన్నుగీటుతూ కొంటెగా.

"నువ్వేం చేస్తున్నావేంటి రోజూ?" అని అడిగాడు రాజారావు.

"గుమ్మంలో మగవాళ్ళ చెప్పు లున్నాయి. చూడలేదా మీరు. నేనే వాటిని అక్కడ వుంచుతున్నాను రోజూ. ఎవ రన్నా వచ్చినా ఇంట్లో మగవాళ్ళు వున్నారు అనుకుంటారు" అంది గర్వంగా.

రాజారావు నిశ్చింతగా నిట్టూర్చాడు. తన అనుమానానికి తనని నిందించు కున్నాడు. అమాంతం రమణిని వాటేసు కుని ముద్దులు కురిపించాడు.

# కరెక్ట్...

సుందరం ఓ చిరుద్యోగి. కొత్తగా పెళ్ళయింది. అంతకు ముందు ఆఫీసు లోని మరో ఇద్దరు బ్రహ్మచారులతో కలిసి ఓ గదిలో ఉండేవాడు. ఇప్పుడు పెళ్ళయింది. గనుక శ్రమపడి వీధులన్నీ తిరిగి తిరిగి ఓ చిన్నగదిని సాధించ గలిగేడు. ఒక్కటే గది, అవతల చిన్న వరండా. వరండాకి గ్రిల్ బిగించి వంట గదిగా చేశారు. ఆ వరండా కూడా ఇరుకుగా ఉంది. అయినా దానికే మహా సంతోషపడిపోయి సీతామహాలక్ష్మిని తీసు కొచ్చి కాపురం ప్రారంభించేశాడు సుందరం.

భార్య తను తెచ్చిన సామానునంతా వంటగది అనబడే ఆచిన్నవరండాలోనూ, గదిలోనూ సర్దేసింది. వంట సామానుల్తో వంటగది అంతా సరిపోయింది. వంట చేసేటపుడు అక్కడ ఒకరికన్నా చోటు వుండదు నిలబడటానికి కూడా. వాటన్ని టినీ సర్దితే గాని తలుపు వేయడానికి కూడా వీలవదు. అందువల్ల గదిలో ఏమి జరిగేదీ ఎప్పుడూ చూడవచ్చు. అదీ గాక గది కిటికీకి ఒక తలుపు చెక్క లేదు. త్వరలో బిగిస్తానని ఇంటి యజ మాని హామీ ఇచ్చాడు. కానీ, తర్వాత మర్చిపోయినట్లున్నాడు.

అన్నీ సర్దుకొని భోజనాలు చేసేసరికి రాత్రి పది అయింది. తలుపు వేసి గది లోకి వచ్చిన సీతామహాలక్ష్మిని కౌగి లించుకున్నాడు సుందరం.

"ఛీ...వదలండి...దూరంగా పడు కోండి" అందావిడగారు ముడుచుకుంటూ నెమ్మదిగా.

పొద్దుటి నుంచి పని చేసి, సామాను సర్ది అలిసిపోయి ఉంటుందిలే అనుకున్నాడు సుందరం. భార్యమీద జాలి వేసింది. "బాగా అలసిపోయినట్లున్నావు, నిద్రపో" అన్నాడు.

మర్నాడు తప్పనిసరి తద్దినంలా యథాప్రకారం ఆఫీసుకి బయలుదేరాడు.



సుందరం అలా గుమ్మం దాకా వెళ్ళగానే సీతామహాలక్ష్మి దగ్గరగా వచ్చింది. "ఏమండీ... ఆఫీసునుంచి వచ్చేటపుడు ఓ కర్టెన్ గుడ్డ తీసుకురండి" అంది.

'ఇది చెప్పేవరకూ నా బుర్రకి తట్టనే లేదు. తలుపులోంచి, కిటికీలోంచి ఎవరైనా చూస్తారేమోనని సిగ్గుపడి ఉంటుంది రాత్రి. పాపం చెప్పడానికి సిగ్గుపడి అలా తోసేసినట్లుంది. సరే ఆదేదో సాయంత్రం తెచ్చిపెట్టాలి' అనుకున్నాడు.

'అలాగే' అని చెప్పి వెళ్ళిపోయాడు సుందరం. ఆఫీసులో పెండింగ్ వర్క్ అంతా పూర్తి చేసి ఆలస్యమయిపోయిందని హడావిడిగా పరిగెత్తుకు వస్తూ కర్టెన్ సంగతే మర్చిపోయాడు సుందరం.

ఆ రాత్రి కూడా సీతామహాలక్ష్మి అతన్ని దగ్గరకి రానివ్వలేదు. తన మతిమరపుకి తననే తిట్టుకుని ఎలాగైనా రేపు కర్టెన్‌గుడ్డ తీసుకురావాలి అని గట్టిగా నిశ్చయించుకున్నాడు.

మర్నాడు ఒక గంట పర్మిషన్ అడిగి బజారుకి వెళ్ళి కర్టెన్ క్లాత్ కొని ఇల్లు చేరాడు. లోపలికి పోగానే భార్యకి పాకెట్ విప్పి చూపించాడు. కాని అతను ఊహించినట్లు సీతామహాలక్ష్మి ఆనందంతో ఉప్పొంగిపోలేదు. "అబ్బా... ఇంత పెద్దది తీసుకువచ్చారేమిటి? మీరు ఆఫీసుకి వెళ్ళాక పాత చీర చింపి కర్టెన్ గుడ్డ చేశాను. అదిగో వెంకటేశ్వరస్వామి ఫొటోలకి వేలాడదీశాను కూడా చూడండి" అంది గోడకి తగిలించిన ఫొటోలు చూపించి.

"గుమ్మానికి తెమ్మన్నావు అనుకున్నాను. ఆ ఫొటోలకి కర్టెన్ ఎందుకు?" అర్థం కానట్లు అడిగాడు సుందరం.

"అదా... రాత్రిపూట దేవుడు మనవైపు చూస్తోంటే మీ పక్కన ఎలా పడుకోను" సిగ్గుపడుతూ అంది సీతామహాలక్ష్మి.

సుందరం నవ్వబోయి సీతకు కోపం వస్తుందేమోనని "అవునవును" అనేశాడు లోలోపల ఏడుస్తూ.

—తుషార

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly Eenadu Compound, Hyderabad - 500 004.




'నేను పెద్దయ్యాక
హాస్యకథలే చదువుతాను
బిస్కట్లే తింటాను..!'






పిల్లలు ప్రేమించేది పార్లే గ్లూకో-
మరింత రుచికరమైన,
శక్తినిచ్చే ఆహారం.







పార్లే
గ్లూకో




భారతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్